The Largest Circulated Telugu Monthly

# చతుర

జూలై 1995 రూ. 6/-




కమ్యూలేషన్ బహుమతి పొందిన నవల

# 'గట్టుమీద చేప'పై సమీక్షలు

**మే నెలలో ప్రచురితమైన, నవలల పోటీలో ద్వితీయ బహుమతి రూ. 7,500/- పొందిన పి.చంద్రశేఖర ఆజాద్ నవల 'గట్టుమీద చేప'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## భవిష్యత్‌కు హెచ్చరిక!

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

తెలుగు సాహితీరంగంలో 'చతుర'దొక ప్రత్యేకస్థానం. ఆరు రూపాయలకే ప్రతి నెలా మంచి నవలలను అందిస్తూనే చతుర నవలా పోటీలు కూడా పెట్టి మణిపూసల్లాంటి నవలలను ఎన్నికచేస్తున్నది. అదే హారంలో మరో మంచిముత్యం ఈ నెల నవల 'గట్టుమీద చేప'.

మాఫియాలు, గ్యాంగువార్లు, సుడోసైన్సు, సెక్సు లేకుండా ఈ రోజుల్లో నవల రావడం లేదన్న విషయం ప్రతి పాఠకుడికి తెలిసినదే. అలాంటివాటికి దూరంగా మన చుట్టూ జరుగుతున్న ప్రపంచాన్ని విడమర్చి కళ్ళ ముందుంచాడు రచయిత. చక్కగా సాఫీగా సాగే రవీంద్ర జీవితంలో చేపల- పెంపకం రేపిన కల్లోలం సగటు ఉద్యోగులలో ఆలోచనలను రేకెత్తిస్తుంది.

'డబ్బు'తో దేనినైనా కొనచ్చుకాని నిజమైన ఆనందాన్ని కాదు అనే విషయం చక్కగా చెప్పారు రచయిత. మనం పొందే ఆ ఆనందమంతా తృప్తినిస్తోందా? బంగళాలు, కార్లు, చీరలు, నగలు ఇవన్నీ నిజంగా ఆనందాన్నిచ్చేవేనా? అంతా కృత్రిమం, తాత్కాలికం అనే సత్యాన్ని మన ఆలోచనల్లో రేకెత్తించారు రచయిత.

ఉద్యోగం వదులుకుని చేపల వ్యాపారంలోకి వచ్చే ముందు గోపాలావు చెప్పిన మాటలు గొప్పగా వున్నాయి. రవీంద్ర కాలక్రమంలో ఎన్నిరకాల వ్యసనాలకు బానిసయ్యాడో! దాంతో జీవితంలో ఏం పోగొట్టుకున్నాడో! కనీసం కొడుక్కు ఉత్తరం రాసేతీరిక లేకుండా... షేర్ల పిచ్చిలో పడి నానాటికి మానసికంగా దూరం అయిన అతని భార్య వసుంధర నేటి సోకాల్డ్ స్త్రీలకు ప్రతీక. ఈనాడిది చేపలనుండి 'ఆక్వా' కల్చర్‌గా మారింది. ఈ కల్చర్ రాబోయే తరాలకు నీడనిచ్చే చెట్టునుకూడా ఆ భూమిలో లేకుండా చేస్తుందనే భయంకర సత్యాన్ని 'కోనసీమ' రైతులు తెల్సుకొని జాగ్రత్త పడాల్సిన విధంగా ఆలోచనల్ని రేకెత్తించిందీ నవల. రచయితకు, ప్రచురించిన 'చతుర'కు మరోమారు కృతజ్ఞతలు.

**- అన్నమ్మ,**
జ్యోతినగర్

## అసమగ్ర చిత్రణ
## అతకని ముగింపు

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

రచయిత ఎన్నుకొన్న చేపల/ రొయ్యల చెరువులు, షేర్‌మార్కెట్ రెండింటికీ కూడా నవలలో సంపూర్ణ న్యాయం జరుగలేదు. చేపల చెరువులు ఏవిధంగా తవ్వాలి? సీడ్ తయారీలో వచ్చిన మార్పులు, ఏమేం మందులు వాడాలి? మార్కెట్లో ఏవిధంగా



అమ్ముకోవాలి? వగైరా వివరాలతో నిండిన వ్యాసానికి 'ఎస్సే రైటింగ్ కాంపిటీషన్'లో బహుమతి ఇచ్చినట్లుగా ఉన్నది. అందులో కూడా అతి ముఖ్యమైన రెండు అంశాలు ప్రస్తావించని ఈ నవల నిజంగా 'గట్టుమీద చేప' క్రిందే లెక్క.

వైరస్ వాత పడిన రొయ్యల చెరువులు కోలుకోలేని దెబ్బతినడం. పెద్దపెద్ద పేరున్న ఆక్వాకంపెనీల (పబ్లిక్ ఇష్యూ ఎన్నోరెట్లు ఓవర్ సబ్‌స్క్రైబ్ అయినవి గూడా) షేర్లు ముఖవిలువ 10/- దిగువకి పడిపోయిన విషయం మొదటిది.

రెండోది: పబ్లిక్ ఇష్యూకి వస్తామని వాగ్దానం చేసి ఇన్వెస్టర్స్ యొక్క వేలంవెర్రిని ఆధారంగా చేసికొని అనఫీషియల్ ప్రీమియం వసూలుచేసి ప్రమోటర్ల కోటాక్రింద షేర్లు అంటగట్టిన ఎన్నో కంపెనీలు ఈనాటివరకు అడ్రస్ లేకపోవడం. విచిత్రమైన విషయం ఏమిటంటే హైదరాబాదులో ఇంటిమీద పెట్టిన పెట్టుబడి 'డెడ్ కాపిటల్'గా చిత్రీకరించి, ఇటువంటి షేర్లమీద పెట్టిన పెట్టుబడి 'డెడ్‌కాపిటల్' అవుతుందో లేక 'డెడ్' అవుతుందో ప్రస్తావించకపోవడం.

ఇల్లు అమ్ముదామన్న వత్తిడి ఇంటి గృహిణి వసుంధర వైపునుంచి రావడంకూడా కృతకంగా ఉన్నది. లోకంలో లక్షమంది గృహిణులను ఇంటర్వ్యూ చేసినా ఒక్కరుగూడా స్వంత ఇంటిని వదులుకోవడానికి సిద్ధపడరు అన్నది జగమెరిగిన సత్యం.

ముగింపు ఇంకా సత్యదూరంగా ఉన్నది. రెండు సంవత్సరాలలో బిజినెస్‌లో ఢక్కామొక్కీలు తిన్న రవీంద్ర తిరిగి ఉద్యోగంలో జాయిన్ అవకుండా, కొబ్బరితోటలో, పర్ణశాలలో ఉండటం నేల విడిచి సాముచేసినట్లుగా ఉన్నది.

-ఎన్.భాగ్యలక్ష్మి
చీరాల.

# బలంగా చెప్పలేదు

**(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

"గట్టుమీద చేప"లాంటి సాధారణ నవల... ద్వితీయ బహుమతి పొందడం ఆశ్చర్యంగా ఉంది. 'చతుర'లోనే ఈ మాదిరి కథా వస్తువు, గతంలో నవలలు వచ్చాయి. వేరువేరు వ్యాపార జీవనసరళిలో రాయబడిన పాత్రల పోకడ రచనాశిల్పం ఒక్కటే మరి.

ఆక్వాకల్చర్‌మీద ఇన్‌వెస్టిగేషన్ నవల అంటే సరిపోతుంది. ఇంతకీ రవీంద్ర... ఆక్వాకల్చర్‌లో మోసగింపబడినందువలన చివరకు మారాడా?, విచ్ఛిన్నమౌతున్న కుటుంబ వ్యవస్థకు చలించి మారాడా? రెండింటికీ ఆధారాలున్నాయి. మోసపోకుండా ఉంటే, వ్యసనాల పాలవకుండా ఉంటే ఆక్వాకల్చర్‌లో ఉండవచ్చునా? ఆక్వాకల్చర్ వలన కలిగే నష్టాలను చెప్పకపోతే బాగోదని కాబోలు మొక్కుబడిగా చెప్పారు గాని బలంగా చెప్పలేదు. రచయితకు ఆదర్శ రచయితని అనిపించుకోవాలనే మోజు ఎక్కువగా ఉన్నట్లుంది. పేరలల్‌గా సాగిన షేర్ మార్కెట్‌పై ఉండాల్సిన విసురు లేదెందుకని? ఉపసంహారంలో రంగుల టీ.వీ., వి.సి.ఆర్. ఉంది. అని రాసారు. ప్రపంచ సినిమాకి చెందిన క్లాసిక్స్ సేకరించి పెట్టుకున్నాడని రాసారు. ప్రపంచాన్ని టి.వి.ద్వారా చూస్తున్నారు. సరే! టి.వి.ద్వారా ఎలాంటి ప్రపంచాన్ని తెలుసుకుంటున్నారో వివరణ లేదు. శ్యామ్ తన రోగం ఏమిటో తెలుసుకోవడానికి అమెరికా వెళ్తున్నాడు... ఏం... ఇండియాలో ఆ రోగంనిర్ధారణ కాదా? అసలా చిత్రమైన రోగం ఏమిటి? రచయిత ఏదో రాసేసారు. అదో సస్పెన్స్. 'పూజ'లాంటి పాష్ కాల్‌గర్ల్స్ ఇలాంటి సమాజంలో ఉన్నారో లేదో మరి... అక్కడక్కడా చదివిన సన్నివేశాలు, పాత్రల పోకడలు గుర్తుకు రావడం తప్ప- రచయిత సృజనాత్మకత కనిపించదీనవలలో. వెరసి ఒక సాధారణ నవలకు చతుర వారు సెకెండ్ ప్రైజ్ ఇవ్వడం





ఆశ్చర్యం కలిగిస్తోంది. ఇంతకంటే మంచి నవలలు రాలేదనే అనుకోవలసి వస్తోంది మరి.

-చింతల ఈశ్వరరావు,
విజయవాడ

## సకాల స్పందన

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'ఏ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం' అన్నట్లు ఒకప్పుడు పొగాకు, ఇటీవల పత్తి ప్రస్తుతం షేర్లు, చేపలు, రొయ్యలు! అంశంలో మాత్రమే తేడా! అన్నిటి ఫలితం ఒకటే!! 'అతి సర్వత్ర వర్జయేత్' అనే సామెత తను మరచి డబ్బుకోసం అర్రులు చాచి, స్థాయిని మరచే ప్రతి ఒక్కరి చరిత్రే "గట్టు మీద చేప".

బంజరు భూముల్నే చేపల చెరువులుగా మార్చాలన్న కనీస నియమాన్ని మరిచి జనావాసాలకు అత్యంత సమీపంలోని వ్యవసాయక భూములను కూడా చేపల చెరువులుగా మార్చి సామాన్య జనాల భవిష్యత్తుతో చెలగాటమాడుతున్నారు. నవల్లో చదవడం కాదు! కోస్తాజిల్లా నివాసిగా ఇందులో ప్రస్తావించిన ఏదీ సత్యదూరం కాదని ఘంటాపథంగా చెప్పగలను. అజాద్‌గారి ఆక్వాకల్చర్ పరిజ్ఞానం అమోఘం. భవిష్యత్తులో ఈ చేపల కంపు ఏ మలుపు తిరుగుతుందో కానీ, ప్రస్తుత పరిస్థితి మాత్రం అగమ్యగోచరం!

సమకాలీన సమస్యపై సకాలంలో స్పందించి మంచి కథనంతో సమస్యను విశ్లేషణాత్మకంగా వివరించిన అజాద్‌గారికి నా హృదయ పూర్వక అభినందనలు.

-ఆర్.వి.ఎస్.ప్రసాద్
నెల్లూరు

## మధ్యతరగతి చేపలు

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'చేప' తన పరిధిలో పెరుగుతూ ఒక్కోసారి ఎగిరెగిరి చెరువులోంచి బయట పడుతుంది. బహుశా దానికి చెరువుకంటే గట్టు అందంగానూ, ఆకర్షణీయంగానూ కనిపిస్తుందేమో! అయితే అది పొరపాటునో లేక గ్రహపాటునో గానీ గట్టుమీద పడ్డప్పుడు గింజుకు చస్తుంది. ఇదేవిధంగా మధ్యతరగతి మనిషి కూడా ఉన్నదాంతో తృప్తిపడకుండా లేనిదానికోసం అర్రులుజాచి అవస్థపడతాడు. నేటి సమాజంలో చాలామందిలో ఉండే ఈ భయంకర మానసిక రుగ్మతను గూర్చి చాలా చక్కగా నవలా రూపంలో వివరించారు రచయిత చంద్రశేఖర అజాద్!

సంతృప్తిగల జీవితాన్ని అనుభవిస్తూ... జీవించడం కోసం, వ్యక్తిత్వం కోసం ఉద్యోగం చేసే రవీంద్ర స్నేహితుడి ప్రభావంవల్ల డబ్బు, హోదా సంపాదించడం కోసం కృత్రిమమైన అసంతృప్తి జీవితాన్ని చవిచూడటం చాలా సహజంగా వివరించారు.

స్త్రీలు కూడా ఆర్థిక రంగంలో ముందడుగు వేయడాన్ని వసుంధర పాత్ర సూచిస్తుంది.

ఉపసంహారంలో రవీంద్ర చెరువులు అమ్మేసి ఏ విధమైన టెన్షన్‌కు లోనవకుండా ప్రశాంతంగా జీవిస్తూ 'ఈ జీవితం ఇలా ఉంటేచాలు... ఇంకే గాలికీ నేను కొట్టుకుపోకూడదు' అనుకుంటాడు. అయితే అతని భార్య వసుంధరకి అది ఎంతవరకో అని అనుమానమే అంటూ ముగించారు రచయిత. కాని భర్త చెంపదెబ్బ కొడితే తిరిగి అతని చెంపఛెళ్లుమనిపించిన ఆ భార్య హఠాత్తుగా మారిన భర్త జీవన విధానానికి అనుగుణంగా తనూ మారగలదా... అనేది అనుమానమే!

ఇంత చక్కటి నవల రాసిన రచయితకు, దీని విలువను గుర్తించి బహుమతి నిచ్చిన 'చతుర'కు హృదయపూర్వక అభినందనలు!!

-ఎన్.ఎమ్.కె.చౌదరి
నేలటూరు





... అలా చివరిపాఠం విని క్లాస్‌రూం బయటకొచ్చాం. వీడ్కోళ్లూ, విషాదాలూ, స్వరాల్లో నరాల్లో విద్యుత్ తరంగాలు. ఈ క్యాంపస్... ఎన్ని ఉద్యమాల్ని ప్రసవించి, ఏయే పాదస్పర్శలతో పునీతమయి, పంకిలమయి, ఏయే అజ్ఞాతాలకీ, అరాచకత్వానికీ , అజ్ఞానానికీ, రోదనలకీ నెలవ య్యి... ఆనాడు ఓ గాయకుడ్ని (?) వేదికనెక్కించి ఆ మహోగ్రపు గొంతులో తమ ఆకాంక్షల్ని వెతుక్కొని కన్నీరు చిందించిన తరానికీ... ఈనాడు ఆ వేదికపైనే 'ఆడప్రాణి' కన్పిస్తేనే కాంక్షగా 'నియాండర్‌థల్ శబ్దాలు' చేసే ఈ తరానికీ సాక్షిగా నిలిచి...

ఈ గాఢమయిన నిశ్శబ్దంలో నాలో సంచలనం కల్గింది. అదే ఈ నవల. అదృష్టవశాత్తూ వ్యాపార నవల మరణశయ్యపై వేచివున్న వర్తమానంగదా ఇది! ఈ పుణ్యకాలం ముగిసేలోపు మంచి నవల రాకపోతే మరిక గీపెట్టి లాభం ఉండదు. అందుకై పారేసిన కలాల్ని వెతుక్కొందాం, ఇప్పుడైనా సమాజాన్ని షాక్ చేస్తున్న దళిత స్త్రీవాదాల్ని ఆహ్వానిద్దాం. వాటి పరిమితుల్నీ, అరాచక మూలాల్నీ అర్థం చేసుకొంటూనే సమస్త పీడనలపైనా చూపుని విస్తరింపచేయాలి - ఏ వాయిదాలూ లేకుండా - అన్ని గుంపుల్నీ రెండుగా చీల్చివేయగల అసలు వైరుధ్యాన్ని మర్చిపోకుండా.

అప్పుడొకసారి అందాకా నమ్మిన జీవితంపై దేవతావస్త్రాలు జారిపోవటంతో రాసిన 'తొలిఅడుగు' నవల 'చతుర'లో (91)లో వచ్చింది. ఈమధ్య సుప్రభాతం కథల పోటీలో వచ్చిన 'తెలుపు'తోపాటు ఆరేడు కథలు రాశాను. మానవ సంబంధాల్లోని అబ్సర్డిటీని చూస్తూ నవ్వాపుకోలేక పోతుంటానెప్పుడూ - కథనంలో కూడా. అందుకే సెటైర్ ఇష్టం. రాయలేని నిస్సత్తువ ఆవరిస్తే బాధల అగాధాల్లోంచి దారిద్ర్యపు గనుల్లోంచి పాకివచ్చిన తెలుగు స్పార్టకస్ 'శారద' ఓదార్చుతాడు. అందుకే శారద రచనలన్నీ వేయాలన్న తపన.

ఈ రచన వెనుక ఆత్మీయులైన గురువుల ప్రోత్సాహం, అనేకమంది నేస్తాల భాగస్వామ్యం ఉన్నాయి. ఈ భూమ్మీద ఇంకా బతికుండొచ్చునన్న ఆకాంక్షను కల్గిస్తూ... ఓ నూతన మానవుడ్ని ఆవిష్కరించేందుకై సుదీర్ఘాన్వేషణ సాగిస్తున్న వారి తపనే ఈ రచన అనుకుంటున్నాను.

-సురేష్

సంపుటి: 18
సంచిక: 6
జూలై 1995

అమ్మ ఒడిలాంటి ప్రశాంతమయిన పల్లె వాతావరణంలో, అమాయక స్నేహబంధాలమధ్య కాలేజి చదువు ముగించిన అతడు... కొత్తగా... బెరుగ్గా... నగరానికి చేరి... విశ్వవిద్యాలయపు మెట్లెక్కాడు.

**రకరకాల ప్రవృత్తులు, ప్రవర్తనలమధ్య... క్రమంగా తల్లినీ, ఊరినీ, స్నేహితుల్నీ మరిచి... పరుగెత్తే కాలంతో, పరుగెత్తించే స్నేహితుల ప్రభావాలతో... చివరకు అతడెలా మిగిలాడు?**

ఉన్నత విద్యనీ, సభ్యతా సంస్కారాలని అందించి విద్యార్థి మేధోశక్తిని నిగ్గు తేల్చవలసిన ఆ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో... విద్యార్థులు కోరుకుంటున్నదేమిటి? పొందడానికి ప్రయత్నిస్తున్నదేమిటి?

**ఉన్నతవిద్యలు వాళ్లని ఉన్నత సంస్కారవంతులుగా నిలబెడుతున్నాయా?**

విశ్వవిద్యాలయ విద్యార్థుల విద్యా జీవన తీరుతెన్నులను విశ్లేషిస్తూ, నవలల పోటీలో **కన్సొలేషన్ బహుమతి రూ. 5,000/- పొందిన కె. సురేష్ రచన 'ది యూనివర్సిటీ' ఈ నెల 'చతుర' సమగ్రనవల.**

# ది యూనివర్సిటీ

— కె. సురేష్.

రిక్షాలోంచి దిగాడు శరత్.

రిక్షా అతను లగేజీ దింపుతున్నాడు. ఒక ఎయిర్‌బ్యాగ్, ఒక సూట్‌కేస్, ఓ బెడ్డింగ్. అన్నీ భద్రంగా నేలమీద పెట్టి తలక్కట్టిన గుడ్డ విదిల్చి సీటు తుడిచాడు.

"బాబూ?" అన్నాడు ఇక వెళ్తానన్నట్టు.

వెనకే ఇంకో రిక్షా వచ్చి ఆగింది.

అన్నపూర్ణ, బుజ్జీ దిగారు.

"ఏరా డబ్బులిచ్చేశావా'' అడిగిందామె.

"ఎక్కడా?" చిరాకు పడ్డాడు శరత్.

"ఇట్రా బాబూ నేనిస్తా'' ఆవిడ జేబురుమాలులో భద్రంగా బిగించి కట్టిన డబ్బులోంచి ఒక కాగితం తీసి " ఎంత నాయనా'' అంది. రిక్షావాళ్లిద్దరూ కూడబలుక్కున్నట్టు ఎక్కువే చెప్పారు.

"చూడండయ్యా... ఇదుగో మీరొచ్చిన దూరం అంత ఎక్కువేం కాదు. నేను నడిచే వచ్చేదాన్ని. కానీ లగేజీ ఉందిగా, బాబు ఇబ్బంది పడతాడని... మిమ్మల్ని పిలవటం. ఏరా వెంకయ్యా? తెల్సినాడివిగదా అని పిలిస్తే... నోటికొచ్చింది అడుగుతావా?"

చీవాట్లు పెట్టి వాళ్లు గొణుక్కుంటున్నా ఇద్దరికీ కలిపి ఏడు రూపాయలిచ్చి రుమాలు గుడ్డ బిగిస్తోంది.

"అబ్బ రైలు పోయే ఉంటుంది'' అన్నాడు బుజ్జి.

"నువ్వెప్పుడింతే. చివరి క్షణందాకా లెక్కలు తీస్తూనే ఉంటావు''

"ఊరుకోరా సన్నాసీ. ఆ బ్యాగ్ అందుకో. బోల్డు టైముంది''

బుజ్జీ, శరత్‌లు స్టేషన్ లోపలికి దారితీయగా అనుసరించింది అన్నపూర్ణ. ఆమెకి నలభై నిండాయి ఆ మధ్యనే. ఇంకా పసుపు ఛాయ తగ్గని శరీర వర్ణం. ఓ పది పదిహేనేళ్ళక్రితం ఆమెని చుట్టుముట్టి పొగిడి కావల్సింది పట్టుకుపోయిన చుట్టుపక్కల జనం ఇప్పుడు పలకరించకపోయినా ఆ గతకాలపు వైభవ చిహ్నాలూ, సౌందర్య ఛాయలూ ఆమెని ఆవరించే ఉన్నాయి. ఆమె తలలో నెరిసిన ఒకటి రెండు వెంట్రుకలూ ముదురుతున్న వయసును కాక పెరుగుతున్న భారాన్ని సూచిస్తున్నాయి.

ఓవర్ బ్రిడ్జ్ దాటి మూడవ నెంబర్ ప్లాట్‌ఫాం మీదకు వచ్చారు. అక్కడక్కడ నిలబడి వున్న ప్రయాణీకులు తప్ప ప్లాట్‌ఫాం మీద ఒక్కబెంచీ కూడా లేదు. లగేజీ కిందపెట్టి నించున్నారు.

ప్రయాణపు జాగ్రత్తలు చెప్పసాగిందామె.

"అబ్బ తెలుసులే' అన్నాడు శరత్.

అతడి లోపల ఇదీ అని చెప్పలేని టెన్షన్... క్షణ క్షణానికీ పెరిగిపోతోంది. ఇంత కాలం ఎదురు చూసిన ఆ ముహూర్తం వచ్చేసింది. ఉన్న ఊరూ, అమ్మా, తమ్ముడూ అందర్నీ వదిలి... వెళ్లిపోతున్నాడు. ఇంతవరకూ వరసగా నెలరోజులు కూడా ఇల్లు వదిలి ఎక్కడకీ పోయిన గుర్తులేదు. ఎవరి దగ్గరా ఉన్న అలవాటు లేదు.

అలాంటిది... కొన్ని వందల మైళ్ళ దూరంలోని తనకు అదేమాత్రం కూడా తెలీని మహానగరంలోకి... ఒకటి కాదు రెండుకాదు... నాలుగు సంవత్సరాలు... గడుపనున్న సుదీర్ఘ బాధామయ జీవితంలోకి...

ఆ దిగులుతో తను తల్లక్రిందులవుతుంటే ప్రయాణం గురించి విసిగిస్తున్న అమ్మ మాటలు... కానీ అమ్మనేం అంటాడు. పాపం తన గురించి అహర్నిశలూ శ్రమించి, తన జీవితంలో మరే కోరికా మిగుల్చుకోక, అంతా తనకే వెచ్చించిన అమ్మ... తన ఆదుర్దా తనది.

"ఊం..." అంటున్నాడు పరధ్యానంగా.

"నీకోసం... స్నేహితులు..." కేకపెట్టాడు బుజ్జి ఆ చివరనుంచి.

అవతలి ప్లాట్‌ఫాం మీదనుంచి కోతుల్లా దూకుతున్న శ్రీధర్, శ్రీను, సాంబయ్యా... రైల్వేట్రాక్ మధ్యలో నుంచొని చేతులూపారు.





శరత్ మొహం వికసించింది. దిగులు తగ్గినట్లనిపించింది.

"ఊс... ఫ్రెండ్స్ ఉంటే చాలురా! అమ్మతో పనేముంది'' కొడుకు తలమీద ఒక్కటి వేసింది అన్నపూర్ణ.

అంచుమీద నడిచి చేయి అందించాడు వాళ్లకి.

"వద్దులే కందిపోతావు'', చేతిని నెట్టేసి ఎక్కారు ఒక్కొక్కరూ. ముగ్గురూ కలిసి శరత్‌ను కొంచెంసేపు ఏడిపించారు. తర్వాత ఏవో కబుర్లు. వాళ్ల ఫ్రెండ్స్ గురించీ... ఊరి గురించీ.

ఇంకా పరధ్యానంగానే ఊс కొడుతున్నాడు.

"ఏంట్రా భయంగా ఉందా?" అడిగాడు శ్రీధర్. అతడు శరత్‌కి సన్నిహితంగా ఉంటాడు ఇతరులకంటే.

"భయమెందుకు?"

"అదోలా ఉంటేనూ''

శరత్ మాట్లాడలేదు. శ్రీధర్‌కి అర్థమయింది అతడి స్థితి. కానీ ఏం చేయగలడు? అవతల శరత్ తల్లి ఉండగా ఇక్కడ తాము ఏం ధైర్యం చెప్తారు?

ఆమె శ్రీధర్‌ని వాళ్ల ఇంటి విషయాలేవో అడుగుతుండగా... గంటకొట్టారు. పది నిముషాల్లో ట్రెయిన్ వచ్చేస్తోంది.

శరత్ మొహంలో విచ్చుకుంటున్న దిగులు రేఖలు.

బయట పడలేదుగానీ అన్నపూర్ణకి గుండె క్షణక్షణానికీ బరువెక్కిపోతోంది. శరత్‌ని మామూలుగా పంపించగలనా అన్న భయం లోపల పెరిగి పెరిగి వీడు రైలెక్కేస్తే తనేం చేసినా పర్లేదు అన్న ఆదుర్దాతో అతడిని చూసింది.

నూనూగు మీసాలుపోయి అక్కడక్కడా గడ్డం రాబోతున్న సూచనగా చెవులముందు నుంచీ చెంపలమీదుగా పెరుగుతున్న వెంట్రుకలు. ఇంకా వీడని బాల్యం... తన భ్రమేనా? అయినా వీడింకా పారాడుతూ తన మీదకు పాకుతున్నట్టే, చంకలో వేలాడుతున్నట్టే ఉంది.

కాలమెంత వేగంగా గడిచిపోయింది.

వీడిప్పుడే పైచదువులకీ, బుజ్జిగాడు కాలేజీకి తయారయ్యారు. చూస్తుండగానే ఎదిగిపోతున్న బిడ్డలు. తోడుగా పెరుగుతున్న ఖర్చులూ, తరుగుతున్న పొలాలూ. ఏం కానుంది భగవంతుడా?

ఆమె ఆలోచనలో ఉండగానే ట్రెయిన్ వచ్చేసింది. ముందే తన టికెట్‌మీద బోగీ నంబరు చూసుకుని ఉండటంతో అందరూ ముందుకి నడిచారు. ఆ స్టేషన్‌లో ఎక్కేజనం తక్కువే గనుక రద్దీలేదు.

శ్రీధర్ వాళ్లు లగేజి సర్దారు... సీటుమీద.

శరత్ కిందకు దిగి అన్నపూర్ణ దగ్గరకు వచ్చాడు. మొహంలోకి చూడలేక ఆమె పాదాల్ని చూస్తున్నాడు.

"జాగ్రత్త నాన్నా. ఏదయినా అయితే మేమంతా నీ కోసమే బతుకుతున్నామని గుర్తుంచుకో'' వద్దనుకుంటూనే గద్గద స్వరంతో అంది.

గార్డు విజిల్ వేశాడు.

"నీ ఆరోగ్యం జాగ్రత్త, తొందరగా వీలు చూసుకుని వస్తాన్నేను. ఉంటానమ్మా'' అన్నపూర్ణ మొహంలోకి చూడలేక డోర్‌వైపు నడిచాడు.

అక్కడ బుజ్జీ, మిత్రులూ.

"లెటర్ రాస్తావుగా''

"ఆ! వెళ్ళగానే అక్కడి విశేషాలతో. అమ్మని జాగ్రత్తగా చూసుకోండిరా. ఏరా బుజ్జీ! పిచ్చిగా తిరగకు. ఇంటి దగ్గర కనపడుతుండు'' ఎక్కాడు కంపార్ట్‌మెంట్‌లోకి.

ట్రెయిన్ కదిలింది.

చేతులు ఊపుతున్నారు వాళ్లు. వెనకగా అమ్మ. దిగులుగా, ఒంటరిగా ఆ రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫాంమీద



ఎదురు సీట్లో కూర్చుని ఉన్న ఓ కళ్లజోడు నడివయస్కుడు కొంత అర్థమయి "మీరు ఎడ్యుకేషన్ కోసం...?" అన్నాడు ప్రశ్నార్థ కంగా.

తలూపాడు శరత్.

ఆ ప్రాంతంనుంచి సిటీకి పైచదువులకి పోయేవాళ్లు తక్కువ గనక ఆసక్తి కలిగి.

"డిగ్రీనా?"

"ఊఁ! బీటెక్' అన్నాడు శరత్.

★ ★ ★

"శ్రీ...

అప్పుడే నెలయ్యింది. క్షమించు. నీకు వివరంగా రాద్దామని ఆగాను. అదే లేటు. అమ్మావాళ్లకి రెండోరోజే రాశాను. నువ్వూ, మీ వాళ్లూ క్షేమమని తలుస్తాను. మీ చెల్లి బాగా చదువుతోందా?

యూనివర్సిటీ... అంటే మనం ఇదివరకు కలలుకంటూ టౌనులో డిగ్రీ కాలేజీలో ఊహించినట్టు లేదు. నువ్వింతకుముందు చూసి వుండవుకదూ! విశ్వవిద్యాలయం... మన. కాలేజీల్లాంటివి ఇరవై ముప్ఫయి కలిపితే ఎంత ఉంటుందో అంతుంది. ఇక్కడ కోర్సులంటావా? ఇంజనీరింగ్‌నుంచీ సైకాలజీవరకూ, లా నుండీ ఓషనోగ్రఫీవరకూ మనకు పేర్లు కూడా తెలీని నానారకాలు ఉన్నాయి. ఇంతకూ మన టెంత్‌క్లాస్‌లో ప్రశ్న 'మిత్రునికి నీవు చూసిన నగరాన్ని వర్ణించుతూ లేఖ వ్రాయుడు' అన్నట్టుందా నా రాత. ఆ చచ్చు పద్ధతులు నాకెందుకో మొదటినుండీ యిష్టం వుండదు. అందుకే నువ్వు క్షేమం, నేను క్షేమంలాగా రాయటం మానేస్తున్నాను ఇక్కడినుంచీ.

ముందుగా ఇక్కడ ప్రవేశించగానే నా లగేజితో హాస్టల్ గదిలోకి నడుస్తున్నప్పుడు



నాకు కలిగిన ఫీలింగ్ ఏమిటో తెలుసా... భయం. అవును టెర్రర్ పుట్టింది. ఈ మహా మహా కట్టడాలూ, ఇక్కడి విద్యార్థుల కోలాహలం, మనకేమాత్రం పరిచయం లేని తత్వాలూ, వ్యక్తులూ. ఒక్కసారి నువ్వు పొద్దున్నే కళ్లు తెరిచేసరికి అమెరికాలో ఓ న్యూయార్క్ రోడ్డుమీద నీ నవ్వారు మంచంతో సహా పడుకుని ఉన్నావనుకో. ఉదయం పది గంటల టైంలో నీకెలా అనిపిస్తుంది?

అదిగో... అదే. ఆ టెర్రరే నాకు కలిగిన భావం.

లెక్చరర్లు బాగానే చెప్తున్నారనిపిస్తోంది.

ఇంక నాకు ఇక్కడ కొత్త ఫ్రెండ్స్ ఎవరయినా? అనడుగుతావు. అది చెప్పే ముందింకో విషయం చెప్పాలి. మమ్మల్ని ఫ్రెషర్స్ అంటారు. ఇక్కడ కాలేజికి కొత్తవాళ్లంకనుక.

మా బెరుకు పోగొట్టి అందరితో కలిసిపోయేందుకూ, పరిచయాలు చేసేందుకూ ఎవరో ఒకరు శ్రద్ధ తీసుకోవాలికదా! ఆ పని మా సీనియర్స్ చేస్తున్నారు. పాపం... ఎందుకంటే వాళ్లకంత ప్రేమ? వాళ్ల సీనియర్స్ వీళ్లనీ చాలా ప్రేమించేవాళ్లు.

అందుకని మా అందరినీ సీనియర్స్ క్లాసు లయిపోయాక రోజూ రాగింగ్ చేస్తున్నారు. ఇదే వాళ్లు మమ్మల్ని ప్రేమించే పద్ధతి.

వినేవుంటావు... పేపర్లలో చదివేవుంటావు.

రాగింగ్‌లో మీరు కనీవినీ ఎరుగని పద్ధతులు ఫాలో అవుతుంటారు సీనియర్స్. అందులో అతి చిన్న పద్ధతి నీ అభిమాన హీరోని ఇమిటేట్ చేయటం. అతి పెద్దది ఎవరూ ఊహించలేరు. అది హత్యదాకా పోవచ్చు. బట్టలూడదీసి పగలే రోడ్డెంట నడిపించటం, ఇంకో జూనియర్‌ని నగ్నంగా

నిలబెట్టి చెప్పరాని పనులు చెయించటం. దారే పోయే ఆడపిల్లల్ని ఘోరమయిన ప్రశ్న లడిగించటం... ఇట్లా ఎన్నయినా చెప్పొచ్చు. మరీ శాడిస్టులనుకో బ్లేడ్లతో కోయటం, అంగా ల్ని కత్తిరించటం చేస్తుంటారు. సాధారణంగా వాళ్లు చెప్పినవి చేయనప్పుడు పశువుల్లాగా రియాక్టవుతారు.

అందుకే నోరుమూసుకుని కిక్కురుమన కుండా చేస్తాం మేము. ఈ సీనియర్స్‌కి నిజానికి ఏ సపోర్టూ వుండదు. మన ప్రభు త్వాలు ఆమధ్యన చట్టాలు చేసినట్లే ఉన్నాయి రాగింగ్ నిషిద్ధం అని. కానీ సాగిపోతూనే వుంటుంది. కట్నం, లంచం వగైరాలన్నీ ప్రభుత్వాధికారులే హాయిగా మింగుతున్న ట్టు. రాగింగ్‌ని ఎవడూ ఆపలేడు. సీని యర్స్‌తో యూనివర్సిటీ అథారిటీస్ గొడవ పెట్టుకోవు. అదీగాక ఇక్కడ స్టాఫ్‌లో ప్రొఫెస ర్లకి ఒకడితో ఇంకొకడికి పడని సందర్భాల్లో సీనియర్స్ అవసరమవుతారు. గ్యాంగ్‌లు తయారవుతాయి. అట్లా స్టాఫ్‌లోని విభేదాలు స్టూడెంట్లలోకి పాకుతాయి. సీనియర్స్‌తో అవసరముండటంవలన వాళ్ల పనులకి స్టాఫ్ సపోర్టు ఒక్కోసారి డైరెక్టుగా ఉంటుంది. జూనియర్స్‌లో గట్టివాళ్లని స్టాఫే శిక్షించిన సందర్భాలున్నాయి.

అందుకే రాగింగ్‌మాత్రం సిన్సియర్‌గా పెర్‌ఫెక్ట్‌గా చేస్తారు ఇక్కడివాళ్లు. ఎంచేతనో ఈ కల్చర్ ప్రొఫెషనల్ కోర్స్‌లు చదివేవాళ్లలో నే ఎక్కువ. మెడిసిన్, ఇంజనీరింగ్ వగైరా. మామూలు కాలేజీల్లో తక్కువే. మొత్తానికి ఇంత తీవ్రంగా ఉండదు.

మరి నేనూ నగ్నంగా హాస్టల్‌చుట్టూ తిరి గానో లేదో తెలుసుకోవాలని నీకు ఆసక్తిగా లేదా? ఈపాటికి ఊహించుకునే వుంటావు. మా బ్యాచ్‌కీ రాగింగ్ తప్పలేదు. మా సీని యర్స్ ఈసారి కొత్తపద్ధతి మొదలుపెట్టారు. వాళ్లు మాదగ్గరికి వచ్చి రాగింగ్ చేయటం ఎంతయినా శ్రమేకదా! అందుకని వాళ్లలో వాళ్లే చర్చించుకొని మాకో టైంటేబుల్ ఇచ్చా రు.

క్లాసులయిపోయాక ఒక్కోరోజు ఒక్కో బ్యాచ్‌వాళ్లం వాళ్లు చెప్పినచోటుకి వెళ్లాలి. అక్కడికి మమ్మల్ని రాగ్ చేయటానికి ఎవర యితే ఇంట్రెస్టుగా ఉన్నారో వాళ్లుమాత్రం వచ్చి తమపని ముగించుకొని పోతారు. దీనిమూలంగా అందరికీ (సీనియర్స్‌కి) మా కోసం ఎదురుచూడాల్సిన బాధ ఉండదు.

నేను శాంతంగా కన్పిస్తాననీ, చిల్లర తగా దాలకీ రాననీ, భయపడతాననీ నీ ఉద్దేశ్యంక దా!

నిజంగా వాడు నన్ను వేధిస్తున్నప్పుడు నువ్వు చూడాల్సింది. అంటే నా లోపలి ఆలోచనలు. ప్రపంచంలో ఏ హంతకుడికీ తీసిపోనివిధంగా ఆలోచనలొచ్చాయి. ఎంత క్రూరంగా చంపితే వాడికి తగిన శిక్ష పడు తుంది అన్న ఊహ.

సరే నాతోపాటు బాధపడిన ప్రతి జూని యర్‌కీ ఇదే జరిగివుంటుందనుకో. స్ప్రెస్‌డ్ ఎప్పుడూ హింసాత్మకంగానే రియాక్టవుతారు వీలు కుదిరితే. తీరికగా కూర్చుని పరిశీలించే వాడికి (నిజంగా వాడు స్ప్రెసర్ స్థానంలో ఉన్నట్లే) ఈ రెసిస్టెన్స్ అర్థం కాదు. పైగా తిరగబడినవాడి మీదకే మరి నాలుగు నింద లు. బాధితులపైనే బండలు వదుల్తారు. శాంతి సందేశాలిస్తుంటారు.

ఒక వారం ఈ రకంగా జరిగిందన్నానుక దా!

తరువాత ఎందుకనో కొందరు సీనియర్స్ తప్పుకున్నారు రంగంలోంచి. కారణం ఇక్కడ రాగింగ్‌ను వ్యతిరేకించే విద్యార్థులు బాగానే ఉన్నారట. వాళ్లు సీనియర్సే. వాళ్లు రాగింగ్ ఆపేయమనీ, రాగ్ చేసిన వాడిని శిక్షించమనీ డిమాండ్ చేస్తూ మా కాలేజి ప్రిన్సిపాల్‌మీద వత్తిడి తెచ్చారు. వాళ్లలో ఇంజనీరింగ్‌వాళ్లూ ఉన్నారు. కానీ ఆర్ట్స్ ఫాకల్టీవాళ్లు ఎక్కువ. అక్కడ ఆర్ట్స్ కాలేజ్‌లో




స్టూడెంట్ మూమెంట్ బాగా ఉంటుందిట. యూనియన్లు ఉన్నాయి. వాళ్లలోని కొంత మంది ఈ పనిచేశారు.

ప్రస్తుతానికి గొడవలు సద్దుమణిగాయి. ముఖ్యంగా ఈ ఏడాదికి రాగింగ్ బాధ పోయినట్లే. ఇక ఫ్రెండ్స్ గురించి అంటున్నానుకదూ! ముందుగా కలిసి ఉండే అవకాశం ఉన్నవాళ్లు త్వరగా స్నేహితులవుతారు గనుక క్లాస్ మేట్స్‌లో కొందరితో బాగానే పరిచయం అయింది. స్నేహం అన్న పెద్ద పదం వద్దులే.

ఆరోజు ఈ రాగింగ్ గొడవల సందర్భంలో కోటి అనే ఓ వ్యక్తి పరిచయమయ్యాడు రామకోటిఅనుకుంటాఅసలుపేరు. సరదాగా నవ్వుతూ పలకరిస్తాడు. నిరసనగా జోకులు వేస్తుంటాడు మొహంమీదే. ఒకోసారి కష్టమే తట్టుకోవటం. అయినా అతన్లో ఏదో ఆకర్షణ ఉంది.

ఇంకా రూంమేటు పేరు శ్రీనివాస్. వాళ్ళ ఫాదరు రామగుండం ఏరియాలో ఏదో పెద్ద జాబ్ చేస్తారట. అప్పుడప్పుడు కారులో వచ్చి పోతుంటారు. మనవాడూ జాలీటైప్. డబ్బు బాగా వదుల్తాడు.

ఎదురు రూంలో రమణ అనే అతను. బద్ధకంగా నెమ్మదిగా కదిలేప్రాణి. తనూ ఫస్టియర్ కానీ వేరే బ్రాంచి. మంచితనం ఉన్నవాడు. తరచూ వాడే ఊతపదం 'ఈ భౌతిక కాయం' అని. అంటే తననే అట్లా పిల్చుకుంటాడు.

ఇంకా అర్జున్. అర్జున్‌రెడ్డి. ఎవర్నీ పట్టించుకోనట్టుంటాడు. క్లాసులో ఏవో ఆలోచనల్లో నిరాసక్తంగా అగుపిస్తాడు. అతనెందుకలా ఉంటాడో తెలీదు. నిజానికి నాకసలు పరిచయం కొంచెమే. 'హాయ్' అంటే 'హలో' అని. కానీ అతనెందుకలా ఉన్నాడని ఒక సందేహం. ఈ ఆసక్తి చాలుకదూ స్నేహం పెరగటానికి.

నీకీపాటికి డౌటు వచ్చి ఉండాలి.

అందరూ మగ ప్రాణులేనా అని. ఊహుం... గాల్స్ కూడా మనకు తీసిపోనివిధంగా ఇంజనీరింగ్‌లాంటివి చదివేస్తున్నారు. ఫస్టియర్స్‌లో మా క్లాస్‌లో ముగ్గురే ఉన్నారు. వేరే బ్రాంచిలన్నీ కలిపితే జూనియర్స్‌లో ఉంటారు ఓ పాతికమంది.

మరీ అంత పరిచయం లేదుగానీ లాబ్‌లో, లైబ్రరీలో అవసరాల కోసం పలకరించు కోటంవరకూ ఉంది కొంతమందితో.

మాధురి అని తను మా క్లాసే. మాథ్స్‌లో నా దాడి చూసి ఏవో డౌట్స్ అడుగుతూంది. హాస్టలర్ కాదు. డే స్కాలర్. సిటీనుండి వస్తుంది. మిగిలిన ఇద్దరికంటే చొరవగలది. తనే పరిచయం చేసుకుంది.

నన్ను పలకరించగానే ఏమనుకున్నానో చెప్పనా?

సిన్సియర్‌గా నీకుమాత్రమే రాస్తున్నాను. ఆ అమ్మాయిని గురించిన ఆలోచన. మేం ఈ చదువయి విడిపోయేప్పుడు తను ఆటోగ్రాఫ్ గానీ అడిగితే ఇలా రాస్తాను.

'మీరు జీవించినంతకాలం మొహంలో వెలిగే ఆ చిరునవ్వును ఆర్పకండి. నిరంతరం వెలిగి ఎందరికో ఆనందాన్ని పంచాలి మీ నవ్వు. మీ చూపులు... దయతో కరుణతో నిండి ప్రవహించనీయండి. ఆత్మహత్య చేసుకునేవాడు కూడా మిమ్మల్ని చూసి జీవితంమీద ఆశతో తిరిగి వెళ్లిపోతాడు. ఇది నా హృదయపూర్వకమైన విజ్ఞప్తి'

ఎందుకో ఈ భావంమాత్రం నన్ను కుదిపేసింది. అంత అద్భుతంగా ఉంటుంది ఆ నవ్వు. ఆప్యాయత ప్రసరించే ఆ కళ్లు. ఇది కేవలం నామీద అనికాదు నా ఉద్దేశం. ఆ అమ్మాయి ఎవరితో మాట్లాడినా వాళ్లకదే అనిపిస్తుంది. అందుకే అందరి తరపునా నేనే విజ్ఞప్తి చేస్తున్నాను.

ప్రస్తుతానికి నేను రాయగలిగింది ఇంతే.

శ్రీధర్, మా అమ్మకేమయినా సాయం అవసరమయితే నువ్వు ఉంటావుకదూ! మన

మిత్రులందరినీ అడిగినట్లు చెప్పు. లెటర్ రాస్తావుకదూ!

మరిక ఉంటాంనేం
శరత్ ''

★ ★ ★

ఏదో ఆలోచిస్తూ వాష్‌బేసిన్‌లోకి వంగి మొహం కడుక్కుంటున్నాడు శరత్.

"ఏంటో ఆలోచన"

నీళ్లోడుతున్న మొహం తిప్పాడు శరత్.

రమణ? చేతిలో నీళ్లబకెట్ వుంది. ఎర్రటి ప్లాస్టిక్ మగ్గు తేలుతోంది ఆ నీళ్లలో నీళ్లు పొగలు చిమ్ముతున్నాయి.

"ఏంలేదుగానీ... వేడినీళ్లు ఎలా వచ్చాయి?" సందేహంగా అడిగాడు శరత్.

"ఉంటాయి. కొన్ని మార్గాలు'' నవ్వాడు రమణ.

"ఇంకా చలి అంత లేదుకదా?"

"నాకలవాటు. వేసవిలో కూడా వేడినీళ్లే'

"ఇంతకీ...?"

"వాటర్ హీటర్‌లు కొనుక్కోవచ్చు. నేనయితే నాటుపద్ధతిలే. ఒక చెక్కముక్కా, ఓ వైరూ, రెండు బ్లేడ్లు, మేకులో. బస్. వేడినీళ్లు తయారు. అయినా మనకి హాయేగానీ కరెంటుబిల్లు వాచిపోద్ది''

"ఈసారి చూస్తానెట్లో'

"ఆల్వేస్ వెల్‌కమ్. ఉండు నేనీ భౌతిక కాయానికి స్నానం చేయించి వస్తా'' రమణ కదిలాడు బాత్‌రూంలవైపు.

భౌతిక కాయం. దానికి స్నానం చేయిస్తాడట...

శరత్ నవ్వుకుంటూ, అంతలో ఎదురుగా అద్దంలో కనిపించే ప్రతిబింబాన్ని చూసి



అలాగే ఆగిపోయాడు. అద్దంలో ఆకారంపర్లేదు చూడదగ్గట్టే వుంది. చెంపలమీద అక్కడక్కడా మొలుస్తున్న వెంట్రుకలు. ఇంకా వదలని మొటిమలు. అవి మిగిల్చే మచ్చలు. లీలగా నవ్వుతున్న పెదవులూ.

అదేంటి ఇవాళ ఇంతసేపు అద్దంముందు...

శరత్ వడివడిగా కదిలాడు. వరండా దాటి ఆ చివర ట్వెల్వ్ ఒన్ ఫోర్ రూం తలుపు నెట్టాడు. ఇంకా శ్రీనివాస్ నిద్రపోతూనేవున్నాడు. ముసుగుకింద శ్వాసిస్తున్న ఆకారం ముడుచుకొని ఉంది..

మొత్తం మూడు ఇనుప మంచాలు. మధ్యది ఖాళీగావుంది. రెండో చివర తనదీ ఆ చివర శ్రీనివాస్ మంచాలు. మొత్తం మూడు కుర్చీలూ మూడు టేబుల్స్. అంతా సరిగ్గా వుంది. ముగ్గురు స్టూడెంట్స్‌కి సరిపోయేట్లుగా. రెండు అలమరలు. ఖాళీ లేక కాబోలు మూడోది కట్టలేదు.

తన టేబుల్ సొరుగు లాగి నిన్న కో-ఆపరేటివ్ స్టోర్సులో కొన్న సబ్బు రేపర్ చింపి అలమరలోని ఇందాకటి సబ్బుపెట్టెలో పడేసి ఇనుపమంచం కిందనుంచి ప్లాస్టిక్ బకెట్ లాగాడు.

పావుగంటలో చన్నీళ్లస్నానం ముగించి, ఇస్త్రీ బట్టలు ధరించి, చెప్పుల్లో కాళ్లుపెట్టాడు. శ్రీనివాస్ టేబుల్‌మీద గడియారం ఏడు సూచిస్తోంది. కాబట్టి మెస్‌కుపోయి ఇటొచ్చి బుక్స్ తీసుకుని పోవచ్చు క్లాసుకి. తొందరలేదు.

బయటకొచ్చి రమణ రూం తలుపుకొట్టాడు.

"కమిన్' రమణ తయారయే ఉన్నాడు. కానీ మంచం మీద పడుకొనే ఉన్నాడు.

'వెళ్దామా'' అంటూ లేచి కూచున్నాడు.

సభ్యతకోసం "మీరు?" అన్నాడు శరత్ అవతల మంచం మీద తెలుగు వీక్లీ చదువుతున్న రామచంద్రారెడ్డిని. అతనూ రమణా రూంమేట్స్.

"నేను కాసేపుండి వస్తా" తలెత్తకుండానే చెప్పాడు రాంచెందర్.

"వీడూ... ఆ చెత్త కనిపిస్తే చాలు పురుగులాగా దూరిపోతాడు" రమణ తిట్టి శరత్‌ని అనుసరించాడు.

"ముయ్" అంటున్నాడు రాంచెందర్.

పోతూపోతూ రామకోటి రూం ముందు చూస్తే అతను లేడు. ఇద్దరూ కలిసి మెస్‌దారిలో కబుర్లు చెప్పుకుంటూ నడవసాగారు.

క్లాసుల గురించీ, క్లాస్‌మేట్స్ గురించీ,

"అవునూ! రమణా!! ఇన్ని నెలల నుంచీ చూస్తున్నాను. నీ భౌతిక కాయంలోకి సబ్జెక్టు నేమీ ఎక్కించినట్టు కనపడవేం. ఆ మంచంమీద హఠయోగంగానీ చేస్తున్నావా ఏం?"

కిసుక్కున నవ్వాడు రమణ.

"ఎందుకు బాబూ! ఏదో ఈ భౌతిక కాయం... ఇట్లా వెళ్లమారి పోనీ. ఏదో దానికింత తిండిపెట్టి, నిద్రపుచ్చి గడిపేస్తున్నాను. ఇంక చదువు సంగతంటావూ.. ఎండ్ సెమిస్టర్ ఎక్జామ్స్‌కి టైం ఉందిగా. అయినా రోజూ ఎలాగో ఈ భౌతికకాయంతో ఓ గంటయినా చదివిస్తున్నాలే. లేకపోతే ఈ కాయంలోంచి హంసలేచి పోదూ..."

శరత్ నవ్వుకున్నాడు.

"అయినా నీ అంత జీల్ నాకు లేదు శరత్. ఏదో ఏవరేజిలో లాగించేస్తా. ఈ సీటు కూడా ఏవరేజిలోనే ప్రిపేరయ్యాను. తన్నుకుంటూ వచ్చింది. ఆఫ్‌కోర్స్ మా నాన్న ఇంటెన్సివ్ కోచింగని నన్నో కాలేజిలో పడేశాడు. పాతిక వేలు తీసుకున్నందుకు ఆ తొత్తుకొడుకులు ఈ భౌతిక కాయంలోకి బలవంతంగా నానా చెత్తా ఎక్కించారు. అదంతా పరీక్షరోజు చీదేస్తే ఈ సీటు తగులుకుంది" నిరసనగా అన్నాడు రమణ.

"అయితే నాది వేరే సమస్య!"

"తెలుసులే"

"ఏం తెలుసు నీకు" ఆశ్చర్యపడ్డాడు.

"నీ తపన, చెప్పాగా... బాగా చదవాలని నీకు కోరికనుకుంటాను"

"ఆc! అంటే అది ఎలా వచ్చిందోగానీ స్కూలునుంచీ క్లాస్‌ఫస్ట్ నేనే. అయితే ఈ కాలేజీలో అడుగుపెట్టాక అంతా తలకిందులైందా అన్పిస్తోంది. ఎంత ట్రై చేసినా..."

అతడి సమస్య రమణ కర్థమయింది.

ఇక్కడ క్లాసులో రాంకు రావాలంటే చచ్చేట్టు చదవాలి. అది చేతకాకే కదా భౌతికకాయానికి పని కల్పించటం లేదు.

"నీకు గైడెన్స్ ఉంటే బావుంటుంది శరత్. ఎవరయినా లెక్చరర్ పర్సనల్‌గా శ్రద్ధ తీసుకున్నా లేక సీనియర్స్..."

"ఎవరున్నారు మనని పట్టించుకునేంత విశాల హృదయులు" నిరాశపడ్డాడు శరత్.

ఇక్కడ అంతా మెకానికల్. అంతా స్పీడ్. ఏ లెక్చరర్‌కీ తన స్టూడెంట్స్ గురించి పట్టించుకోవాల్సిన బాధ్యతా లేదు... ఓపికా లేదు... అవసరం అంతకంటే లేదు. కొన్ని వేలమందితో కిటకిటలాడే ఈ యూనివర్సిటీలో ఎవరు ఎవర్ని పట్టించుకొంటారు. పైగా లెక్చరర్ పదవి ఒకప్పటి గురువు పాత్రలా ఆదర్శవంతంగా ఎవరూ భావించటంలేదు. అదీ ఒక వృత్తి విద్యే. కనుక ఆ వృత్తిలో పైపైకి పోవటం... ఆ తపనలో వేరేవి పట్టించుకోకపోవటం సహజమే. అదీగాక ఒక్కో లెక్చరర్‌కి కేటాయించబడే విద్యార్థుల సంఖ్య పెరిగిపోతోంది.

చూస్తూనే ఉన్నాడుగా.

మాథ్స్ క్లాసుమరీ... ఫస్టియర్స్‌కి కంబైండ్‌గా తీసుకుంటాడు ఆ ప్రొఫెసర్. పెద్ద హాలు కిటకిటలాడిపోతుంది. తనెలాగు లాక్కొస్తున్నాడు బండి.




ఈ వలయంలోంచి ఎవరు లాగుతారు తనని?

★ ★ ★

ఛాలాకాలం తరువాత ఎయిర్ బాగ్ తెరిచాడతను. అడుగున ఇంతవరకూ తెరిచి చూడని ఆ పుస్తకాలు. ఆప్యాయంగా తడుముతూ ఒక్కొక్కటీ తీసి మళ్లీ సర్దుతున్నాడు. అవి తాను ఇంటి దగ్గరనుండి తెచ్చుకొన్న సాహిత్యం.

శరత్ నుంచీ బుచ్చిబాబు వరకూ అప్పుడప్పుడూ తను కొని దాచుకున్న తనకు నచ్చిన పుస్తకాలు.

'చివరకు మిగిలేది' నవల ఉంచి మిగిలినవన్నీ బ్యాగ్‌లో సర్ది జిప్పుమూశాడు.

ఆ రాత్రంతా అతడి రూంలో లైటు వెలుగుతూనే ఉంది. శ్రీనివాస్ మాత్రం ముసుగుతన్ని పడుకున్నాడు.



"ఇవాళంతా రూంలోనే ఉన్నట్టున్నావు?" శరత్ అడిగాడు. చెప్పులు మంచం కిందకు తోసి, మంచం మీదకు వాలిపోతూ. కాళ్లూ చేతులూ చాచుకొని పడుకుంటే ఎంత హాయిగా ఉంది! అతడు వళ్లు విరుచుకునేందుకు వంగబోతుండగా...

"లేదు... క్లాసుకు పోలేదనుకో. పార్టీ ఉంటేనూ... అఫ్‌కోర్స్ నో లిక్కర్స్. మధ్యాహ్నం బ్లూమూన్ దాకా వెళ్లి ఇందాకే వచ్చాను'' అన్నాడు శ్రీనివాస్.

"బిజీ అన్నమాట"

"అదేం కాదు. ఫ్రెండ్స్ పిలిచినప్పుడు వెళ్లకపోతే..."

పార్టీలు... సందర్భం పెద్దగా అవసరం ఉండదు. ఒక ఆర్థిక స్థాయి కలిగినవాళ్లు తోటివారితో సంబంధాలు కొనసాగించటానికి అవసరం. శ్రీనివాస్‌కు ఫ్రెండ్స్ సర్కిల్ ఉంది. సీనియర్సే ఎక్కువమంది. ఇర్ఫాన్ ఆలీ, రామ్మూర్తి అని వస్తుంటారు, రోజుకో కొత్త డ్రస్సులో. ఖరీదయిన ప్రవర్తన వాళ్లస్థాయి తెలపకనే తెలిసిపోతుంది.

రూంకి వచ్చినపుడు వాళ్లేంటో కొంచెం అర్థమవుతుంది గానీ నిజానికి వాళ్ల ఇష్టాయిష్టాలూ ప్రవర్తనా, అభిరుచులూ శరత్‌కేమీ తెలీవు. తెలీవు అనేకంటే అందని స్థాయిలో ఉన్నాయి అనడం సబబు.

వాళ్ల విచ్చలవిడి ఖర్చులమీదా, సరదాల మీదా కొంత విముఖత ఉన్నమాట వాస్తవమే అయినా... ఏదో ఆకర్షణ ఉంది. వాళ్లేంటో తెలుసుకోవాలన్న తపన ఉంది. కానీ నోరు తెరిచి ఏం అడుగుతాడు నన్నూ తీసుకు వెళ్లండి అని. తీసుకువెళ్లినా తను శాండ్‌విచ్ అవుతాడు.

శ్రీనివాస్ టైం చూసుకొన్నాడు.

"అరే టైం అవుతోంది'' మంచం మీంచి దూకి మేకప్ అవటం మొదలుపెట్టాడు.

"దేనికి?"

"ఇర్ఫాన్‌తో అపాయింట్‌మెంటు''

"ఎక్కడ?"

"తెలీదు... ఏ హార్స్‌రేస్‌లోనో..."

మాటల్లోనే ఇర్ఫాన్ వచ్చాడు. నవాబు తరహా దుస్తులు, వంపు తిరిగిన మొగలాయి షూస్... తలకి కిరీటం ఒకటే తక్కువ.

శరత్‌ను చూసి పలకరింపుగా తలెగరేశాడు.

"ఏరా బేవకూఫ్, ఇంకా పోరిలెక్కన తీరి



కూచున్నవ్... మొహానికి క్రీములు మళ్లీ''

శ్రీనివాస్ తల తిప్పకుండానే...

"మూసుకోరా ఉల్లూ... నువ్వు పొద్దుటి నుండీ మొదలెట్టి ఉంటావు..."

ఓ కాలు మధ్య మంచంమీద వేసి నుంచొని, మోకాలు ఊపుతున్నాడు ఇర్ఫాన్.

"ఏయ్ శరత్! ఎట్లుంది ప్రిపరేషన్?"

శరత్ తబ్బిబ్బయ్యాడు.

"పర్లేదు''

"చదువ్... నీలాంటోళ్లు చదవకపోతే ఇంకెవడు చదవాలె. ఇదిగో నువ్వే వీడిని గట్టెక్కించాలి. ఇట్టా కొట్టుకు పోతున్నాంక దా!" శ్రీనివాస్‌ని చూపిస్తూ అన్నాడు.

"కొట్టుకు పోతున్నామంటారా?"

"మరి ఈ కొడుక్కి డిగ్రీ ఎందుకు. సరదాగా వాళ్ల బాబేదో ఇండస్ట్రీ పెట్టిస్తాడు రేపు. ఓనమాలు రాకపోతే బాగోదని కిందామీదా పడి ఇక్కడ చేర్చారు. వీడిక్కడ మాతోని కిందామీదా పడుతుండు'' నవ్వాడు.

"అయితే గట్టెక్కించాల్సిందేనా?"

"సరి నువ్వు లాక్కపోతే కొడుకు..."

"లాగుతాలే గట్టుమీదనుండి. కానీ నన్ను లాగుతాడేమో అని''

"గోతిలోకి దించుతాడంటావా నిన్నూ..." విరగబడి నవ్వాడు ఇర్ఫాన్. "అట్టాంటి కతర్నాక్ గాడే..." మళ్లీ నవ్వు.

"ఇక పద" విసుక్కున్నాడు శ్రీనివాస్.

"బై''

తలుపు లాగి వెళ్లిపోయారు.

కొంచెంసేపు పడుకొని లేచాడు. సబ్బు తీసుకొని సింకు దగ్గరకు నడుస్తుండగా ఆ చివర రూం దగ్గర కోటి చేయి ఊపుతున్నాడు.

ప్రశ్నార్థకంగా తల ఎగరేశాడు శరత్.

వస్తున్నా నన్నట్టుగా అక్కడెవరితోనో మాట్లాడుతున్నాడతడు. శరత్ రూంకి తిరిగొచ్చే సరికి ఎదురొచ్చాడు.

"ఏంటి విషయం"

"ఎటన్నా పోతున్నావా?"

"లేదు''

"నాతో రారాదూ''

"ఎక్కడిదాకా?"

"చెప్తాగా..."

ఇద్దరూ రూమ్ లాక్‌చేసి బయల్దేరారు. రమణ రూంలో లేడు కాబోలు తాళం వేలాడు తోంది.

"ఓ ప్రశ్నడగనా శరత్? ఏమీ అనుకోకు. నువ్వేమనుకుంటున్నావో అదే చెప్పాలి. ఫ్రాంక్‌గా..."

శరత్ తలెత్తాడు. చిత్రంగా చూస్తున్నాడు.

"అదేంటి అడుగు!"

"నీకు ఇబ్బంది కలిగినా సరే. చెప్పాలి సరేనా?"

"అడగవోయ్. ఎందుకంత వెనకాడుతు న్నావ్?"

"ఏంలేదు... సరే. అడిగేస్తున్నా. జీవితంమీద నీ అభిప్రాయం. ఏమిటి?"

అర్థం కానట్టు చూశాడు శరత్.

"ఓ.కే. ఇంకోలా అడుగుతాను. నీ జీవితాశయం ఏమిటి?"

ఆలోచనలో పడ్డాడు శరత్.

"అదీ... ఏమిటంటే ఏం చెప్తాం?"

"ఒక్క మాటలో ఎవడూ తన విషయం చెప్పలేడనుకో. అందుకే అసలు నీ ఆలోచన ఊరికే నీకు తోచినట్టు చెప్పు''

శరత్ భుజం చుట్టూ చేయివేశాడు కోటి. అంటే స్నేహితులంకదా! ఇంకా బెరుకూ... మొహమాటం ఎందుకు? స్వేచ్ఛగా నువ్వేమిటో చెప్పు అన్న భావాన్ని తనకు తెలియపరుస్తున్నాడు. అలా అని శరత్‌కు అర్థమయింది.

"జీవితాశయం అంటే... ఏం చెప్పను.

"మా కుటుంబం ఉంది. తమ్ముడు చదవాలి. అలానే అమ్మ ఆరోగ్యం. ఆ రకంగా వాళ్లకాధారమయ్యి నిలవాలి. అలానే ఓ డెడికేటెడ్ ఇంజనీర్‌ని కావాలని. ఇంకా అఫ్‌కోర్స్ మంచితనం. అంటే లంచం, అవినీతి వగైరాలకి దూరంగా... నా జాబ్ ద్వారా ప్రజలకి సేవచేస్తూ.. మంచివాడనిపించుకోవటం నాకు చేతనయిన సాయం నలుగురికీ చేస్తూ. అసలు సంగతి చెప్పలేదుకదూ. నాకు ఎందుకో లిటరేచర్ అంటే ఇష్టం. అదీ సీరియస్ సాహిత్యం. జీవితం గురించి నాకర్థం కానిదేదో ఉంది. ఆ అర్థంకాని విషయాన్ని సాహిత్యం విప్పి చెపుతుందనిపిస్తుంది నాకు. ఒకోసారి ఆ సాహిత్యం చదువుతూ-ఉంటే ఎందుకో భయం కలుగుతుంది. జీవితమంటే ఇది కాదు. ఇంకేదో ఉంది. ఆ రకంగా ఓ గొప్ప అనుభవాన్ని నేను కోల్పోతున్నాను. ఆ అనుభవం ఏమిటో తెలుసుకోవాలి అని. గమ్మత్తుగా లేదూ. నేను కోల్పోయిందేమిటో నాకు తెలీదు. కానీ అది ఏమిటో తెలుసుకోవాలనే తపన.

అందుకే ఊహ తెలిశాక మామూలు ఫిక్షన్ నుంచి ఈ రకం పుస్తకాలు చదువుతుండటం అలవాటు చేసుకున్నాను. అన్నీ అర్థమయ్యాయని చెప్పలేను. కానీ బాగుంటుంది అవి చదువుతుంటే.. ఇంకా చిత్రమేమిటంటే నేను ఒక్కో బుక్ చదివేకొద్దీ చదవాల్సినవి ఇంకా పెరిగిపోతుంటాయి. ఓ పుస్తకం ముగించాక అది కల్గించిన భావోద్రేకాల కారణంగా పది పుస్తకాలు రెడీగా ఉంటాయి, నీ కోసమే ఎదురు చూస్తున్నాం అన్నట్టు.

ఏంటీ... విసుగు పుట్టిస్తున్నానా... అర్థం పర్థం లేని ఆలోచనలు చెప్పి..."

"లేదు... 'లేదు'' అన్నాడు కోటి.

"ఈమాత్రం లైఫ్ గురించి మాట్లాడినవాడు ఈమధ్యకాలంలో ముఖ్యంగా మన బ్యా

చ్‌లో కనపడలేదు. నువ్వింకా చాలా నయం. ఇంతకీ నీ సాహిత్య పఠనం గురించి అడుగుతాను. ఒక విషయం చెప్పు. చదువుతున్నావు కదా. ఏం చెయ్యాలని. అంటే నా ఉద్దేశం చదవటం ద్వారా ఏదో సమ్‌థింగ్ నీకు... నీలో.. ఒక తృప్తి కలుగుతూ ఉంటుంది. అదేంటి? ఏ పర్పస్ నెరవేరుతోంది''

"చెప్పాగా. నాకే పూర్తిగా అర్థం కాలా కానీ నేను మిస్ అయిన నేను తప్పిపోయిన జీవితాన్ని నేను పొందుతున్నట్టనిపిస్తుంది. ఒక సంతృప్తి కలుగుతుంది. అంతకంటే ఏం ఉపయోగం? ఏం ఆశించగలం"

ఇద్దరూ హాస్టల్ బిల్డింగ్‌ని సమీపించారు.

పీజీ స్టూడెంట్స్ కొందరు బయట అరుస్తున్నారు. కోలాహలం. ఏదో సినీవారపత్రిక చూస్తున్నారో గుంపు. సినీతారల శీలభంగం గావిస్తూ వేడి మాటలతో చర్చలు నడుస్తున్నాయి. హాస్టల్ పాతబడినట్టు రంగుమాసిపోయి ఉంది. ఎన్నేళ్ల క్రితందో ఆ కట్టడం?

ఇద్దరూ మెట్లెక్కుతున్నారు.

అలా వరండాలో నడుస్తూ ఓ డోర్ మీద నాక్ చేశాడు కోటి.

కళ్లజోడు సవరించుకొంటూన్న ఒక వ్యక్తి తలుపుతీశాడు. ఒక నిమిషం దీర్ఘంగా చూసి కోటిని గుర్తుపట్టినట్టు "రండి'' అన్నాడు.

"రావోయ్'' కోటి లోపలకి దారితీశాడు.

కళ్లజోడు వ్యక్తి ఓ మంచంమీద దుప్పటి సరిచేసి 'కూర్చోండి' అన్నాడు... ఎదురుగా ఓ కుర్చీమీద తను ఆసీనుడవుతూ.

కోటి పరిచయం చేశాడు.

"ఈయన బాలయ్య''

శరత్ లేచి రెండడుగులు వేసి బాలయ్యా వైపు చేయి సాచాడు. అతడు ఖంగారుగా లేచి నిలబడిపోయి మళ్లీ కూర్చుని.

"మీరు?" అన్నాడు కరచాలనం చేస్తూ.

"పేరు శరత్..." అన్నాడు కోటి.

"మంచిది''

శరత్ వచ్చి కూర్చున్నాడు. బాలయ్యా తలొంచుకుని నేలని పరిశీలించాడు. తర్వాత కోటిని చూసి కాసేపు సందేహించి.

"ఇంతకూ... మీరు?"

కోటి తెల్లమొహం వేశాడు.

శరత్ బలవంతాన నవ్వాపుకొన్నాడు.

"నా పేరు కోటి. ఇంజనీరింగ్ కాలేజీ నుండి... మిమ్మల్ని రెండుసార్లు కలిశాను..."

"అలాగా..."

అతడి మొహంలో ఆలోచనా ముద్ర కనపడుతోంది. కళ్లజోడు అద్దాల మందం చూస్తే రానురాను అతనిపై పెరుగుతున్న జ్ఞాన భారం ఎంతో తెలిసిపోతోంది. మొత్తానికతడు భౌతికంగా తమ ఎదురుగా, మానసికంగా మరే మహాప్రవాహంలోనో ఉంటాడని చెప్పొచ్చు.

"రాజు లేడాండీ?" అడిగాడు కోటి.

"ఆc... వస్తాడొస్తాడు'' అన్నాడు బాలయ్యా.

రాజు కోసం ఎదురు చూస్తున్నాడు శరత్.

రాజు...

ఈ నగరానికి కొన్ని వందల మైళ్లదూరంలో నాగరీక ప్రపంచం అప్పుడప్పుడే తన ఆధిపత్యాన్ని రుజువు చేసుకుంటున్న ఫలితంగా పల్లెలూ, గూడాల మధ్య ఏర్పడిన ఆ చిన్న పట్టణంలో ఓ చిన్న ఉద్యోగి ఇంట్లో పుట్టాడు. స్కూలు వరకూ అక్కడే చదివాడు.

ఓరోజు ఓ సంతకెళ్లాడు. సంతలో చుట్టుపక్కల గిరిజనులూ, గ్రామీణులూ చవగ్గా అమ్మే సరుకుని లారీలకెక్కించి లొట్టలు వేసుకుంటూ కనీసం పదిరెట్లు పెంచి అమ్మబోతున్న వ్యాపారులూ, దళారులూ... ఒకరకం పల్లీయులూ... అధికారులూ... అంగన్‌వాడీ టీచర్లూ మరోరకం.

అందర్నీ చూసుకుంటూ పీడకులూ పీడితులూ కలిసి మెలిసి తిరుగుతున్న షఢుచుల




సమ్మేళనంలాంటి ఆ జనసమ్మర్ధంలో... ఓప క్క చీకటి పడుతున్న సమయంలో... కన్పించిన ఒక మిత్రుడిని చూసి పలకరించాడు.

క్రితంలో అతడు స్కూలుమేట్. ఇప్పుడో చిన్న వ్యాపారి. దగ్గర్లోని ఓ ప్రాంతంలో మొదటిసారిగా కిరోసిన్ను పరిచయం చేసిన ఘనత వహించినవాడు. మరో నాలుగైదేళ్లలో ఆ ఏరియా మొత్తానికే కాబోతున్న అతి పెద్ద వ్యాపారి.

ఆ కాబోయే అతి పెద్ద వ్యాపారి ఇప్పుడు ఇంకా చిన్నవాడే అని కాకపోయినా.... జిగిరీ దోస్తు అన్న ఉద్దేశ్యం వలనా అతడా రోజుఆ సంతలో అతడ్ని పలకరించాడు.

ఆ దోస్తు మహా ఖుషీగా ఉన్నాడు. చాలారోజుల తర్వాత దొరికిన విరామం అనే కాక... ఈ విరామంలో తను నెరవేర్చాల్సిన బాధ్యతలు, తీర్చుకోవలసిన సరదాలూ అన్నీ పరిపూర్తి చేయవచ్చన్న మహానందంలో ఉండగా... కనిపించిన రోజు... కొంచెం ఇబ్బందనిపించినా వీడింకా పిల్లగాడే కనుక పర్లేదని ముందుగా తను నెరవేర్చాల్సిన బాధ్యతల గురించి ప్రయత్నాలు ప్రారంభించాడు.

సంత జరిగే స్థలందాటి అవతలగా పొదల్లో తచ్చాడుతున్న అతడ్ని అర్థం కానట్టు చూశాడు రాజు. అవతల చీకటి పొదల్లో అక్కడక్కడా అలికిడి. ఆ దోస్తులాగే శరీర బాధ్యతలు నెరవేర్చేందుకు తచ్చాడుతున్న సరదా పురుషులూ... ఆ బాధ్యతల బరువు మోస్తున్న గ్రామీణ స్త్రీలూ... మొత్తానికా వాతావరణాన్ని పసిగట్టి,

"ఏంట్రా ఇక్కడా?" అంటే,

"నువ్వు కూడా...రారాదూ'' అని కన్నుకొట్టిన ఆ దోస్తు అటు తిరిగి ఉలిక్కిపడ్డాడు.

రాజు చెయ్యిపట్టుకొని దగ్గర్లోని చెట్టు చాటుకి లాగేశాడతడు. చెట్టు ముందుగా ఓ నడివయస్కుడు అటూ ఇటూ చూస్తూ, పంచె బిగిస్తూ... జేబు తడుముకొంటూ పోతున్నాడు. అతడా చీకటి పొదల్లోంచే వస్తున్నాడు గానీ వీడు దాక్కోవటమేంటి? ఆ రకం మనిషిని చూసి.

"ఒరే ఒరే చూడ్రా... మా నాన్నరా'' గుసగుసగా రాజు చెవిలో అంటూ పొంగిపోతూ... వంగి పోతూన్న దోస్తుని చూసి నవ్వాలో ఏడ్వాలో అర్థం కానట్టు చూస్తున్న అతడు...

"పెద్ద... రసికుడులే... వారానికి... ఆ పవరూ..." తండ్రి రసికతని చూసి చెట్టుచాటున మురుస్తున్న ఆ కొడుకుని చూసి దిగ్భ్రాంతి లాంటి భావం కల్గించుకోక ముందే...

ఆ చెట్టు వెనకనుంచి వచ్చినదా యువతి... ఎండిన శరీరం జారిన అంగాలూ... కానీ వయస్సులో ఉండటం వలన ఇంకా మిగిలిన బిగి ఛాయలు... సరిగ్గా బిగించుకోని వస్త్రాల వలన కన్పిస్తూనే ఉన్నాయి.

"మా నాన్న సెలెక్టు చేసుకున్నాడంటే..." అని లొట్టలు వేసిన దోస్తు... "నువ్వో చవటవి'' అనేసి ఆ యువతితో కలిసి మళ్లీ చీకటి పొదల చాటున మాయమయ్యిన ఆ క్షణాన...

ఆ క్షణాన్నే...

మానవ సంబంధాల సారాంశాన్ని గురించిన ప్రశ్న మొదలయి...

నగరంలో విహారానికి వెళ్లిన సిద్ధార్థుడికి కలిగిన తపనకంటే ఎక్కువయి పోయి...

తన అన్వేషణ సుదీర్ఘమయినదని గుర్తించి...

తనలోని ఆరాటాన్ని పోరాటంగా మలిచి...

బహుశా ఈ వెయ్యేళ్ల యుద్ధంలో తన వందేళ్ల జీవితం... అది నిర్వహించే పాత్రా... తాను కలలుగన్న మహోన్నత మానవ స్వప్న సాధానికి ఒక ఇటుక రాయిగా అన్నా నిలవకపోదా అన్న ఆకాంక్షలో...

అంతకుముందెప్పుడో ఇదో అడవిదున్న

లాంటి మహా మొరటు సమాజమని తెలుసు కొన్నాడు. సమస్తమయిన మానవ సంబంధాలూ, విలువలూ డబ్బుముందు 'ఉష్‌కాకీ' అయిపోతాయనీ తెలుసుకొని... ఈ నిస్సారమయిన, భయానకమయిన, బీభత్స జీవితంలో తను ఇమడలేననే నిర్ణయానికొచ్చాడు.

అందుకే మనుష్యుల్ని ద్వేషించటంతో ప్రారంభించాడుగానీ... క్రమంగా... మనుష్యులు వాళ్ళకివాళ్లే ఈ ఘాతుకత్వానికి కారణం కాదనీ... దాని వెనక అనేక సామాజిక కారణాలు, పరిణామ క్రమ పరిస్థితులూ ఉన్నాయని తెలుసుకొన్నాడు.

అందుకు కారణమయిన ఈ వ్యవస్థను కూకటివేళ్లతో సహా పీకి... ధ్వంసరచనతో ఒకానొక మహోన్నత మానవ పుష్పాన్ని వికసింపచేయాలనుకుని...

ఇప్పుడీ విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్రం చదువుతూ... లోలోపల రాజనీతి గురించి ఉబికి వచ్చే నవ్వునదిమిపెట్టి... తనలో తనే అంతర్లీనంగా లావా ప్రవాహాన్ని నియంత్రించుకుంటూ...

ఆ రూంలోకి ప్రవేశించాడు.

రాజు...

"రాజూ..." అని లేచి చేయి కలిపాడు కోటి.

శరత్ రాజుని చూసి లేచాడు.

"మీరా?" అన్నాడు.

ఆరోజు రాగింగ్ జరిగినప్పుడు అడ్డుకోనేందుకు వచ్చిన వాళ్ళలో అతడూ ఉన్నాడు. పేరు రాజన్నమాట.

★ ★ ★

"ఎసైన్‌మెంట్‌కి ఏం చూడాలో? కొంచెం..." అడిగాడు అర్జున్‌రెడ్డి.

దాదాపుగా ఇదే మొదటి సంభాషణ. అదీగాక అతడే నోరువిప్పి అడిగాడు. అతడేమిటో ఇంతవరకూ తెలీదన్న విషయం గుర్తొచ్చి...

"తప్పకుండా, చెప్పండి. మీరు 'రాయ్ అండ్ శరావ్' చూశారా. అందులో నాజిల్స్‌లో ఒక ఈక్వేషనుంది..."

వివరించాడు శరత్.

"చూస్తాను. అది రాస్తే చాలా?"

"ఆ... చాలు"

మార్నింగ్ క్లాసులయిపోయాక లైబ్రరీలో మ్యాగజైన్స్ సెక్షన్‌లో కొన్ని జర్నల్స్ వెతుకుతున్నాడు శరత్. గిర్రున తిరిగే గుండ్రటి ర్యాక్‌ని మెల్లగానే తిప్పుతున్నాడు. జరిగిపోతున్న పుస్తకాలు.

"అర్రె" ఓ గొంతు రాక్ వెనక వినపడింది. ఆశ్చర్యపడి చుట్టూ తిరిగి చూశాడు.

మాధురి... చిరాకుగా ఉంది. తను చూడాల్సిన బుక్ ఎటో తిరిగిపోయింది. తిప్పిందెవరు?

"శరత్" అంది చికాకుపోయి మామూలుగా అయి.

అతడు ఇదివరకులా కాక గంభీరంగా ఉన్నాడు. మళ్ళీ రాక్‌వంక చూస్తున్నాడు. ఆమె గమనించకుండా తనూ కదిలిస్తోంది పుస్తకాలని.

కాసేపటికి కావల్సింది దొరికి ఓ బల్లదగ్గరకు పోయి కూర్చున్నాడు. పేజీలు తిరిగిపోతున్నాయి. తను దేనికోసం వెతుకుతున్నాడో గుర్తురాక చిరాకుగా దాన్ని బల్లమీద పడేసి దొరికనదాన్ని అందుకున్నాడు ఎదురుగా కన్పించిన జర్నల్స్‌లోంచి.

అంతదాకా అతడిని వెనకనుంచి చూసిన మాధురికి చిన్నగా సందేహం మొదలయింది.

వచ్చి అతడికి ఒక కుర్చీ అవతల కూర్చొంది.

"ఏంటీ... మాట్లాడరా?"

అతడు తలెత్తి చూసి మళ్ళీ చదువుతున్నాడు.




"అంత ఇంట్రెస్టా ఆ జర్నల్స్?"

"పేరు చూశారా'' మళ్ళీ అంది.

పుస్తకం మూసి అట్టచూశాడు. అదేదో ఎకనామిక్స్‌మీద రివ్యూ.

చిరాకుగా బల్లమీద పడేశాడు. ఇందాకటి దే అందుకున్నాడు.

"అయితే ఆ కోపం నామీదా?" వదల కుండా అడుగుతోంది.

అతడు లేచి బయటకు నడిచాడు. మెట్లమీ దనుంచి దిగుతూ తలతిప్పితే బయటకు వస్తున్న ఆమె.

మట్టిరోడ్డులోంచి నడక.

"శరత్..."

ఆగలేదు.

"ఏదయినా... నేను పొరపాటున అనుంటే... సారీ''

"... ..."

"సారీ అన్నాగా''

అతడు బెట్టుగా నడుస్తున్నాడు. ఓ వంద డుగులు వేశాక సందేహమొచ్చింది. వెనక్కి తిరిగాడు. ఆమె చరచరా వెళ్లిపోతోంది. లైబ్రరీ వైపు.

అతడు దాదాపుగా పరిగెత్తి వెళ్ళాడు.

"మాధురీ'' పిలిచాడు.

ఆమె తల కూడా తిప్పలేదు.

"ప్లీజ్..." బతిమాలుతూ వెంటపడటం అతని వంతయింది.

మొత్తానికామెని బతిమాలి, బామాలీ కోపం చల్లార్చాడు.

"ఎందుకా వెధవ ఫోజు?" అంది.

"ఏమో సరదాగా ఏడిపించాలనిపించి అయినా మీరు మాత్రం సరిగ్గా మాట్లాడారా?" అన్నాడు శరత్.

"నేనెలా మాట్లాడాను. మామూలుగా శశి తోనో, భానుతోనో మాట్లాడినట్టే మాట్లాడాను. నువ్వు పొరపాటుగా అర్థం చేసుకుంటే నేనేం చేయను?" అంది మాధురి బుంగమూతి పెట్టి.

"అవునవును. నేనే మిమ్మల్ని అర్థం చేసు కోలేకపోయాను'' అన్నాడతడు నవ్వుతూ

"అబ్బా! శరత్! మనిద్దరిదీ మరీ చిన్న పిల్లల పోట్లాటలా వుంది. ఇంతకీ నాతో స్నేహం చేయడం మీకిష్టమేనా కాదా?" అడి గింది మాధురి.

"ఎందుకు కాదు.''

"అయితే సరే! మిమ్మల్ని నేను కొన్ని విషయాలు అడగాలనుకుంటున్నాను, అడగ నా?"

"తప్పకుండా'' అన్నాడు శరత్.

ఇద్దరూ లైబ్రరీ ఎదురుగా రోడ్డుమీదకొచ్చా రు.

అతడు తననుతానే విస్తుపోతూ గమ నించుకున్నాడు. పక్కనే నడుస్తున్న మా ధురి... ఒక్కసారి స్పర్థ తొలిగాక స్నేహితు లు మరింత సన్నిహితమవుతారు సహజంగా నే... అలాంటి మూడ్‌లో ఉంది.

"శరత్..."

"ఊఁ"

"ఇంతవరకూ మీ గురించి అడగలేదు''

ఇబ్బందిగా కన్పించకుండా ప్రయత్నం చేశాడు శరత్...

"ఊఁ! అడగండి''

"మీ... ఫామిలీ..."

"అమ్మా, తమ్ముడూ... మామయ్యా... ఇంక ఇటూ అటూ తాతలూ అందరూ... చనిపోయారు''

"ఓ అయామ్... సారీ''

కొంత నిశ్శబ్దం...

"తండ్రిలేని లోటు... నాకు కొంత తెలు సు'' అంది హఠాత్తుగా.

అతడు మాట్లాడలేదు.

అతడివైపుకి తిరిగి అంది.

"మా నాన్న ఉండీ... లేనట్టే''

అతడు ఇబ్బందిగా చూశాడు. ఎలా రిసీవ్

చేసుకోవాలి ఆమెని? సానుభూతి చూపాలా? లేక తనూ బాధపడాలా? అర్థం చేసుకునేంత అనుభవం... అదీ ఆడపిల్ల దగ్గర... తనకిలేదు.

కాసేపు సంకోచించి...

"అదేంటి?" అన్నాడు.

"అదే... వింతగా అనిపిస్తుంది. మొదటి నుండీ ఊహల్లో బతికే వాడు... ఎప్పటికయినా పెద్ద బిజినెస్ టైకూన్ అవుతానని... నానా రకాలపాట్లు... అమ్మని కట్టుకున్నాక ఆమె తెచ్చిన ఆస్తితో ఆయనదెప్పుడో వదిలించేశాడు కూడా... ప్రయోగాలు మొదలుపెట్టాడు. కొంతకాలం ఊరుకొంది. నేనూ, తమ్ముడూ ఇంక మాకు ఆధారం కూడా పీకేస్తాడని గొడవపడి... కోర్టుకెళ్లి గందరగోళం... చివరకు ఆయన అలిగి ఎక్కడెక్కడో తిరిగి... ఏవో చేస్తుంటాడు... రకరకాల ఉద్యోగాలు... చేపల చెరువులకి కాపలానుంచీ మల్లెపూల కొట్లు దగ్గర గుమస్తావరకూ... హొటల్ సూపర్‌వైజర్‌నుంచీ... సినిమావాళ్ల ఆఫీసుల్లో క్యారేజీలు మోసేవాడిగా... ఒక్కోసారి శ్రీశైలం అడవుల్లో స్వాములాళ్ల దగ్గర కొన్నాళ్లుండి.... ఏదోఒక టౌనులో హిమాలయాల నుంచి దిగిన సాధువులాగా పేపర్లో వేయించి ఏ లాడ్జిలోనో మకాం వేస్తాడు. ఏది చేసినా ఊహలు... లక్షల్లోనే... కట్టుబట్టలు మాత్రం దక్కించుకుంటాడు. వచ్చిపోతుంటాడు, ఏ నెలా రెండ్నెల్లకో..."

"మాధురీ..." నిలబడ్డాడు శరత్.

కళ్లు కలుసుకున్నాయి.

"ఎందుకు బాధ మీకు? నాకే లేదు. అమ్మకూడా మరిచిపోయింది'' అనునయిస్తూ అంది.

బాధ... ఎలా చెప్పగలడు?

ఆ బాధ నీ గురించి... నీ మధురమయిన చిరునవ్వు... ఆ కరుణ ప్రవాహాల చూపులు... మాధురీ వాటి వెనుక అంత విషాదాన్ని ఎలా దాయగలిగేవు... అనలేడు!

అతడికేదో అనుభవంలోకి వచ్చింది.

కష్టాలూ బాధలూ అనుభవిస్తేనే మనిషికి నిజంగా ఆనందం అనేది తెలిసేది. విషాదం రుచి చూస్తేనే మహాద్భుతమయిన చిరునవ్వులు పంచగలిగేది. వేదనలోంచే ప్రపంచాన్ని ప్రేమించగలిగే కరుణ జనించేది.

'అదేనా నీ రహస్యం మాధురీ?'

"ఎందుకు సీరియస్ అయిపోయారు'' అంది.

"ఏం లేదు పదండి''

ఇద్దరూ డిపార్ట్‌మెంట్‌కు చేరారు. ఆమె మామూలుగా పోయి క్లాసులో కూర్చొంది. శరత్ వాటర్ కూలర్ దగ్గర మొహం మీద నీళ్లు జల్లుకొని, కర్చీఫ్‌తో తుడుచుకుని క్లాస్‌వైపుకి నడిచాడు.

★ ★ ★

మధ్యాహ్నం ఒకే అవరుంది.

అతడొచ్చేసరికి లెక్చరర్ విష్ణువర్ధన్ క్లాసు తీసుకొంటున్నాడు. సాధారణంగా అతను పాఠం చెప్తే ఆ క్లాసులో స్టూడెంట్స్‌కే కాక పక్కరూంలో వాళ్లకూ నిద్రొస్తుంది.

"ఏం చెప్తున్నాడ్రా వీడూ..." వీఎస్వీ నెమ్మదిగా అంటున్నాడు.

"ఏవీ రావు'' అన్నాడు రాంచెందర్.

విష్ణువర్ధన్ పూర్తిపేరు విష్ణువర్ధనరావు. ఇంటిపేరు ఏ కాబోలు. ఆఫీస్‌రూంలో ఆయనకొచ్చిన లెటర్స్ చూసి ఉంటారు... అప్పట్నించీ ఏవీరావు అనటం మొదలయింది.

"వీడు ఏవీరావు... వీడికి ఏమీరావు'' అన్నది స్లోగన్.

'సరే నువ్వు చెప్పేదేదో చెప్పుకో' అన్నట్టు చూస్తున్నాడు శరత్. ముందు బెంచీమీద తనకు డయాగ్నల్లీ ఆపోసిట్‌గా కూర్చుని ఉన్న ఆ వ్యక్తిమీద శరత్ దృష్టిపడింది.

అతను అర్జున్‌రెడ్డి.

అతడు లెక్చరర్‌నే చూస్తున్నాడు




దీర్ఘంగా... వదలకుండా... కళ్లు తిప్పకుండా. ఆ చూసే తీరులో ఏదో ప్రత్యేకత ఉందనిపించి అతడినే పరిశీలించసాగాడు శరత్.

ఇంక క్లాసుల్లేవని తెలీటంతో అందరూ లేచారు. రూం అంతా ఖాళీ అయిందాకా కూర్చున్న శరత్ కొద్దిసేపు అలాగే చూసి ముందుబెంచీ మీదకు వంగి పిలిచాడు.

"అర్జున్... అర్జున్ రెడ్డిగారూ..."

ఇంకా అతను బోర్డువైపే చూస్తున్నాడు.

నోట్సుతో వెనుకనుండీ సున్నితంగానే తాకాడు "అర్జున్" అంటూ.

అర్జున్‌రెడ్డి మెల్లగా తల తిప్పేడు.

ఆ కళ్లు.... ఆ కళ్లు... గాజు కళ్లు... ఆ చూపులో... జీవంలేదు... వళ్లు జల్లుమంది. అయినా "పదండి" అన్నాడు.

అతను నెమ్మదిగాలేచి బొమ్మలా కదిలాడు డోర్‌వైపు.

డిపార్ట్‌మెంట్ బయట చెట్టుకింద చప్టామీద కోటి కూర్చుని ఉన్నాడు... తనకోసం. ముందు నడుస్తున్న అర్జున్‌ని చూసి అతడి నోరు తెరుచుకుంది. లేచి నిలబడ్డాడు గబుక్కున.

అర్జున్ అతడిని రాసుకుంటూ వెళ్లిపోయాడు.

"సమ్‌థింగ్... అన్నాచురల్" అంటున్నాడతను. వెనకాలగా వచ్చిన శరత్ చేతిలో అర్జున్ నోట్సులున్నాయి. వాటిని తెరిచి చూశాడు. రెండు నోట్సులు ఖాళీ. ఏమీ రాసినట్టులేదు. క్లాసులో ఉంటాడుగానీ వింటాడా? కంటాడా?

మూడో నోట్స్ తీశాడు.

సాధారణంగా వెనక పేజీలమీదే నోటికొచ్చింది రాస్తుంటారు విద్యార్థులు. అదే చూస్తున్నాడు శరత్.

"అమ్మ..." ఎదురుగా మంచి బొమ్మ ఓ దేవతది గీసివుంది.

"అమ్మ కావాలి"

కింద ఏవో లైన్లు కొట్టేసి ఉన్నాయి. జాగ్రత్తగా పరిశీలించాడు. కొట్టివేతగా ఉపయోగించిన గీతలకింద దాగిన గీతలు... అతడు ఉలికిపాటుకి గురయ్యాడు.

'అమ్మ కావాలి. నాన్న చావాలి'

కింద లైన్లు ఇంకా గజిబిజిగా ఉన్నాయి.

"శశీ... డియర్... డియర్ శశి"

"డియర్ డియర్ శశి"

ఆ పేజీ తిప్పాడు.

ఓ బొమ్మ గీసివుంది.

ఓ కాలువ. మునిగిపోతున్న ఓ బాలుడు. అవతలగా ఓ పడవమీద నుండి చూస్తున్న కొందరు వ్యక్తులు. ఒడ్డుమీద నిలబడి కొరడా ఊపుతున్న ఓ మీసాల వ్యక్తి. ఇవతలి గట్టుమీద ఇటు తిరిగి కూర్చున్న ఓ అమ్మాయి.

ఆ బొమ్మకు పేరు 'నేను' అని పెట్టాడు.

ఇంకో పేజీ తిప్పాడు. ఓ కవితలాంటి రాతలు. పైన టైటిల్. 'శశీ నన్ను క్షమించు' అని.

"కేసు చాలా ముదిరినట్టుందే" కోటి.

"మనకు తెలీకుండా... పాపం అర్జున్‌మీద జాలి పుడుతోంది. అతనో సఫరర్ అనేది తెలుస్తూనేవుందిగా. కానీ శశిని వేధిస్తున్నట్టున్నాడు తన మూర్ఖత్వంతో..."

"పాపం అందుకేనేమో అట్లా ఉంటాడు దిగులుగా" మళ్ళీ అన్నాడు శరత్.

"ఊహుఁ... ఇదొక్కటేకాదు. హి ఈజ్ డూయింగ్ సమ్‌థింగ్" అనుమానంగా అన్నాడు కోటి.

"ఏం చేస్తున్నాడని నీ ఊహ?"

"చెప్పాగా... బహుశా..."

★ ★ ★

ఏవీరావు లీవ్‌లో ఉన్నాడు.

స్టూడెంట్స్ కబుర్లు చెప్పుకొంటున్నారు. నవ్వులూ... కామెంట్లూ. మాధురి ఇంటి నుంచి తెచ్చుకున్న వాటర్ బాటిల్ వంచి

నీళ్లు తాగుతోంది. శశి తల వంచుకొని గోళ్లు కొరుకుతోంది. ఆమెలో ఆందోళన క్షణక్షణం పెరిగిపోతోంది.

శరత్ ప్రవీణ్‌ని ఏదో డౌట్ అడుగుతున్నాడు.

గుమ్మంలో అలికిడయింది. శరత్ తల తిప్పాడు.

అర్జున్... అతడు నిదానంగా నడుస్తూ మాధురీ... శశీ కూర్చున్న బెంచ్ దగ్గరకు వెళ్లాడు. నడిచే ఆ పద్ధతి చూసి శరత్ గుండెల్లో తుఫాను మొదలయింది.

"కోటీ..." పిలిచాడు కళ్లతో అర్జున్‌ని సూచిస్తూ.

కోటి గబగబా లేచి వచ్చాడు.

"శశీ'' ఆమె డెస్కుమీద చేతులు ఆన్చి పిలిచాడు అర్జున్. శశి తలవంచి పెదవులు కొరుక్కుంటోంది. మాధురి తెల్లబోయి చూస్తోంది.

"శశీ'' అరిచాడు పెద్దగా.

క్లాసు అదిరిపోయింది. అందరూ అతడినే చూస్తున్నారు. ఆమె చెయ్యి పట్టి లాగి...

"చెప్పు... నన్ను క్షమించానని చెప్పు'' అరిచాడు కీచుగా. అతడు అదోలా ఒణుకుతున్నాడు. మొహం, పెదవులు పాలిపోయాయి.

"చూడు... ఇది చూసయినా నోరు తెరిచి... చెప్పు'' కుడి చెయ్యి చాపాడు. మణికట్టు నుంచి వెనక్కి...

'సారీ శశి' అన్న అక్షరాలు బ్లేడుతో చెక్కటం వలన నెత్తుటి చారికలతో ఊడిన చర్మంతో గజిబిజిగా కన్పిస్తున్నాయి.

"అర్జున్..." వారిస్తూ వెళ్లాడు కోటి.

"ఛెప్పవు కదూ! ఒక్కసారి క్షమించానని... నోరు విప్పవుకదూ'' అతడు అటూ ఇటూ చూశాడు.

మాధురి చేతిలో వాటర్‌బాటిల్. అది ప్లాస్టిక్‌ది కాదు... గాజుది. పెద్ద అత్తరుసీసాలా ఉంది.

దాన్నందుకొన్నాడు అర్జున్.

మాధురి లొక్కోబోయింది శశి భయంగా చూస్తోంది. కోటి వెనుకనుంచీ ఆ చెయ్యిపట్టుకున్నాడు.

"భయపడకు నిన్నేం చెయ్యను. వదలవోయ్ నువ్వొకడివి'' కోటిని విదిలించుకొని వెనక్కి నడిచాడు. డయాస్ మీదకు ఎక్కి నుంచొన్నాడు. ఓ చేతిలో ఆ సీసా ఎత్తి పట్టుకున్నాడు.

క్లాసంతా భయంగా చూస్తోంది... అదెవరి మీదకు విసురుతాడో అని.

"శశీ చివరిసారిగా అడుగుతున్నాను..."

... ...

"చెప్పవుకదూ! సారీ చెప్పినా... చెయ్యి కోసుకున్నా... నోరు విప్పవు కదూ''

"శశీ... చెప్పు ఎందుకొచ్చిన గొడవ..." మాధురి బతిమాల్తోంది. ఇంతవరకూ వచ్చాక ఇంక తగ్గేదేంటన్నట్టు తెగించి కూచుంది శశి.

అర్జున్ గోడవైపుకు తిరిగి నుంచొన్నాడు. తల తిప్పి శశిని చూశాడు. ఆమె నిరసనగా చూస్తోంది. కుడిచేత్తో గట్టిగా ఆ బాటిల్‌ని పట్టుకొని బలంగా గోడకేసి గుద్దాడు. భళ్లుమన్న చప్పుడు. చేతికీ గోడకీ మధ్య సీసా ముక్కలయింది. కొన్ని కోసుగా అరచేతిలో గుచ్చుకున్నాయి. నెత్తురు ధారగా డయాస్‌మీదకు కారుతోంది.

"అమ్మో'' ప్రవీణ్ చావుకేక పెట్టాడు.

"కోటి'' శరత్ పరిగెత్తాడు. ఇద్దరూ అర్జున్‌ని అటూ ఇటూ పట్టుకున్నారు. అతడు వాళ్లని ఈడ్చుకొంటూ శశిముందుకు వచ్చి అరచేయి విప్పాడు. డెస్కుమీద కారుతున్న నెత్తురు... జారి ఆమె ఒళ్లోపడింది.

మరుక్షణం ఆమె విరుచుకుపడిపోయింది.

పది నిముషాల తర్వాత ఆటోలో అరచేయి చూసుకొంటున్నాడు అర్జున్. అతని






వడిలో శశి. ఇవతలగా మాధురి.

ఆటో హాస్పిటల్‌వైపు పరిగెత్తుతోంది.

★ ★ ★

అర్జున్‌రెడ్డిని చూస్తే బాధగా ఉంది.

మొన్నామధ్య అనుకోకుండా వాళ్ల రూంకి వెళ్లి అతడు లేకపోవటంతో కాసేపు వెయిట్ చేయాల్సి వచ్చింది. ఆ గదిలో కూర్చుంటే... ఏమిటో చెప్పరాని భావం. ఇబ్బంది... అతడి బెడ్డింగ్... పుస్తకాలూ... అలమరా.. చూస్తుంటే సన్నగా వణుకు కలిగింది. తన రూంమేట్ మురళీకృష్ణ అట... మత్తుగా గొణుక్కుంటున్నాడు. అతడినీ అర్జున్‌నీ కలిపి చూస్తే...

కోటి అనుమానం నిజం అయ్యుండాలి.

పనిగట్టుకు వెతికినట్టు కాకుండా అక్కడొకటీ... ఇక్కడొకటీ పుస్తకాలు తీస్తూ అతడి అలమరా టేబుల్ సొరుగు తీస్తే...

కొన్ని ఖాళీ పాలిథీన్ కవర్లూ... కొన్నింటిలో ఎండిపోయిన ఆకులేవో ఉన్నాయి.

గంజాయి

అనుభవం లేకపోయినా ఫొటోల్లో చూసిన గుర్తు.

సినిమాల్లో అయితే గంజాయి తాగేవాళ్లని విలన్లలాగా చూపిస్తారు. ఒక అసహ్యాన్ని క్రియేట్ చేస్తారు.

అర్జున్ విలనా?

అర్జున్ పుస్తకాలు తిప్పితే ఇంటినుంచి కొన్ని లెటర్స్ కన్పించాయి. చదవకూడదని తెలుసుగానీ అతడిస్థితి... తన మూలంగా ఏ మాత్రం మేలు జరిగినా అతడికే మంచిదని చూశాడు.

అర్జున్ తల్లి చనిపోయింది. తండ్రి రెండో పెళ్లి చేసుకున్నట్టుగా ఆ లెటర్‌లనుబట్టి అర్థమవుతోంది. క్రమంగా తండ్రీ కొడుకులు

మాట్లాడుకోవటం కూడా మానేశారు. పిన్ని చెడ్డదేం కాదు. గయ్యాళి సవతితల్లికాదు. అయినా ఒక దూరం... ఆవిడకో బాబు. అర్జున్‌కీ అతడికీ మధ్య పదేళ్లకు పైన వయసులో తేడా ఉందట. కాలేజికి పోయే వయసులో పారాడే తమ్ముడు. అలా అతడికి ఇంట్లో మాట్లాడే వాళ్లే కరువయ్యారు. ఇల్లు హాస్టలయ్యింది. హాస్టల్ ఇల్లయింది. ఇక్కడ ఇంకా స్వేచ్ఛగా ఫీలయ్యి ఉంటాడు. మురళీ కృష్ణలాంటి వాళ్లు గైడెన్స్ ఇచ్చి గంజాయి నుంచీ హెరాయిన్‌దాకా తీసుకుపోయి ఉంటారు.

ఎంత వయొలెంట్‌గా ప్రవర్తించాడు? అరచేతిలో సీసాను పగలగొట్టి... వింత మనిషా? అంత నెత్తురు ధారలు కట్టినా... పెంకులు గుచ్చుకుపోయినా మొహంలో బాధలేదు. చిన్న గీత పడితేనే అయ్యో అంటాం. అలాంటిది నిశ్శబ్దంగా... మామూలుగా ఉండిపోయాడు. ఆ రోజు శశికి అరచెయ్యి చూపుతున్నప్పుడు అతడి మొహంలో కసి కనపడింది.... అవును.

కసి ఇంటిమీదా... తండ్రిమీదా... కసి...

ఇప్పుడు క్లాసులకి రావటం తగ్గించింది శశి. ఇంకా వయొలెంట్‌గా బిహేవ్ చేస్తున్నాడట అతడు. ఆమధ్య ట్యూబ్‌లైట్‌ని ముక్కలు చేసి నీళ్లలో కలుపుకొని తాగేశాడట.

హాస్పిటల్‌లో చేర్చారు. ఇక అతడి జీవితం అంతేనేమో!

★ ★ ★

మిడ్ ఎగ్జామ్స్.

పరీక్షల సీజను. విద్యార్థి జనసమూహం బుద్ధిగా చదువుల్లో పడినట్లే ఉంది. సాయంత్రాలు హాస్టల్స్‌లో పుస్తకాలు తిప్పుతున్న పిల్లలు ఎక్కువయిపోతున్నారు రోజురోజుకి. కాంటీన్‌లో రాత్రిపూట విద్యార్థులు కనిపిస్తున్నారు. ఎక్కువగా పది దాటాక. కొందరు ముందుచూపుతో ఫ్లాస్కులు నింపుకొంటున్నారు.

మొత్తానికి మూడ్ వచ్చేసింది శరత్‌కి. గత వారంరోజులుగా శ్రద్ధగా చదువుతున్నాడు. మామూలు పనులన్నీ వాయిదావేసి వీలయినంతకాలం పుస్తకాలముందే గడుపుతున్నాడు.

కానీ సిటీలో తనక్కావలసిన కొన్ని ఇవాళయినా తెచ్చుకుంటే ఇక ఎగ్జామ్స్ అయ్యేంత వరకూ బాధ ఉండదు. ఓ పని అయిపోతుంది.

శరత్ బస్టాపు దగ్గర వెయిట్ చేస్తుండగా అటుగా పోతున్న రమణ కనిపించాడు.

"ఎక్కడికీ?"

"వస్తావా?" సరదాగా అడిగాడు శరత్.

"పద"

శరత్ ఆశ్చర్యపడి "ప్రిపేరవటం లేదా ఇంకా? నాతో రావటం ఎందుకు మహానుభావా? బుద్ధిగా చదూకో' కోప్పడ్డాడు.

"అబ్బ నీ ప్రిపేరేషన్ మంటెట్టినట్టే ఉంది. అవుతాలే. అసలు ఎగ్జామినేషన్ స్పిరిట్ రానిదే''

"మరెప్పుడొస్తుంది ఎగ్జామ్ స్పిరిట్?"

"నాకయితే క్వశ్చన్ పేపర్ చూసేప్పుడు. అరే ఈమాత్రం చచ్చుప్రశ్నలకి ఎప్పుడో చదివి అవతల పారేసేవాణ్ణే అన్పిస్తుంది''

"మరెలాగబ్బా... ఎగ్జామ్ స్పిరిట్ రావటం!"

భుజాలెగరేశాడు రమణ.

"మీ రూమ్మేటుతో ఏదయినా బార్‌కు పోతే పుష్కలంగా తాగొచ్చు స్పిరిట్'

నవ్వుకొన్నారు.

"సరే... పోదాంలే' అన్నాడు శరత్.

"ఏంటి నడిచా?" అదిరిపడ్డాడు రమణ.

"ఏం ఆమాత్రం నడవలేవూ?" ఏడ్పిస్తూ నాలుగడుగులు వేశాడు శరత్.

"ఈ భౌతికకాయం... ఆటోనో బస్సో తప్ప దేన్నీ అంగీకరించదు. పద ఆటోలో పోయివద్దాం"

రమణ ఓ ఆటో పిలిచాడు. ఇద్దరూ సిటీలో

 

షాపింగ్ ముగించుకుని డ్రాయింగ్ మెటీరియల్ కొనుక్కొని కన్పించిన హొటల్‌లో దొరికింది తిని చీకటి పడుతుండగా తిరిగొచ్చారు.

"నీకీసారి గట్టిపోటీ ఆ ప్రవీణ్. ఇంకా బీఎస్పీ ఒకడూ... బీట్ చేస్తావా?" అడుగుతున్నాడు రమణ.

"ఏమో? గార్ల్స్‌లో శశిరేఖ ఉంది. టఫ్ కాండిడేట్. ఈసారి ఆ అమ్మాయి కొడుతుందేమో''

ఇద్దరూ బస్టాపు దాటి కాలిబాటకు తిరుగుతుండగా ఏదో గొంతు "శరత్... శరత్' పిలుస్తోంది. ఇద్దరూ వెనక్కి చూశారు.

శశిరేఖ.

బస్టాపుకోపక్కన పల్చని వీధిలైటు కింద ఒక్కతే నిలబడి వుంది. ఆమె గొంతులో వణుకు.

దగ్గరగా వెళ్ళారు.

శశిరేఖకు ఒకపక్కన ఆటో ఒకటి ఆగి వుంది. రెండోపక్క ఇద్దరు నిలబడివున్నారు. ఆటోలోంచి తొంగిచూస్తున్న మరో ఇద్దరు. ఆటోడ్రైవరు పరపరా ఏదో నములుతున్నాడు.

"వాట్ హాపెండ్' రమణ గట్టిగా అన్నాడు.

"వీళ్లు..." అంది శశిరేఖ. ఆమె కంటనీరు సుళ్లు తిరుగుతోంది. ఆమె చేతిలో జిప్పు ఊడదీసిన హాండ్‌బ్యాగ్ ఉంది.

"నువ్వెవడ్రా'' అన్నాడు ఆటోలోంచి తొంగి చూస్తున్న నడివయస్కుడు. అతడు గెడ్డమూ, బట్టతలతో తెలుగు సినిమాలో విలన్ పక్కన నిలబడే 'ఎస్ బాస్' అనుచరుడిలా ఉన్నాడు. ఆటోలోంచి తాగినట్టుగా లిక్కర్ వాసన వస్తోంది.

నుంచున్నవాళ్లలో ఒకడు తన చేతిలోని వస్తువులని పైకీ కిందకీ ఊపుతున్నాడు. అవి శశిరేఖ బ్యాగ్‌లోంచి లాగినవి.

"ఏంటీ న్యూసెన్స్'' శరత్ అన్నాడు.

"న్యూసెన్స్... ఇంగ్లీష్ వాడుతున్నాడు కుర్రాడు'' నుంచొన్నవాళ్లలో ఒకడు వచ్చి అరచేత్తో తోశాడు. శరత్ పడబోయి నిలదొక్కుకున్నాడు.

అతడి తల దిమ్మెక్కిపోయింది. వీళ్లు... ఇంతవరకూ తనకు ఊహలో కూడా తెలీని వ్యక్తులు., వాళ్ల మొరటుతనం, ఆధిపత్యం, అహంకారం... వాళ్ల పరిస్థితిని చెప్పకనే చెప్తున్నాయి. ఒక వీధిరౌడీ చేతిలో ఇంక తన్నులు తినటమే మిగిలింది. తనకే ఇట్లా ఉంటే పాపం శశి.

ఆ అమ్మాయి భోరుమనేందుకు సిద్ధమవుతోంది.

ఈమధ్య చీకటిపడితే చాలు కాంపస్‌లో రౌడీలూ, అల్లరి మనుషులూ ఎక్కువయిపోతున్నారన్న విషయం చాలాసార్లు విన్నాడు. అందులోనూ గార్ల్స్ హాస్టల్స్ దగ్గర...మరీ ఎక్కువ. వీళ్లూ అలాంటి బ్యాచ్ అనుకోవచ్చు.

రమణ ఏదో అనటంతో అతడిని గట్టిగా తోశారు. అతడొచ్చి శరత్ పక్కన పడ్డాడు.

"పొండెహే... మీకేం పనిక్కడ. దీన్ని మీ ఇద్దరిలో ఎవడయినా ఉంచుకున్నారా. చెప్పండి. వదిలేస్తా మీ కుర్రనా కొడుకులకి. ఇక్కడ ఏంపనిరా... చదువా సంధ్యా! అమ్మాయిలతో షికార్లూ... చెట్ల వెనక హాస్టల్‌లో' అంటున్నాడొకడు.

"ప్లీజ్ ఆ అమ్మాయిని వదిలెయ్యండి'' శరత్ బతిమాలాడు.

"వీడేంటి. వదలడెట్టా? ఏమే వాడికీ నీకూ..." సన్నగా ఈల వేశాడు ఆటోలోని బట్టతలవాడు.

శరత్‌కి గుర్తొచ్చింది.

ఈ టైంలో గార్ల్స్ హాస్టల్‌కి దగ్గరలో రాజూవాళ్లు కూర్చుని ఉంటారు హాస్టల్‌లో ఉండే అమ్మాయిల్ని కలుసుకుని వాళ్ల పను

లేవో మాట్లాడటానికి. పావని అనే అమ్మాయి హాస్టల్‌లోనే ఉంటోంది.

వాళ్లను పిలిస్తే... వాళ్లనే పిలవాలి. వీళ్లకి ఎదురుతిరిగి మాట్లాడే ధైర్యం ఎవడి కుంటుంది?

నాలుగడుగులు దగ్గరకు వేశాడు శరత్.

"ర్రేయ్... పొమ్మని చెప్పానా?"

"ప్లీజ్"

ఆటోలో వాడు చెయ్యి తీశాడు జేబు లోంచి. ఛక్‌మన్న శబ్దం. బటన్‌నైఫ్ తెరుచుకుంది. వీధిలైటు వెలుతురులో పచ్చగా మెరిసింది.

శరత్ గాళ్స్ హాస్టల్‌వైపుకి తిరిగి పరుగందుకున్నాడు.

"ఆడారి వెధవ. తగిన చోటుకే పోతున్నాడు" నవ్వారు వాళ్లు. ఇంకొకడు రమణ దగ్గరకు పోయి షర్టు పట్టుకొని లేపి రెండు దెబ్బలు వేశాడు.

లాన్‌లో క్రోటన్స్ పక్కన రాజూ, కోటీ ఇంకో నలుగురు కూచుని వున్నారు. హాస్టల్ గేటుదగ్గర పావని వెనక్కి తిరిగి గాళ్స్‌నెవరినో పిలుస్తోంది. హాస్టల్ బయట నియాన్‌లైట్లు పచ్చని వెలుతురుని వర్షిస్తున్నాయి. వీళ్లు కూచున్నచోటు సగం నీడలోవుంది.

దూరంగా పరిగెత్తుకొస్తున్న ఆకారం... చూసి నిలబడ్డాడు కోటి.

అటూ ఇటూ చూస్తూ వచ్చిన శరత్ కోటిని చూసి క్రోటన్స్ దూకి వచ్చాడు. అతడు రొప్పుతున్నాడు.

"శరత్ ఏమయింది?"

"అక్కడ..." భయంగా అన్నాడు. ఇంకా గుండెలెగిసిపడుతున్నాయి.

"ఊఁ... అక్కడ...?"

"బస్టాపుదగ్గర... నలుగురు రౌడీలు... మన శశిని పట్టుకొన్నారు. రమణని కొడుతున్నారు"

రాజు లేచి నిలబడ్డాడు.

"పదండి"

"వాళ్ళదగ్గర కత్తులున్నాయి"

రాజు ఓ క్షణం ఆలోచించాడు.

"వాళ్ళ పేర్లు ఏమన్నా విన్నావా?"

"ఊహుఁ! కానెవడో టార్జాన్ అంట. ఆటోలో వున్నాడు. బట్టతలా... వాళ్ల మాటల్లో తెలిసింది"

"వీడెవడన్నా..."

"ఎంతమంది శరత్ వాళ్లు"

"నలుగురు. ఇద్దరు ఆటోలో వున్నారు. ఆటో డ్రైవర్ ఐదోవాడు"

"ప్రస్తుతానికి మనం చాలు ఏం దాసూ" రాజు అడిగాడు పక్కకు తిరిగి. దాసు అనే అతను నవ్వాడు సంతోషంగా.

"చాలన్నా. ఈ పేరువూరూ లేని కొడుకులు... రుబాబు చేయటమేంటి? యూనివర్సిటీలోకొచ్చి. అసలా టార్జాన్ ఎవడండీ బాబూ? ఇంతవరకూ లిస్టులో లేడు. వాడు కూడా మనమీదకొచ్చేవాడే..."

"అంటే పేరున్నవాళ్లు చేయొచ్చా రుబాబు? పదండి" రాజు కదిలాడు.

రోడ్డుమీదకొచ్చారు. దూరంగా బస్టాపుదగ్గర ఇందాకటి దృశ్యమే కొనసాగుతోంది. శశిరేఖ బిగ్గరగా రోదిస్తోంది. రమణని ఇంకా కొడుతున్నట్లు శబ్దాలు.

త్వరత్వరగా చేరుకున్నారు.

వెనకగా వచ్చిన శరత్‌ని చూసి "ఒరేయ్! బ్యాచ్‌ని వేసుకొచ్చాడు రోయ్" అన్నాడు టార్జాన్. కొంత షాక్‌తిన్నారు వాళ్లు.

"ఏంటి విషయం?" రాజు ఆటోదగ్గరకు నడిచి అడిగాడు. లోపలనుంచీ లిక్కర్ వాసన. తాగినట్టుగా ఉన్నారు. తూగుతున్నారు.

"వీడెవడు?" నుంచున్నవాడొకడు దగ్గరగా నడిచాడు. అతడు యూనివర్సిటీలోని స్టూడెంటే. శశిరేఖను వారంరోజులుగా వేధిస్తూ ఇవాళ ధైర్యంచేసి ఇంకో రౌడీఫ్రెండు ద్వారా వీళ్లను తీసుకొచ్చాడు. ఆమెను ఎత్తు




కుపోవాలనే పథకం. కానీ టార్జాన్ బాగా తా ‍ వుండి మనకు భయమెందుకు, ఇక్కడే కానియ్యి అని కూచున్నాడు ఆటోలో తిష్టవేసు కుని.

అసలు సమస్య టార్జాన్‌తో వచ్చింది ఆవిధంగా.

రాజు ఆ స్టూడెంటువైపుకు తిరిగాడు.

"రజనీ... నువ్వా?" అన్నాడు.

రజనీకాంత్ అతని పేరు. ఒకప్పుడు రాజుతో సన్నిహితంగా మెలిగినవాడే. అప్పటికే కొన్ని కొక్కిరిపనులు చేయడంతో వాళ్లు దూరంచేశారో, అతను కుదరదనుకుని వచ్చేశాడో గానీ వాళ్లకి వ్యతిరేకంగా కొన్నాళ్లు ప్రచారం చేసి ప్రస్తుతం ఈతరహా పనుల్లోకి దిగాడు.

"ఏంటిరా? వీడూ మనటైపేగా?" టార్జాన్ మత్తులో గొణిగాడు.

రాజుని చూడగానే రజనీకాంత్‌కు గొంతులో ఏదో ఇరుక్కున్నట్టు అయింది. అంతదాకా తెచ్చిపెట్టుకున్న ధైర్యం జారిపోయింది.

"సారీ... రాజూ మీవాళ్లనుకోలేదు. అన్నా ఆ అమ్మాయిని వదిలేయండి'' ఆటోలోకి వంగి అడిగాడు.

"పిరికి నాయాలా? మమ్మల్ని తేవట మెందుకు? ఇక్కడ గడగడ వణికి చావట మెందుకు? ఏసెయ్ ఆడ్ని'' చాకు తీసి రజనీ చేతిలో పెట్టాడు.

రజనీ గడగడ వణుకుతున్నాడు. అతడి పరిస్థితి ముందు నుయ్యీ వెనక గొయ్యీ లాగుంది. క్షణాల్లో పరిస్థితి తలకిందుల యింది.

ఈలోపు దాసు శశిరేఖను బస్టాప్‌లో కూచోపెట్టి ఆమె వస్తువులు అన్నీ చూసుకోమన్నాడు. అతడు ఆటోదగ్గరకొచ్చేసరికి టార్జాన్ ఆటో దిగి రాజుమీదకు పోతున్నాడు. చేతిలో బటన్‌నైఫ్.

క్షణాల్లో టార్జాన్ రోడ్డుమీద దొర్లుతున్నాడు. అతడి ఇద్దరు అనుచరులూ చావుకేకలు పెట్టారు. ఆటో డ్రైవర్ గుర్రం దూకినట్టు ఆటోని వదిలి రోడ్డుమీంచి చెట్లమధ్యకు దూకి పారిపోయాడు.



పరీక్షల రిజల్టు వచ్చేసిందని పుకారు. కెమికల్ డిపార్ట్‌మెంటులో ఎనౌన్స్ చేశారని శ్రీనివాస్ అనటంతో అదెవరెవరి నోళ్లలోకో పాకి... మెకానికల్ డిపార్ట్‌మెంట్ విద్యార్థులలో వేడి పుట్టించింది.

లంచ్‌టైంలో అనుకొని మధ్యాహ్నం ఫస్టవర్ సమయంలో అందరూ పొలోమని ఎగ్జామ్స్ డిపార్ట్‌మెంటుమీద పడ్డారు.

కిటికీల్లోంచే సంభాషణ.

"మీ క్లర్కుకిచ్చేశాంకదా!" అన్నాడు ఫస్టియర్స్ వ్యవహారం చూసే ఒక ఇన్‌ఛార్జి.

మళ్లీ డిపార్ట్‌మెంట్‌కి పరుగు.

ఆఫీసురూంలో హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ (హెచ్.ఓ.డీ)గారు నుంచొని ఉన్నారు. పేరు అనంత పద్మనాభన్. సీనియర్ ప్రొఫెసర్. ఆయన గుంపును చూసి...

"తొందరేం... అంత బాగా రాశారా ఎగ్జామ్స్. ఓ.కే. నేనే మీ మార్కులిస్టులు చూసి ఎవరికెన్ని వచ్చాయో చదువుతాను'' అన్నారు.

చాలామందికి పై ప్రాణాలు పైనే పోయాయి. ప్రవీణ్, విఎస్వీలాంటి కొందరు మాత్రం ధైర్యంగా మిగిలారు.

ఆయన అప్పుడే బాయ్ తెచ్చిన ఫైలు ఓపెన్ చేసి ఒక్కో పేరూ, వాళ్ల మార్కులూ, రాంకూ చదవటం ప్రారంభించాడు. అనుకున్నట్టే... వివిస్వీకి ఫస్టు, ప్రవీణ్‌కు సెకెండ్... మాధురికి థర్డ్.

శరత్ మొహం పాలిపోయింది. తన స్థానం... ఆరోజు... టార్జాన్ విసిరిన బాణం రిజల్ట్‌ని దెబ్బకొట్టింది. అయ్యో...

శరత్... థర్డ్.

ఫక్కున నవ్వారెవరో. తమ ఇద్దరికీ ఒకేరాంక్ వచ్చింది. అందుకూ ఆ నవ్వు. శరత్ కొంచెం తేరుకున్నాడు.

శశికి ఫోర్త్, కోటి ఫిఫ్త్.

"హూ ఈజ్ మిస్టర్ అర్జున్..." అడిగాడు హెడ్.

అందరూ ఎలర్ట్ అయి మొహమొహాలు చూసుకున్నారు.

"అతడికే రాంకు ఇవ్వాలో అర్థంకావట్లేదు. రెండు సబ్జెక్ట్సులో ఘోరం. ఒకటి సున్నా. ఇంకోటి రెండుమార్కులు. ఎవరా బ్లడీఫూల్" ఇంగ్లీష్‌లో అరిచాడు హెడ్.

ప్రవీణ్ చెప్పాడు ఇంగ్లీష్‌లో.

"కాలేజీకయితే రావటంలేదు. హాస్టల్‌లో ఉన్నాడనుకొంటాను. సరిగ్గా కన్పించటంలేదు''

"ఇంకోసారి చూసి ప్రిన్సిపాల్‌కి రిపోర్టిస్తాను. యూస్‌లెస్ ఫెలో"

క్లాస్‌రూంలోకొచ్చాక...

"పాపం అర్జున్..." అన్నాడు శరత్.

"బహుశా చదువు వదిలేస్తాడేమో'' అన్నాడు కోటి.

"అన్నట్టు నువ్వు బాగా చదివితే నాకన్నా మంచి రాంక్ వచ్చేది'' అన్నాడు శరత్ మనస్ఫూర్తిగా.

అతడి భుజం చరిచి, "చదవాలిగా'' అన్నాడు కోటి నవ్వుతూ.

ఆ రాత్రి రూంలో శ్రీనివాస్‌తో తన ర్యాంకు సంగతి మాట్లాడుతుండగా సీనియర్స్ గురించి సంభాషణ జరిగింది.

"వంశీ అని... కాలేజ్ ఫస్ట్ అనుకొంటున్నాను. భయంకరంగా చదువుతాడట" అన్నాడు శ్రీనివాస్.

"ఎవరూ?"

"ఇంకా తెలీదా?"

"విన్నానోసారి. ఇదివరకు మా ప్రొఫెసర్‌ని..."

"ఆc! వాడే. ఆడుకొంటాడు సబ్జెక్ట్సుతో. ఫండాలే. ఫండమెంటల్స్‌తో తెగ చదివి.. అన్నట్టు వాణ్ని యురేకా అంటారు విన్లేదా?"

"సరిగ్గా తెలీదు''

"ఓసారి ఏదో ఆలోచిస్తూ... బాత్ రూంలోంచి వాడి రూందాకా... ఓ వందగజాలు వచ్చేశాడట ఒంటిమీద నూలుపోగు లేకుండా. ఆలోచనలన్నీ చదువుమీదే. వాడయితే నీకు మంచి సలహా ఇస్తాడు. చూస్తున్నాగా నువ్వయితే... అల్లుకుపోతావు. వాడి సలహాలు అలాంటివి''

నగ్నంగా నడిచిపోతూ సబ్జెక్టు గురించి ఆలోచించే అతడు గుర్తొచ్చి నవ్వూ... అభిమానం ఒకేసారి కలిగాయి. ఇంతకుముందు ప్రవీణ్‌తో మాట్లాడుతుండగా చూశాడు కూడా. పల్చటి పొడవాటి ఆకారం. తగినట్టే కళ్లజోడూ.

"అవును... ఓసారి కలవాలి''

★ ★ ★

ఉన్నట్లుండి ఓరోజున శరత్ మాధురి ఇంటికెళ్లాడు ఆమెతో కలిసి. సాయంత్రం షాపింగ్‌లో తనక్కావలసిన మెషిన్‌టూల్ ఇంజనీరింగ్ బుక్‌కోసం సెకెండ్‌హాండ్ పుస్తకాల దుకాణాలముందు తచ్చాడుతుండగా, పక్కనుండి వెళ్తున్న ఆమె కనపడి కేకపెట్టబోయి, బాగోదని గబగబా నడిచి ఆమెని దాటి ఎదురుగా నుంచున్నాడు. ఆమె గమ







ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షల కు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

జూలై 'చతుర నవల 'ది యూనివర్సిటీ'

.................................................

సమీక్షకుని పేరు : .................................................

చిరునామా : .................................................

.................................................

.................................................

.................................................

నించి నవ్వింది.

"హలో" అంది.

'హలో' అనబోయిన శరత్ నోరు మూతబడింది ఆమె పక్కన ప్రశ్నార్థకంగా చూస్తున్న నలభై ఐదేళ్ళ స్త్రీని చూసి.

"మా అమ్మ" పరిచయం చేసింది.

"న... నమస్కారమండీ"

"ఈ బాబు పేరేంటి"

చెప్పాడు తనే.

"క్లాసుమేట్స్ అన్నమాట" అన్నదావిడ.

"మీరు మాట్లాడుకోండి. మధూ... నేనటు కంగన్‌హాల్‌లో ఉంటాను. రండి" అనేసి వెళ్లిపోయింది.

మండిపడుతుందేమో అనుకున్న శరత్ ఊపిరి పీల్చుకుని ఆమె విశాలత్వానికి గౌరవం కలిగి అలాగే నుంచున్నాడు.

"ఏంటి ఇటు వచ్చారు?"

చెప్పాడు.

"పనయిపోతే రండి మా ఇంటికి" అంది.

ఉలిక్కిపడి ఏం చెప్పాలాని ఆలోచిస్తుండగా "పర్లేదు. ఇబ్బందేమీ లేదు. భోజనం చేసి వెళ్దురుగాని"

బలవంతంమీద బెరుకుగానే వెళ్లాడు.

మాధురి ఇంట్లోవాళ్లని పరిచయం చేసింది. తన తమ్ముడూ, తాతయ్యా ఇద్దర్ని. తండ్రి వేరే పనిమీద ఊరుకెళ్లాడట.

రాత్రి ఎనిమిదింటికి భుక్తాయాసంతో, మాధురి అభిమానాన్నీ, వాళ్లమ్మగారి ఆప్యాయతనూ తల్చుకుంటూ బహుశా ఇది తనకి చాలా ముఖ్యమయిన రోజు కాబోలని తలుస్తూ బస్టాపు దగ్గర నుంచున్నాడు.

బస్సులు రావట్లేదు.

ఎనిమిదిన్నర. జనం పల్చబడుతున్నారు. నడవక తప్పదేమో అని ఆందోళన పడబోతుండగా అటు యూనివర్శిటీనుండి వస్తున్న ఆటో ఒకటి కీచుమని ఆగింది. అందులో అందాక అల్లరిచేస్తూ, అదిరిపడేట్టు నవ్వుతూ, ఊగిపోతున్న నలుగురు కుర్రాళ్లూ ఈల వేశారు.

అతడు అనుమానంగా చూశాడు.

అవతలగా ఒకావిడ ఎవరో తనలాగే బస్సుకోసం చూస్తోంది. ఇంత పబ్లిగ్గా గోల చేస్తున్నారంటే రోజులు ఎట్లా ఉన్నాయి అనుకొంటుండగా.

"హేయ్! శరత్" ఎవరో అరిచారు. ఆటోలోంచి ఓ తల బయటకు వచ్చింది. శ్రీనివాస్‌ది. తనకి తోడు రామ్మూర్తి, జయాకర్, ఇర్ఫాన్ఆలీ.

అరిచింది తన గురించేనన్నమాట. ఊపిరి పీల్చుకొని ఆటో దగ్గరకు వెళ్లాడు ఖంగారుగా. ఖంగారు వాళ్ళ గోల గురించి.

"రావోయ్" అన్నాడు శ్రీనివాస్.

"ఎక్కడికి?"

"చెప్తాగా" అన్నాడు కన్నుకొట్టి.

కొంత తెలుస్తూనే ఉంది.

"రాను"

"హేయ్. పదా! లెటస్ సెలబ్రేట్" అరిచాడు ఇర్ఫాన్.

"దేనికి?"

"చెప్తాగా. అక్కడ"

అందరూ కలిసి శరత్‌ను ఆటోలోకి లాక్కన్నారు. డ్రైవర్ వెనక్కితిరిగి ఆశ్చర్యంగా అన్నాడు. కొంత కోపమూ ఉంది ఆ గొంతులో

"సాబ్ ఇది లారీ కాదు"

"కాదు గనకే బీస్ రూపయా ఇస్తున్నామ్" ఇర్ఫాన్ గదిమాడు.

అతను తిట్టుకుంటూ స్టార్ట్ చేశాడు. లోపల చోటులేక శరత్ రామ్మూర్తి వొళ్లో కూచున్నాడు. గతుకులు వచ్చినప్పుడు రామ్మూర్తి అరుస్తున్నాడు. బరువుకి. "వద్దంటే విన్నారా?" అన్నాడు శరత్.

"ఈ బరువుకే ఇట్లయిపోతావురా మూర్తీ రేపు...?" అన్నాడు ఇర్ఫాన్ నోటితో దేన్నో సూచిస్తూ మూకాభినయంలా.

"ఆ బరువు వేరుకదరా"

నవ్వులు.

న్యూ వైట్‌హార్స్ బార్ అండ్ రెస్టారెంట్.

ఇరవైపైన ఇంకో రెండు ఇచ్చి లోపలికి దారితీశాడు ఇర్ఫాన్. జీవితంలో మొదటిసారిగా సినిమా తెరమీదకాక మామూలుగా నిజంగా ఒక బార్‌లోకి ప్రవేశిస్తున్నందుకు భయమూ, తెగింపూ ఒకేసారి కలిగి అందాకా తలొంచుకుని నడిచిన శరత్ శ్రీనివాస్‌తో అర్థం పర్థంలేని సంభాషణ ప్రారంభించేడు.

"టేకిట్ ఈజీ మాన్' అన్నాడు శ్రీనివాస్, అతడి నెర్వస్‌నెస్ గమనించి.

"అరె లైటుగా తీస్కోభాయ్" అన్నాడు ఇర్ఫాన్.

అందరూ ఓ పక్కనే ఉన్న టేబుల్ చుట్టూ కూచున్నారు సోఫాలమీద. ఎయిర్ కండిషనర్ సన్నటి శబ్దంతో ప్రసరిస్తున్న చల్లదనం. చుట్టూ టేబుల్స్‌మీద కష్టమర్ల కోసం చేరుతున్న పేరు తెలీని రంగురంగుల సీసాలు. కస్టమర్ల గుసగుసలు. ఖరీదయిన వాతావరణం... అదోలాంటి స్పిరిట్ వాసన.

బేరర్ వచ్చాడు.

"ఎవరిక్కావలసింది వాళ్లు చూసుకోండి" అని ఇర్ఫాన్ అనటంతో... అంతవరకూ శరత్ వినని నానారకాల ఇంగ్లీష్ పేర్లు మంత్రోచ్చాటనం కంటే పర్‌ఫెక్ట్‌గా ఉచ్చరించారు అందరూ.

శరత్ వంతొచ్చింది.

గొంతు పెగల్లేదు.

"ఓ క్వార్టరు..." అంటున్నాడు శ్రీనివాస్.

"వద్దొద్దు. ఓ థమ్సప్" అన్నాడు శరత్.

"లైక్ ఏ కిడ్..."

"పరువు తీసేశావుకదయ్యా"

కాసేపటికి గ్లాసులూ, సీసాలూ, సోడా ఇంకా చిప్స్ వచ్చాయి.

"సామాగ్రి చేరిందికదా! పూజ మొదలెడదామా?" అన్నాడు జయాకర్.

"క్లాప్స్ కొట్టండి" అన్నాడు రామ్మూర్తి.

"ఛీర్స్" గ్లాసులు చిట్లిన శబ్దంతోపాటు 'థం' అనే శబ్దం ఒకటి సన్నగా మొదలయ్యి ఆ బార్ మొత్తం వ్యాపించింది. అది క్రమంగా పెరుగుతూ పోయింది. గమ్మత్తుగా అందాకా ఓ మాదిరిగా వెలుగుతున్న లైట్లు క్రమంగా డిమ్ అయిపోయాయి. సన్నటి వెలుగులో హాలులో కేవలం మనుషుల ఆకారాల్ని మాత్రమే చూడగలిగేట్టుంది.

ఏదో మాయలోకంలో హఠాత్తుగా నిద్రలేచి కూచున్నట్టు... శరత్ ఆ బార్‌ని గమనిస్తున్నాడు.

ఆర్కెస్ట్రా బృందం వాద్యపరికరాల్ని శృతి చేస్తున్నారు. చీకటిగా అందాకా కన్పించని స్టేజిమీదకు ఒక్కసారిగా లైట్లు ఫోకస్ య్యాయి. చుక్కచుక్కలుగా వెలుతురు. జల్లెడలోంచి పడుతున్నట్టు ఆ వేదికను తడుపుతున్నది. అద్దప్పెంకులతికించిన గ్లోబు ఒకటి సీలింగ్‌నుండి వేలాడుతూ తిరుగుతోంది.

జరీతో ధగధగా మెరిసిపోయే చీరా జాకెట్టూ ధరించిన ఓ అమ్మాయి ప్రత్యక్షమయింది. మౌత్‌పీస్ పట్టుకొని.

"నమస్కార్'

"వెల్‌కమ్..."

మధురమయిన గొంతుతో హిందీ పాట అందుకొంది- ఆ మెరిసే అమ్మాయి. మేకప్‌తో ఆమె మొహం ఎర్రగా మెరుస్తోంది. సన్నని నవ్వుతో బార్‌లోని అన్ని టేబుల్స్‌నీ నెమ్మదిగానూ, ప్రశాంతంగాను చూసింది. ఆ నవ్వులో చిలిపిదనం ఉంది. ఆమె దృష్టి కొన్ని టేబుల్స్‌మీద కాసేపు ఆగింది. బహుశా ఆ కస్టమర్లు పాతవాళ్లు అయివుంటారు.

పాడుతూనే మధ్యలో చిన్నగా కాళ్లు ఊపుతూ అప్పుడప్పుడూ ప్రొవోకింగ్‌గా కదు




ల్తోంది. ముందు వరసలో కూర్చున్న పాతకాపులు కొంతమంది జేబుల్లోంచి నోట్లు తీస్తున్నారు. ఒకళ్లిద్దరు చేతులు చాపారు. ఆమె ముందుకు వంగి అందుకొంటుంటే ఆ నోట్లను వెనక్కి లాగుతున్నారు. కాసేపు ఆ ఆట అయ్యాక ఆమె మళ్ళీ డాన్స్ చేస్తోంది. ఆ నోట్లన్నీ ఓ బాక్స్‌లో వేస్తోంది.

ముందు వరుసలో ఓ చివరగా అప్పటికే ఐదో రౌండ్ ముగిసిన ఓ బట్టతల నడివయస్కుడు నుంచొని మరీ శరీరం ఊపుతున్నాడు. అది డాన్స్ అనే అనుకోవాలి. కొంతమంది నవ్వుకొంటున్నారు.

"మరి కొంతసేపటికి వాడిపని ఏమవుతుందో?" అన్నాడు జయాకర్.

"బయటకు ఈడ్వాల్సి వస్తుంది కాబోలు'' రామ్మూర్తి.

పాట ముగిసింది.

"థాంక్‌యూ... యూ టూ'' ప్రతిధ్వనించింది స్పీకర్.

తర్వాత ఇంకో అమ్మాయి వచ్చింది. శరత్ నిటారుగా కూర్చున్నాడు. ఆ అమ్మాయి... వయసు పధ్నాలుగు ఉంటుందేమో. గుండ్రని చుక్కలాంటి మొహం. తీరైన కళ్లూ, పెదవులూ చూసి మోహించనివాడు... మరీ, మానవజాతిలో మిస్ యాంత్రోప్ అనుకోవాలి. కనుక ముచ్చట పడ్డాడతడు.

ఎందుకో అతనికి అలాంటి అమ్మాయిని చూసి ఏ వికారమూ కల్గించుకోలేకపోయాడు. అయితే ఆ అమ్మాయి పాట పాడటం మొదలుపెట్టాక ఉలిక్కిపడ్డాడు.

ఆ గొంతు చాలా పచ్చిగా ఉంది. సగం కల్సిన మగగొంతు ఆమె పాడుతున్న పాటకు మరింత వేడి కల్గించుతోంది. ఆ వేడిలో, కైపులో అందరూ ఆ చుక్కలాంటి మొహం కల్గిన ఆ చిన్నదాన్ని చూసి వేగిపోతుండగా శరత్ ఒక్కడూ తలొంచుకుని అందాకా తను ముట్టని గ్లాసు ఒకటి ఎత్తి గడగడా తాగేశాడు. భగ్గున మంట చల్లారి కడుపులో సన్నసెగలో, కుంపటి ఒకటి పెట్టినట్టు మెల్లమెల్లగా అతన్ని వేడి చేయసాగింది. ఆ గ్లాసులోని ద్రావకంలోని అంతర్లీన లావా ప్రవాహం.

"ఉరేయ్... చూడ్రా'' అన్నాడు రామ్మూర్తి.

అందరూ వేడిగా చూశారు... ఆ పిల్లని కాదు శరత్‌ని.

"వెరీగుడ్'' మెచ్చుకున్నాడు శ్రీనివాస్.

"హ్రే! రా కొట్టేశాడు'' రామ్మూర్తి అరిచాడు.

"ఏంటీ'' అన్నాడు జయాకర్. అతడికి కిక్కు దిగిపోయింది.

"ముయ్యండి'' శరత్ ఇంకో గ్లాసు అందుకున్నాడు.

స్టేజీమీద చిన్నది "తు మేరా జానూ హై'' అని రెండు కుర్చీల నాక్రమించగలిగే ఒకే కుర్చీలో కూర్చొన్న, ఎర్రటి పీపాలాంటి శరీరాన్ని మోస్తున్న ఓ సేటుని చూసి 'కన్నుగీటి చెంగున గెంతసాగింది. ఆ సేటు చిన్న మూటలాంటి పర్సుని తీసి ఓ నోటులాగి బేరర్‌కిచ్చాడు. బేరర్ ఆ చిన్నదానికి అందించాడు. చిన్నది గాల్లోకి ఓ 'ఫ్లయింగ్ కిస్'ని వదిలి పాట ముగించింది. ఆ నోటు బాక్సులోకి చేరింది.

అందాకా లేచి బల్లమీద దరువేస్తున్న ఆ బట్టతల నడివయస్కుడు కుర్చీల మధ్యగా గెంతటం మొదలెట్టాడు. అందాకా అతను ఒక్క నోటూ విదిలించకపోవటంచేత 'వీడు ఉత్తనే న్యూసెన్స్ చేస్తున్నాడు' అన్న ఉద్దేశంతో బార్ సిబ్బంది అతన్ని పట్టుకు ఆపారు. అతడు విదిలించుకున్నాడు.

ముందే అందుకు సిద్ధపడి ఉండటంవలన నలుగురు మనుషులు నాలుగువైపులా అతన్ని చుట్టుముట్టి అవతలికి ఈడ్చారు. ఒకడు గట్టిగా తోయటంతో అతడు దబ్బున పడ్డాడు బల్లల మధ్య. కళ్ళజోడెటో ఎగిరిపోయింది. అతడు నేలమీద అదే కార్పెట్‌మీద పాకుతు

న్నాడు.

"పాపం" అన్నవాడు లేడు శరత్ తప్ప.

అందాకా తనని సుఖపెట్టిన ఆ సోఫా, ఏసీ, కార్పెట్, ఆ బేరర్లూ, వాళ్ల చిరునవ్వులూ సరసర పాకే పాముపిల్లల్లా అగుపించి శరత్ ముడుచుకుపోయాడు బెదురుగా.

"లైటుగా తీస్కో'' మూలిగాడు ఇర్ఫాన్.

ఈసారి ఓ ఎర్రటి గుజరాతీ సింగర్ మైక్ ముందుకొచ్చాడు. అతని మొహం హిందీ సినిమాల్లో ప్రిన్స్ రాజ్‌కుమార్‌ని పోలివుంది.

అతడు 'ప్యాసా' సినిమాలోని ఓ విషాదగీతాన్ని ఎత్తుకున్నాడు. అతని గొంతు మధురంగా ఉంది. పాట విషాదంగా ఉంది. వింటున్న వాళ్ళకది భారంగా ఉంది.

పాట ముగుస్తుండగా అందాకా తలొంచుకుని సీసా ఖాళీ చేస్తున్న జయాకర్ నిద్రలో నడిచేవాడిలా లేచి నిలబడ్డాడు. తడుముకొంటూ స్టేజీ దగ్గరకు పోయి పైజేబులోంచి వంద కాగితం తీసి ఇచ్చి "ఓ... చంద్రీ..." అని అరిచి కూలిపోయాడు. శ్రీనివాస్, శరత్ పరుగున వెళ్ళి అతడిని లాక్కొచ్చారు మోసుకుంటూ. అతడు "చంద్రీ డార్లింగ్..." అని మూలుగుతున్నాడు.

సోఫాలో కూర్చున్న తర్వాత భోరుమని ఏడవలేదు కానీ ముక్కుతూ... కర్చీఫ్‌తో ముక్కు తుడుచుకుంటూ దుఃఖించాడు.

"నోర్మయ్'' అంటున్నాడు ఇర్ఫాన్.

పావుగంట తర్వాత కూడా అతడలాగే వెక్కుతుండటంతో ఇర్ఫాన్‌కి కోపమొచ్చింది. లేచి జయాకర్ మొహంమీదకి చేయి విసరబోయాడు. "ఒరే" ఆపబోయాడు రామ్మూర్తి.

అంతలోనే పక్క టేబుల్‌నుండి ఒక నడివయస్కుడు చరచరా వచ్చి ఇర్ఫాన్‌ని సోఫా మీదకు తోశాడు.

"వీడెవడు'' అని ఆశ్చర్యపోయారు అంతా.

"ప్రేమంటే తెలుసా నీకు?" ఇర్ఫాన్‌ని ఛీత్కరించి కొట్టి అతడు జయాకర్ పక్కన కూర్చుని అతడి వీపుతట్టి మెల్లగా జోలపాట పాడసాగేడు.

"చంద్రీ'' రాగం తీశాడు జయాకర్.

"డోంట్ వర్రీ ఫ్రెండ్. నువ్వు చంద్రిని ప్రేమించి భంగపడ్డావన్నమాట. అసలు ప్రేమంటే..." అతడు తన్మయంగా ప్రేమతత్వాన్ని వివరిస్తున్నాడు.

"భగ్న ప్రేమికుడు కాబోలు'' మూలిగాడు ఇర్ఫాన్.

ఇంతలో పక్క టేబుల్ వాళ్లు వచ్చి లాక్కుపోయారు- ఆ నడివయస్కుడిని.

"అబ్బ మూడ్ పాడయింది'' చిరాకుపడ్డాడు రామ్మూర్తి.

"అసలూ... ఆ పాటతో వచ్చింది చావు''

"ప్యాసా''

"చంద్రీ..."

"నోర్మయ్''

ఇంకో అరగంటకి ఐదుగురూ బయటకొచ్చారు.

"మీరు పదండి'' అని ఆటో పిలిచి ఎక్కేశారు ఇర్ఫాన్, రామ్మూర్తి. జయాకర్ వెంటపడ్డాడు. కానీ శ్రీనివాస్ చొక్కా పట్టుకు ఆపాడు. ముగ్గురూ కాళ్ళీడ్చుకుంటూ కొంత దూరం నడిచి ఆటో ఎక్కారు.

"అవునూ ఇర్ఫాన్ పార్టీ ఎందుకిచ్చినట్టు?" శరత్ అడిగాడు.

"ఇంకా తెలీలేదా? వాడి మ్యారేజి ఎంగేజ్‌మెంట్. పూలుపళ్లయినయి''

"పూలూ, పళ్ళా?"

"అబ్బ మీ ఏరియా వాళ్ళకర్థమయి చావదు. నిశ్చితార్థం"

"దానికి మందుపార్టీనా?" శరత్ నోరు తెరుచుకుంది.

జయాకర్ అప్పుడప్పుడూ మూలుగుతూనే ఉన్నాడింకా.




"మరి వీళ్లెటు పోయినట్టు?"

"తెలీలేదా? మూడ్ వచ్చింది కదా సెలబ్రేట్ చేస్కోటానికి"

"మూడ్?"

"ఊఁ! ఆ పధ్నాలుగేళ్ల పోరి... విన్నావుగా ఆ గొంతు. పెనంమీద కోడిగుడ్డు కొట్టినట్టు... బుసబుసా పొంగుతుంది..."

"ఏమిటి?"

"కోరికకాదు వేడి"

అర్థమయింది.. వేడి దించుకోటానికి పోయారన్నమాట. పెళ్లి నిశ్చితార్థం ఈ రకంగా పంచుకోటం... ఇర్ఫాన్.. ఆ అమ్మాయి గొంతు, పాట, ఆటో... ఈపాటికి ఇద్దరూ... కాదు ఒక్కొక్కరే... ఏమో.. అసలె లాగ.

ఎందుకో ఇర్ఫాన్ అంటే భయం కలిగింది శరత్‌కి. అతడూ అతడి జీవిత విధానం.. డబ్బంటే లెక్కలేకపోవటం... బార్‌లో ధారాళంగా వెదజల్లటం... ముఖ్యంగా అతనిలో ఏ సంఘర్షణాలేదు.

అవును, ఏ సంఘర్షణాలేదు.

ఏ సంకోచమూ లేదు.

తన జీవితమంతా ప్రయత్నించినా అంత ధైర్యంగా అంత ఆత్మవిశ్వాసంతో అతడు చేసే పనుల్లో ఒక్కటయినా చేయగలుగుతాడా?

ఊఁ హూఁ!

ఛస్తే చేయలేడు.

ఎందుకని? ఎందుకు తను చేయలేడు?

ఆ రాత్రి అతడి జీవితంలో మరొక నిద్రలేని రాత్రి అయింది. ఈ గొడవలన్నీ సరే... తన చదువు సంగతి ఏమిటి?

  



శరత్ సెకెండ్ ఫ్లోర్‌లో ఒక సీనియర్ నుంచి నోట్సు తీసుకొని మెట్లు దిగుతుండగా వంశీకృష్ణ తలొంచుకొని మెట్లెక్కుతూ కన్పించాడు. అతడి చేతులో కొన్ని జిరాక్సు కాగితాలూ, రెండు లావాటి బైండు పుస్తకాలూ ఉన్నాయి. పల్చని తెల్లని అతడి పొడవాటి శరీరం తెల్ల పైజామా, లాల్చీల్లో మరింత తెల్లగా ఉంది. మెట్లెక్కిన ఆయాసంతో అతడు నిట్టూర్చేందుకు రెయిలింగ్‌ను ఆనుకుని తన భూతద్దాల కళ్లజోడులోంచి శరత్‌ను పరిశీలనగా చూసేడు.

"హలో" శరత్తే పలకరించేడు.

"హలో... హలో.. గుడ్ మార్నింగ్" ఖంగారుపడ్డాడతడు కొంచెం అయోమయంగా.

"నేను కింద ఫస్ట్ ఫ్లోర్‌లో..." గుర్తు చేసేడు శరత్.

"అవునవును... శ్రీనివాస్ రూం" గుర్తుపట్టేడు.

ఎలాగూ తనని కలవాలనే అనుకుంటున్నాడు గనక అదేదో ఇప్పుడే కానిద్దామని...

"పదండి మీ రూందాకా వస్తా" అని అతడి చేతిలోంచి కొన్ని పుస్తకాలను అందుకున్నాడు శరత్.

"ఎందుకూ శ్రమ" మొహమాటంగా అన్నాడు వంశీకృష్ణ.

రూంకి చేరాక అతడు ఖంగారుగా జేబులు తడుముకున్నాడు. కళ్లజోడు తీసి తుడుచుకుని దీర్ఘంగా శూన్యంలోకి చూశాడు.

"ఏంటిరా యురేకా! తాళం చెవా?" అడిగాడు ఎదురు రూంలో కుర్చీమీద కూచొని కాళ్లు విలాసంగా టేబుల్ మీదాన్చి కులాసాగా నవ్వుకొంటున్న ప్రవీణ్. వాళ్లిద్దరూ ఏదో దూరపు బంధువులు.

"అవున్రా ఎక్కడ పెట్టానా అని?"

"నీ బొంద యురేకా అన్పించావు. అసలు నువ్వు తాళం వేయకుండా అదేపోత పోయావుగా"

"ఆc!... అవును వేయలేదు కదూ!" అతడు నాలిక కొరుక్కుని డోర్‌వైపుకు తిరిగాడు.

ఆశ్చర్యకరంగా తలుపుకు తాళం వేళ్లాడుతోంది.

ఉస్సురని "ఒరే చంపకురా ప్రవీణ్‌బాబూ ఇచ్చెయ్‌రా!" బతిమాలసాగేడు వంశీ.

"తీసుకో.. ఏడవకు... తలుపులు బార్లా తెరిచి నువ్వు లైబ్రరీకి పోయావా? నీ మేట్ అదే రూంమేట్ ఊరికిపోయాడుకదా! ఇదేంట్రా అని చూస్తే ఎవడూలేడు. అసలే కక్కుర్తి నాయాళ్లు రెండు నోట్సులు తీసుకుపోయినా నువ్వు సూయిసైడ్ చేస్కుంటావని నేనే దయతలిచి..." కీస్ విసిరాడు ప్రవీణ్.

"థాంక్యూ... తాళం వేసినందుకు కాదు. నా బుక్స్ కాపాడినందుకు" లోపలకు ప్రవేశించారిద్దరూ. ప్రవీణ్ అనుమానంగా చూసేడు శరత్‌ని.

ఆత్రుతగా ఆ రూంని పరిశీలించాడు శరత్.

వంశీకృష్ణ టేబుల్‌కి ఎదురుగా గోడకి టైంటేబుల్ అంటించి ఉంది. టేబుల్‌మీద నీట్‌గా సర్ది ఉన్న టెక్స్ట్‌బుక్స్. వైట్‌పేపర్స్ చుట్ట ఒకటీ. రంగురంగుల స్కెచ్‌లూ. కార్డ్‌బోర్డ్‌తో చేసిన పాడ్ ఒకటీ, జిరాక్స్ కాపీల బండిల్స్ కొన్నీ... అవతలగా ఒక ఇంగ్లీష్ డైరీ.

'సరిగ్గా ఒక స్కాలర్‌కు ఉండే లక్షణాలు ఇవి' అనుకున్నాడు శరత్.

"ఊc! చెప్పండి" అడిగాడు వంశీ తన బెడ్‌మీద కూచుంటూ శరత్‌కు తన చైర్ ఆఫర్ చేసి.

"అదీ..." కళవెళపడ్డాడు శరత్.

"డోంట్ హెసిటేట్... పర్లేదు చెప్పండి. ఏమయినా సహాయం కావాలా?"

ధైర్యం తెచ్చుకున్నాడు శరత్. ఇప్పుడు చెప్పకపోతే ఇంక ఎన్నటికీ చెప్పలేడు.

"ఓ సహాయం గురించి మిమ్మల్ని అడు





గుదామని... మా బ్యాచ్‌లో చాలామందికి మీరు తెలుసు. అంటే మీ ఇంటిలిజెన్స్ గురించి, అప్పుడప్పుడు మీ గురించే చర్చలు కూడా జరుగుతుంటాయి. సబ్జెక్ట్‌లో మీకున్న డెప్త్ గురించి, నేను... కొద్దిగా మిమ్మల్ని ఒక విషయంలో గైడెన్స్... మీ సలహా కావాలి''

"అడగండి... నా నుంచి ఏం ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారు. చెప్పానుగా ఫ్రాంక్‌గా అడిగెయ్యండి. నాకు సాధ్యమయినంత నేను హెల్ప్ చేస్తాను. చేయలేకపోతే చెప్తాను'' ధైర్యమిచ్చాడు వంశీ.

"నాకు ఈ ఇంజనీరింగ్‌లోకి వచ్చాక చాలా గందరగోళంగా ఉందండీ. ఎలా చదవాలో ఏం చదవాలో అంతా కన్‌ఫ్యూజన్..."

"ఆగండి... మీరు స్మోక్ చేస్తారా?" జేబులోంచి సిగరెట్టు పాకెట్ తీశాడు వంశీ.

"లేదు... లేదు..." తబ్బిబ్బయ్యాడు శరత్... స్కాలర్స్ కూడా సిగరెట్లు తాగుతారన్న మాట ఆశ్చర్యంగా అనుకుంటూ.

"ఓకే విత్ యువర్ పర్మిషన్..." సిగరెట్టు వెలిగించి పొగ గాల్లోకి వదిలాడు. పొగలోకి దీర్ఘంగా చూసి...

"అన్నట్టు కన్‌ఫ్యూజన్ అన్నారు. ఏ సబ్జెక్టుల్లో'' అడిగాడు.

చెప్పాడు శరత్.

"ఊс! మీరు ఇంటర్ ఎక్కడ చదివారు? ఎంత పర్సంటేజి వచ్చింది? మీ ఫ్యామిలీ బ్యాక్‌గ్రవుండ్ ఏమిటి?" ప్రశ్నల వర్షం కురిసింది.

కొంచెం కొంచెం బెరుకుపోయి ఫ్రీగా మాట్లాడసాగేడు శరత్. మరికొన్ని ప్రశ్నలూ, శరత్ జవాబులూ అయ్యాయి.

"ఊс! ఇప్పుడర్థమయింది మీ సమస్య చెప్తాను... మీరేం ఫీలవ్వకపోతే ఒకమాట"

"చెప్పండి వంశీ... మీరేదయినా అన్నా నేను బాధపడను. మీరంటే అంత గౌరవం"

"మీరసలు ఈ కోర్స్‌లోకి ఎందుకొచ్చారు. యూ ఆర్ అన్‌ఫిట్. ఈ ఇంజనీరింగ్‌కి సంబంధించిన కొన్ని విషయాల్లో మీకు కనీసం అర్హత కూడా లేదు'' కరుగ్గా అన్నాడు వంశీ.

శరత్ మొహం నల్లబడింది. లోపల ముల్లు గుచ్చుకున్న బాధ.

"అదుగో మీరు హర్ట్ అవుతున్నారు. నేను ముందే చెప్పాను'' అదోలా చూస్తూ అన్నాడు వంశీ.

కొంచెం తేరుకుని "లేదు... మీరు చెప్పదల్చుకుంది కానీయండి'' అర్థించాడతడు.

"నా అంచనా ప్రకారం మీకు సైన్స్‌కంటే లేదా ఇంజనీరింగ్‌కంటే వేరే వాటిల్లో ఇంట్రెస్ట్ ఎక్కువ. మీరన్నట్టు మీ ఎక్స్‌ట్రా కరిక్యులర్ పనులన్నీ సాహిత్యం చుట్టూ తిరుగుతున్నాయి. ఇంటర్ అయ్యాక మీరీ లైన్లోకొచ్చి తప్పు చేశారు. బహుశా పేరెంట్స్ ఒత్తిడివలన. వాళ్ల ఆశలూ పేరాశలూ. మనల్ని ఇదిగో ఇలాగే శాండ్‌విచ్ చేస్తాయి. ఎందుకంటున్నానంటే నేనూ మీలాగే అమాయకంగా... పోనీ... అజ్ఞానంగానే ఈ కోర్స్‌లోకి వచ్చిపడ్డాను. మీలాగే స్ట్రగులయ్యాను. అదొక నరకం అన్నమాట. ఈ బల్బులూ, నట్లూ, స్ట్రెస్‌లూ, థర్మోడైనమిక్ సైకిల్సూ ఏమిటో? మనం కలలుగనే సాహిత్య సౌరభాలు ఏమిటో? పొంతన ఉండదు.

ఎట్‌లాస్ట్ ఒక నెల రోజులు అన్నీ పక్కన పడేసి కామ్‌గా ఆలోచించాను. తెలివైనవాడు తనకిష్టమైన రంగాన్ని ఎంచుకుంటాడు. అలా కుదరనప్పుడు ఏం చేయాలి మనం? ఎంచుకున్న రంగాన్ని.. ఫీల్డుని ఇష్టపడాలి. షా అన్నాడనుకుంటాను ఇలా సో... క్రమంగా ఈ సబ్జెక్టులోకి నేను మునిగానో అది నాలో మునిగిందో... ఇదుగో ఇలా తేలాను.

ఒక భవనం కట్టాలంటే దానికి సంబంధించిన ప్రతి ఇటుకా, ప్రతి ఇసక రేణువూ, ప్రతి నీటిచుక్కా సరిగ్గా ఉండాలి. సవ్యంగా వినియోగించాలి. ఎలాగో కట్టేశాం

అన్పించుకోవచ్చుగానీ అది ఓటి కుండలా పగిలిపోతుంది. అంటే మనం విజయం సాధించాలంటే సరిగ్గా అదేరకంగా మనం కృషి చేయాల్సి ఉందన్నమాట"

శరత్ ఎడ్మిరేషన్‌తో వింటున్నాడు. ఇన్నాళ్ల కి ఇన్నేళ్లకి తనలో గూడుకట్టుకు పోతున్న నిరాశా నిస్పృహలు అతడి మాటలతో తుడిచిపెట్టుకు పోయాయి. తన పీకలపై వేళ్లాడే కత్తిని అతడిచ్చిన ఉత్తేజంతో తుత్తునియలు చేయగలనన్న ఆత్మవిశ్వాసం క్రమంగా తనలో నెలకొంటోందన్న విషయం అతడు గమనించాడు.

ఈ బుర్ర ఉంది చూశావ్. అనవసరమయిన పాయింటు ఒక్కటి ఎక్కించావనుకో... అవసరమయినవి పది జారిపోతాయ్. అందుకే నీ లైఫ్ మొత్తం నీ ఎయిమ్‌వైపు తిప్పాలి. అవసరమయితే ఫ్యామిలీ రిలేషన్స్‌ని కూడా పక్కన పెట్టండి ఒకటి రెండేళ్లు. అర్థమయిందా?"

శరత్ ఎంతో ఉద్వేగంతో తల ఊపాడు.

"మరి... ఇంక నాకు టైమవుతోంది'' అన్నాడు వంశీ. శరత్ చటుక్కున లేచి నిలబడ్డాడు.

"సారీ... మీ టైం తీసుకున్నాను చాలా''

"ఇట్స్ ఓకే! గుర్తుంచుకోండి నేను చెప్పింది. నేను మళ్లీ నెక్స్ట్ మిడ్‌దాకా ఎవర్నీ కలవను'' ఇప్పట్లో రాకు అని సూచిస్తూ అన్నాడు.

"అట్లనే... థాంక్సండీ..."

★ ★ ★

రహస్యంగా ఉత్తరం చదూకొంటున్న శ్రీనివాస్ ఉలిక్కిపడ్డాడు.

తలుపు తెరుచుకుని వచ్చింది శరత్ అని గమనించి స్థిమితపడి 'గడీ పెట్టు గురూ' అని సీరియస్‌గా ఉత్తరం చదివి సంతోషంగా కుర్చీలో జారగిలబడి కాళ్లు గోడకి తన్నిపెట్టి కళ్లు మూసుకున్నాడు. అతని ఒడిలో ఒక అందమైన గులాబీరంగు కాగితం నాలుగు మడతలుగా ఉంది. పరీక్షగా చూస్తే అది ఒట్టి కాగితం మాత్రమే కాదు. దానిపై కల్వర్టు మీదనుంచీ కాళ్లు వేలాడేసి కూర్చున్న యువతీయువకుల బొమ్మ కనీకనపడనట్లు ముద్రితమై ఉంది. అలాంటి లెటర్‌లు సాధారణంగా ప్రేమికులనుండే వస్తాయని కొద్దిగా తెలుసు గనక శరత్ అతడిని ఆశ్చర్యంగానూ, ఆసక్తిగానూ చూసేడు.

"చెప్పు గురూ'' ఖుషీగా అడిగాడు శ్రీనివాస్ శరత్ తననే చూడటం గమనించి.

"నువ్వే చెప్పాలి. ఏదో శుభవార్తలా ఉంది'' తలతో సూచించాడు శరత్ అతడి వొళ్లోని కాగితాన్ని.

"ఊc! కొన్ని ఉంటాయి'' చాలా మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూ అన్నాడిలా...

"కొన్ని చెప్పరానివి. ఉదాహరణకి లవ్‌లెటర్స్. అంటే ఇది అదని కాదు. ఊరికే చెప్తున్నా. అయినా నీలాంటి మంచి బాలుడికి కొన్ని చెప్పకూడదు. అంత క్యూరియాసిటీ పనికిరాదు మైడియర్ లిటిల్ బుద్ధా''

"అడిగింది అది లవ్‌లెటరా? కాదా? అని కాదు. ఏదయినా శుభవార్తయితే చెప్పు. లేకుంటే మాను. నీ ఇష్టం" అంత ఆసక్తి లేనట్లు అన్నాడు శరత్.

"ఇది లవ్‌లెటరే గురూ'' రహస్యం బట్టబయలు చేస్తున్నట్టు లోగొంతుకతో అన్నాడు.

"ఊc! ఎవరు?"

"గీత... గీతాంజలి''

అదిరిపడ్డాడు శరత్.

"ఎవరూ'' నమ్మశక్యం కాక అడిగాడు.

"చూశావా... నమ్మలేదు. మనమంటే..." గప్పాలు మొదలయ్యాయి.

"ఊc! ఏమంటుంది గీత... అంజలి''

"అది సీక్రెట్, కేవలం నాకే. ఫర్ యువర్ ఐస్ ఓన్లీ అని కాషన్ ఇచ్చింది కూడా''




'ఓర్నీపిల్ల... అప్పుడే అంత ప్రొఫెషన లిజం కూడానా? ఏమీ ఎరగనట్టు బుద్ధి మంతురాల్లా తలొంచుకుపోతూ క్రీగంట చూసి సిగ్గుల మొగ్గయ్యే ఆ అమ్మాయి ప్రేమలో పడటం... లెటర్ రాయటం... ఎంత చిత్రం. మరీ చిత్రమేమంటే ఆ లెటర్ ఈ శ్రీనివాస్‌గాడికి రాయటం.

"మరి నువ్వేం రాస్తున్నావు రిప్లయ్'' ఆ అమ్మాయిమీద జాలిపడుతూ అడిగాడు.

"అదేనోయ్ ఆలోచిస్తా. అట్టిట్ట రాయడు ఈ శ్రీనివాస్. కేవలం యునీక్. యునీక్ స్టయిల్'

"మరి కాసేపు నిన్నొదిలేస్తా ఆలోచించు'' అని అతడి పీడ వదిలించుకున్న ఆనందంతో తన బట్టలు మార్చుకుని మొహం కడుక్కువచ్చి ఫ్లూయిడ్ మెకానిక్స్ పుస్తకం తెరిచాడు.

క్రమంగా హాస్టల్‌లోని శబ్దాలు ఆగిపోయాయి. లైట్లాపి చాలామంది నిదర్లకి పడిన ట్టున్నారు కిటికీ అవతల చీకటి చిక్కన యింది.

తలెత్తి చూసేసరికి పన్నెండు దాటుతోంది.

ఉదయాన్నే స్నానంకోసం నిలబడాల్సిన క్యూ గుర్తొచ్చి త్వరగా లేవాలి గనక ఇప్పటిక యినా పడుకుందామని పుస్తకం మూసిన శరత్ శ్రీనివాస్‌ని చూసి ఉలిక్కిపడ్డాడు.

బల్లమీద తలపెట్టి చేతులు వేలాడేసి నిద్ర పోతున్నాడతడు. ఓ చేతిలోంచి అంతకు ముందే జారిపడిన కలం నేలమీద దొర్లు తోంది. దానిపక్కనే చిన్న గుట్టలా పోగుబడిన కాగితాలు.

లేపి మంచం మీదకు నడిపిద్దామని అత డిని సమీపించాడు శరత్.

శ్రీనివాస్ తల దగ్గర మడతలు పడిన గులాబీ కాగితం. దాని పక్కన అతడు రాసిన రిప్లయి కాబోలు అదీ ఉంది.

రెండు నిముషాలు అలాగే నిలబడి, చిన్న ప్పట్నించీ అలవడిన సంస్కారాన్ని పక్కన బెట్టి ఈ అమర ప్రేమికులిద్దరూ ఏం రాసుకు న్నారో అన్న జిజ్ఞాసతో మాత్రమే కాక అసలు ప్రేమికులు ఏం రాసుకుంటారన్నది మొదటి సారిగా తెలుసుకుంటున్న ఉద్విగ్నతతో ఆ పింక్ లెటర్‌ని అందుకున్నాడు అతడు.

వణికే చేతుల్తో దాన్ని తెరిచి క్రీగంట శ్రీనివాస్‌ని గమనించి అందులోని ముత్యాల వరసల్లాంటి అక్షరాలను త్వరగానూ ఖంగా రుగానూ చదివాడు.

బుర్ర ఖాళీ అయినట్లుగా అయోమయం.

ఈసారి నిదానంగా చదివాడు.

"ప్రియమైన శ్రీనివాస్‌కి... నేను వరండాలో నడిచి వెళ్లేప్పుడూ, లాబ్‌లో నిలిచి ప్రయోగాలు చేసేప్పుడూ నువ్వు నన్నే చూడటం గమనించాను. నీ కళ్లల్లోని ఆరాధన... నీ జాలి చూపులూ నన్ను కరిగించాయి. నిద్రలోకూడా నువ్వే వెంటాడుతున్నావు''

ఆ తర్వాత విషయం చదివి నోరు తెరిచాడు శరత్.

"నువ్వు నన్ను ఎలా ఆరాధిస్తున్నావు? చెలిగానా? చెల్లిగానా? ఏ సంగతీ తెలియజేయి. నన్ను నీ ప్రేయసిగా భావిస్తే రేపు నల్లషర్టు వేసుకుని క్లాసుకిరా. చెల్లిగా ప్రేమిస్తే నీలం షర్టుతో రాగలవు. మర్చిపోవుకదా! వేయి కళ్లతో ఎదురుచూసే...

నీ... (ఇది నువ్వే నిర్ణయించాలి)

గీత

వర్ణనాతీతమయిన భావాలు కలగాపులగమయి కొంత వింతగానూ కొంత హేయంగానూ ఆ లెటర్‌ని చూసేడు. సూక్ష్మక్రిమిని మైక్రోస్కోపులో చూసి దాచిపెట్టినట్టు ఆ లెటర్‌ని మడతపెట్టి యథా ప్రకారం శ్రీనివాస్ తల దగ్గర ఉంచాడు.

అయితే రేపు మనవాడి షర్టుని చూసి వీడికి ప్రేయసిగా ఉండాలా లేక చెల్లిగా సోదరిగా ఆప్యాయతనందించాలా అన్నది నిర్ణయించుకొంటుందన్న మాట... ఒక్క నిముషంలో కాదు... ఒక్క చూపుతో.



'మరి వీడేం రాశాడో ఏ షర్టు వేసుకోబోతున్నాడో అనుకుని రెండో లెటర్ తీసి అదోరకమయిన గగుర్పాటు కలిగి ఎలాగూ రేపు చూస్తాను కదా షర్టు రంగు అన్న ఉద్దేశ్యంతో నిశ్శబ్దంగా వెనుతిరిగి లైటార్పి మరి పది నిముషాల్లో నిద్రలోకి పడ్డాడు శరత్.

అతడుగానీ ఆ లెటర్ చదివి ఉంటే ఏం జరిగేదన్నది కేవలం భగవంతుడికే తెలియాలి.

ఎంచేతనంటే... శ్రీనివాస్ రాసిన ఆ ఉత్తరంలో ఇలా ఉంది.

"నళినీ...

నిన్నెలా సంభోదించాలో అర్థం కావట్లేదు. ఎన్ని ఉత్తరాలు రాసినా నువ్వు ఉలకవు పలకవు. ఇక నేను ఎదురు చూడలేను. నా ఓపిక హరించుకుపోయింది. రేపు సాయంత్రంకల్లా నీ నుండి గ్రీన్‌సిగ్నల్ రాకపోతే నేను ఇంకొకరికి గ్రీన్ సిగ్నల్ ఇస్తాను. నేనే షర్టు వేసుకోవాలో నువ్వు నిర్ణయించాలి. (ఈ షర్ట్‌ల గొడవ నీకర్థం కాదు. నువ్వు గ్రీన్ శారీ కట్టుకొస్తే ముందుముందు... కాదు.. మొదటగా నీకే చెప్తాను. కట్టుకు రాకపోతే ఇక మనిద్దరికీ చెల్లు కనక నీకు చెప్పను) త్వరగా నిర్ణయించుకో. ఎందుకంటే ఇప్పుడు నీ నిర్ణయం మీద నేనేకాక మరొకరు ఆధారపడి ఉన్నారు.

నీ... (ఏమిటో నువ్వే నిర్ణయించు)

మర్నాడు శరత్ లేచేసరికి శ్రీనివాస్ తెల్ల ఫ్యాంటులో తెల్లషర్టు టక్ చేసుకుని ఉన్నాడు.

★ ★ ★

"మొత్తానికి చరిత్ర సృష్టించాడు'' నవ్వాడు రాజు.

"ఇలాంటివి సినిమాల్లో అయినా జరుగుతాయంటే నమ్మలేం" ఇంకా ఆశ్చర్యంగానే అన్నాడు శరత్.

"సాధారణంగా కొత్తగా ఇక్కడకొచ్చే వాళ్ళకు... ఇంటర్‌మీడియట్ అయ్యాక ఇంకా వదలని బాల్యం... ప్రవేశించే యవ్వనం... ఆ సంఘర్షణ ఇలా పరిణమిస్తుంది. ఎడాల్‌సెంట్ స్టేజ్' అంది పావని.

"సైకాలజీ...సరేకానీ ఏ షర్ట్ వేశాడు ఇంతకీ మీ శ్రీనివాస్'' అడిగాడు కోటి.

"ఆ మాత్రం గెస్ చేయలేవూ'' నవ్వింది పావని.

"తల్లీ! పావనీ!!" గొంతు సవరించుకొన్నాడు కోటి.

"ఊరడిల్లుము నాయనా! కోటీ!! కొంచెం బుర్రకి పని కల్పించండీ'' అంతకంటే డ్రమెటిగ్గా అంది.

"వైట్ షర్ట్' అనేశాడు శరత్ ఉత్సాహం తెచ్చుకొని.

"నిన్నూ'' సరదాగా చేతిలో ఉన్న పుస్తకంతో అంటించిందామె. శరత్ బదులుగా తప్పుకున్నట్టు జరిగినా కొంత తన చొరవకి తనే ఆశ్చర్యపోయాడు. అమ్మాయిలంటే బిడియపడి ఆమడ దూరం జరిగే తనేనా పావనితో ఇంత మామూలుగా ప్రవర్తించుతున్నది?

అయినా మొదటిసారిగా లభించిన సామీప్యత వలన అతడిలో కొంత ఉద్రిక్తత నెలకొంది. అయితే అది నరాలకి సంబంధించినదికాదు. హృదయానికి సంబంధించినది.

"రైట్.. ఇక విషయానికి వద్దాం! ఏం రాజూ'' ఒక్కసారిగా సీరియస్‌గా అన్నది పావని.

ఆమె ఎప్పుడూ అంతే. పని విషయంలో ఏమాత్రం ఊగిసలాటనీ సహించదు.

రాజు తల ఊపటంతో చెప్పింది.

"ఇవాళ మీటింగ్‌కు సంబంధించిన నిర్వహణా బాధ్యత వుమెన్స్ కాలేజ్‌వాళ్ళు చూసుకుంటారు. అయితే ఇదే మొదటిసారి గనక వాళ్ళు మన సహాయం కోరుతున్నారు. అందుకోసం మనం ఒకరం మధ్యాహ్నామే హాల్ దగ్గిరకు వెళ్లాలి..." లో గొంతుకతో చెప్పసాగింది.




"సారీ... లేట్‌గా వచ్చినందుకు'' అంటూ దాసు ప్రవేశించాడు.

పావని కోపంగా చూసినా అతడి ఆలస్యానికి కారణాలు తెలుసు గనుక తల ఊపి కూర్చోమని సూచించింది. అతడూ పక్కనే గడ్డిమీద పుస్తకాలు పెట్టి ఆమె మాటలు వినపడేందుకుగానూ దగ్గరకు జరిగి కూర్చున్నాడు.

"అయితే..." ఆగింది.

ఒకసారి అందరి వంకా చూసి శరత్‌ని గమనించి ప్రశ్నార్థకంగా రాజువైపుకి తిరిగింది.

"పర్లేదు... ఈ విషయాలు... వినొచ్చు కానీ'' అన్నాడు రాజు.

శరత్ ఇబ్బందిగా కదిలాడు. తనుండటంవలన వాళ్లు ఫ్రీగా మాట్లాడుకోలేరని ఒక్కసారిగా స్ఫురించింది. వెళ్తే ఏమనుకుంటారో వెళ్లకపోతే ఏం ఫీలవుతారో అని... ఆలోచనలోఉండగా...

కోటి శరత్ భుజం చరిచి "మనవాడేగా... కానీ'' అన్నాడు.

"అయితే... ఈసారి మనం ఒక ప్రశ్న ఎదుర్కోవాల్సి రావచ్చు. ప్రశ్న అనేకంటే హేళనా ఎగతాళీ కామెంట్లూ. బహుశా మీటింగ్‌లోనే జనంలోంచి... గట్టిగా చెప్పాలంటే మన వాళ్లలోంచే అభ్యుదయ వాదులమని నమ్మేవాళ్లు కూడా... ఎందుకంటే మనం తీసుకున్న ఇష్యూ అలాంటిది'' కొనసాగించింది పావని.

విషయం అంతగా అర్థంకాక పోయినా వాళ్లు సాయంత్రం ఏదో సభ జరపబోతున్నారనీ దానికి సంబంధించి తర్జనభర్జనలో ఉన్నారనీ తెలుస్తోంది.మొదటిసారిగా ఇలాంటి పనులూ, వాటిని చేసేవాళ్ల మాటలూ, భావాలూ వాళ్ల అనుమానాలూ జవాబులూ శరత్ జాగ్రత్తగానే గమనిస్తున్నాడు.

టైం చూసుకుని "ఇక లేద్దాం" అన్నాడు రాజు.

"కోటీ... నువ్వు మెస్‌లో పని కానిచ్చుకొని తిన్నగా సెంట్రల్ లైబ్రరీ హాల్ దగ్గరకు వెళ్లు. నేను ఆర్ట్స్ కాలేజ్ స్టూడెంట్లను కలుస్తాను. పావని హాస్టల్ అమ్మాయిల బాధ్యత తీసుకొంటుంది. అక్కడ ఎవర్ని కలవాలో తెల్సుగా. రజని అని బియ్యే ఫైనలియర్. గుర్తుంచుకో' చెప్పాడతడు.

"మరి మీరు వస్తారుగా'' పావని సూటిగా అడిగింది.

శరత్ తబ్బిబ్బయ్యాడు.

"నాకు... డ్రాయింగ్..."

"ఊం! నువ్వే రాకపోతే ఎలా భాయ్. వస్తాడులే' దాసు హామీ ఇచ్చాడు.

"మరి కదలండి. రా శరత్! నేనూ మీ కాలేజ్‌దాకా వస్తాను'' రాజు దారితీశాడు.

వాళ్ల కార్యక్రమం గురించి ఏమైనా అడుగుదామని అనుకున్నా శరత్ రాజు సీరియస్‌గా మౌనంగా నడుస్తుండడంతో నిశ్శబ్దంగా అనుసరించాడు. అతడేదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టున్నాడు.

ఇంజనీరింగ్ కాలేజ్ మెట్లెక్కి సెకెండ్ ఫ్లోర్ దగ్గర చీలిపోయారిద్దరూ.

రాజు అవతలగా ఎలక్ట్రిక్ విభాగంలోని ఒక విద్యార్థికోసం వెతుకుతూ వెళ్లిపోయాడు.

శరత్ పక్కకు తిరిగి పోయే దారిలో ఎదురుగా వంశీకృష్ణ వస్తూ కనిపించాడు. ఆనందంగా విష్ చేశాడు శరత్.

వంశీకృష్ణ తన భూతద్దాల్లోంచి శరత్‌ని చూశాడు. అతడి మొహంలో నవ్వులేదు. అలాని సీరియస్‌గా లేడు.

"ఏంటీ... వాళ్లతో తిరుగుతున్నట్టున్నావ్?" అదోలా అన్నాడు.

శరత్ బిగుసుకుపోయాడు.

వంశీ తనని ఆక్షేపిస్తున్నాడనీ... అదీ రాజువాళ్లతో ఈ కాలేజీ పరిసరాల్లో కన్పించగానే ఇక తాను చెడిపోయాడన్న నిర్ణయానికి వచ్చేశాడనీ తెలియగానే

"నేను... నేను..." ఆందోళనగా వివరించ బోయాడు.

"ఊc! నువ్వు... ఏమిటి నువ్వు''

"లేదండీ... నేను... ఊరికే... అదీ కోటిని కలుద్దామని... పావుగంట క్రితమే..."

"ప్లీజ్... డోంట్ గివ్ సచ్ ఎక్స్‌ప్లెనేషన్స్ శరత్' కఠినంగా అంటున్నానని తెలుసుకొని గొంతు తగ్గించుకున్నాడు వంశీ.

"అలాంటి కబుర్లు నాకు చెప్పొద్దు. ఒక్క సారిగానీ నువ్వు వాళ్ల పాలబడ్డావంటే ఓన్లీ గాడ్ కెన్ సేవ్ యూ. అనుభవంకొద్దీ చెప్తున్నాను. వాళ్లేదో వ్యక్తిగతంగా దుర్మార్గులని నేననటంలేదు. కావాలని నిన్ను ట్రాప్ చేస్తారనీ కాదు. వాళ్లు నమ్ముకున్న ఐడియాలజీ అట్లాంటిది. సమసమాజం... ఆదర్శం... సోషల్ జస్టిస్... డెమొక్రటిక్ వాల్యూస్... వింటానికి బానే వుంటాయ్. నిజానికవి మంచివే. కానీ ఏమవుతారు చివరికి వీళ్లు. నీకు తెలుసో లేదో ఆ రాజుకి నీలాగ చదివే అవసరం లేదు. ఇప్పటికి రెండు ఎమ్మేలు చేశాడు. డబుల్ పీ.జీ. అతనికి కాంపస్‌లో ఉండాల్సిన అవసరం ఏముంది? జస్ట్ హి వాంట్ టు మొబిలైజ్ ది స్టూడెంట్ మాబ్స్. వాళ్ల ఉద్యమ అవసరాలు వాళ్లవి. నీలా చదువుమీదే ఆధారపడే పేద కుటుంబాల పిల్లలు చివరికి ఈ సైపు మనుషులకీ వీళ్లు సృష్టించే ఘర్షణలకీ బలయిపోతారు. వాళ్లు ఏదోకరోజు అత్యంత హీనమైన పరిస్థితిలోకి పోవటం ఖాయం. నువ్వూ వాళ్లకిందే దూర్తానంటావ్... గోటు హెల్'

శరత్ అతడి వివరణకు ఆశ్చర్యచకితుడవటమేకాక భయాందోళనలకు లోనయ్యాడు. తనకు అర్థంకాని వలయం ఏదో చుట్టుముట్టినట్టూ ఆ సాలిగూడులో క్రమంగా ఇరుక్కుపోతున్నట్టూ ఒక భావం.

"మరి... మరిక నేను వాళ్లను కలవను'' తప్పొప్పుకున్న బడిపిల్లాడిలా అన్నాడు.

"చూస్తారుగా మీరే. ఇక నేనూ... నా స్టడీస్ తప్ప వేరేది పట్టించుకోను'' దృఢంగా అన్నాడు.

"చూస్తానుగా..." వెళ్లిపోయాడు వంశీ.

బుర్ర వేడెక్కి, కాళ్లు చల్లబడి కదల్లేనట్టు అక్కడే పిట్టగోడకి ఆనుకున్నాడు శరత్.

అటుగా వస్తున్న అమ్మాయిల గుంపు నవ్వులూ తుళ్లింతలూ ఆపి అతడిని చిత్రంగా చూసుకుంటూ పోయారు. తలొంచుకొని వాళ్ళ మధ్య నడుస్తున్న మాధురి అతడిని గమనించి వెనుదిరిగి వచ్చింది.

"ఆర్‌యూ... ఆల్‌రైట్..." శరత్ ఎదురుగా చెయ్యి ఆడిస్తూ అడిగింది.

ఆలోచనల్లోంచి బయటపడిన అతడు బలవంతంగా నవ్వాడు.

ఆమె నవ్వుతోంది. మహాద్భుతమైన ఆ చిరునవ్వు, చల్లని చూపుల్ని ప్రసరించే కలువల్లాంటి కళ్లు. అతడొక్కసారి తన దిగులు మరిచి విస్మయంగా చూశాడామెని.

"స్కాలర్స్‌కక్కూడా సమస్యలుంటాయా?" నవ్వు బిగబట్టినట్టుగా మొహం పెట్టింది.

"మీకలాగే ఉంటుంది. ఏం క్లాసుల్లేవా?"

"కే.పీగారు లీవ్ అట. ఇంకెందుకు? మీరు కూడా పదండి''

ఇద్దరూ మెట్లు దిగి బస్టాపువైపు నడవసాగేరు. అతడు రహస్యంగా పరిశీలించాడు. తెల్లని గుండ్రని మొహం. అందమైన కనుబొమలు.

వంపు తిరిగిన పెదవులకి అవతల సన్నని నొక్కు నవ్వేప్పుడు సొట్టపడుతున్నందుకు గుర్తుగా... చెవులకి జూకాలు, వాటిపై ఎగురుతున్న వెంట్రుకలు.

"నన్నేం చూస్తారుగానీ... మీరు చెప్పనేలేదు'' అంది తలతిప్పి.

తనని గమనించిందన్న కంగారూ కొంత గిల్టీఫీలింగూ కలిసి అతడు తలొంచుకున్నాడు.






"ఏంటి శరత్... ఏదైనా సమస్యా?" ఆప్యాయంగా అడిగింది.

"పదండి అటు కూర్చుందాం కాసేపు'' బస్టాపు ఇవతల రోడ్డుకింద పార్కులా పెంచిన చెట్లూ మొక్కలవైపు దారితీసింది.

కూర్చున్నారు.

తన బాధ కొంత తగ్గించుకోవాలన్న ఆత్రుతతో అతడు చెప్పాడు. అంతా విన్నాక ఆలోచనలో పడిందామె.

"అతనన్నట్లు స్టడీస్ చెడకుండా చూట్టం ముఖ్యమే. ఆ రాజూవాళ్లతో తిరగటం.. అంటే పని లేనప్పుడు కూడా... అనవసరం. మీరే ఆలోచించండి. మొదట మీరు చదువు మీద దృష్టి పెట్టండి. టైం మిగిలితే అప్పుడు మిగతావాటికి వెళ్లండి'' ఇలా చాలాసేపు చెప్పింది.

తనేదనుకుంటున్నాడో అదే చెప్పటంతో ఆమెపై మరింత అభిమానం కలిగింది.

"థాంక్యూ... మాధురీ... థాంక్యూ''

"వెల్‌కమ్... నేను చేసిందేమీలేదు. నిజానికి మీరే బ్యాలెన్స్‌డ్‌గా ఉంటారు. క్లాసులో కూడా మొదటి రెండుమూడు పొజిషన్లలో ఒకటి మీదేకదా! కమాన్ శరత్. నువ్వు తల్చుకుంటే సాధించంది లేదు. కొంచెం కష్టపడితే ఫస్ట్‌రాంక్ నీదే. ఎండ్ సెమిస్టర్ వచ్చేస్తోంది. ఛీరప్! పదండి''

మాధురి లేచి నిలబడి చెయ్యి అందించింది.

అతడు ఆశ్చర్యానందాల సంభ్రమం నుండి తేరుకుని మొదటిసారిగా ఆ చేతిని తాకాడు. లక్ష ఓల్టులు ఏమీ ప్రవహించలేదు కానీ ఒక ఆత్మీయభావం ఆమెలోంచి ప్రస

రించి అతడిని సేదదీర్చింది.



లైబ్రరీ నుండి...

సాయంత్రం నాలుగు గంటలకి మెట్లు దిగుతున్నాడు శరత్.

రాజు అటుగా కొంతమంది విద్యార్థులతో బస్‌స్టాప్ వైపు నడుస్తున్నాడు. అందరూ ఆర్ట్స్ కాలేజ్‌వాళ్లు. శరత్ పక్కకి తప్పుకునేలోపే రాజు కేక విన్పించింది.

ఇబ్బందిగానే వెళ్లాడు శరత్.

"రూంలో చూశాను. మధ్యాహ్నం నుంచి లేవటకదా! మొత్తానికి కన్పించావు'' నవ్వుతున్నాడు రాజు.

"నేను... ఈసారి వస్తాను మీరు పదండి'' అన్నాడు శరత్.

"అదేంటి... వస్తే బాగుంటుందనుకున్నానే. ఇవ్వాళ నీకు ఇంట్రస్ట్ కల్గించే ఒక ఇష్యూ మీద మీటింగ్. కొన్ని రకాల మానవ సంబంధాలు మనం ఊహించనివి ఇవాళ నువ్వు చూడొచ్చు. నిజానికి ఈసారే మీరు రావాలి, నీలాంటివాళ్లు''

"అవీ..." నాన్చాడు శరత్.

"ఏదయినా ఇబ్బంది ఉంటే వద్దులే గానీ... ఏమాత్రం వీలున్నా రా... తప్పనిసరిగా. మీటింగ్ హాల్ తెల్సుగా. అక్కడందరం ఉంటాం. సరేనా!" స్నేహంగా చేయి కలిపి వెళ్లిపోయాడు.

ఈ రాజు... పథకం ప్రకారం ఇక్కడ స్టూడెంట్స్‌ని ఘర్షణల్లోకి నెట్టే రాజు... వంశీకృష్ణ వివరించిన ప్రకారం విలన్‌లాంటి కారెక్టర్ గల ఈ మనిషి నిజంగా అలాంటివాడేనా? అతను స్నేహంగా పలకరించే తీరూ ఆ ఆప్యాయతా అంతా అబద్ధమేనా? నిజంగా ఇలా ఉండటం సాధ్యమేనా?

వెళ్లిపోతున్న రాజును పిలిచాడు శరత్.

అతడు వెనుదిరిగి చూశాడు. అదే చల్లని నవ్వు.

"వస్తున్నా... ఒక్క నిముషం"

అందరూ కల్సి మూడో నెంబరు బస్సెక్కారు. టికెట్స్ రాజే తీసుకున్నాడు, శరత్ జేబులో చేయిపెట్టే లోపే చేయిపెట్టటానికి కొంత ఆలశ్యం చేశాడన్నది నిజం. అది కొంత వరకూ చొరవలేనితనంవల్లనే అయినా ప్రస్తుతం మాత్రం ఈ అపరిచితుల కోసం తియ్యాలా అన్న భావం పనిచేసింది.

రాజు ఏదీ గమనించనట్టు ఉండిపోయాడు.

ఇంకో బస్సుమారి కొంతదూరం నడిచి సెంట్రల్ లైబ్రరీ వీధిలోకి వచ్చారు.

దూరంనుంచే చాలామంది విద్యార్థినులు కన్పిస్తున్నారు. కొందరు అబ్బాయిలు కూడా. వాళ్లు చేతులు ఊపుతూ ఆహ్వానించారు.

సమూహంలో కలవగానే రాజుని పలకరించేందుకు ముందుకు వచ్చిన విద్యార్థినీ విద్యార్థులతో కొంతసేపు గడిచింది. అప్పటికే అక్కడ ఏర్పాట్లు చూస్తున్న పావని విష్ చేసింది.

"అన్నా..."

"హాయ్ రాజూ''

"ఇదిగో వీళ్లిద్దరూ మెడికల్ కాలేజి వాళ్లు. ఇద్దరేలే'

"రాజూ భయ్యా'' వగైరా పిలుపులూ... పరిచయాలూ.





శరత్ మొదటిసారిగా రాజుని చూసి చకితుడయ్యాడు. అతనిలోని నాయకత్వ లక్షణం, జనంతో వ్యవహరించేతీరూ, నవ్వు మొహం, సీరియస్ మాటలూ అంతా కొత్తగా ఉంది. తనెరిగిన రాజులో ఇంతవరకూ చూడని మరో వ్యక్తి బయటకు వచ్చాడు.

కొందరు తననీ పలకరించారు. బిడియంగానే మాట్లాడాడు శరత్.

"మరి లోపలకు నడవండి!" దాసు పిలుపు.

అందరూ హాల్‌లో కుర్చీలనాక్రమించారు.

స్టేజీమీద ఒక బ్యానర్ కట్టివుంది.

"... లక్ష్మికి రక్షణ కల్పించాలి. ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని ఖండించండి''

"ఏంటన్నా విషయం?" ఎవరో రాజుని అడిగారు.

"చూస్తారుగా. స్పీకర్లున్నారు. వినండి'' అన్నాడతడు.

కొద్దిసేపటికి వేదికమీదకు పావని ఆహ్వానంతో రాజూ, నరహరీ, లక్ష్మి వెళ్లారు.

మామూలు బట్టలతో నల్లగా చదువులేని మనిషిలా పీలగా వుంది లక్ష్మి. సాధారణంగా నాలుగిళ్లలో పనిచేసి పొట్ట నింపుకునే స్త్రీలా వుంది. మొదటిసారిగా స్టేజి ఎక్కినందువలన కాబోలు భయంగానూ, ఆందోళనగానూ చూస్తోంది.

నరహరిగారు ఉపన్యాసం ప్రారంభించారు.

పక్క స్టూడెంటు ఎవరో అనటంతో గుర్తొచ్చింది. ఆయన క్యాంపస్‌లో తరచూ కన్పిస్తుంటాడు. ఆర్ట్స్ కాలేజీ లెక్చరర్ అట. లెక్చరర్లలో కూడా ఇలాంటివాటిలో పనిచేసే వాళ్లుంటారని తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు శరత్. అందువలన ఆసక్తిగా విన్నాడు.

నెమ్మదిగా, లోగొంతుకతో పాఠం చెప్తున్నట్లు ప్రారంభించాడాయన.

"బహుశా ఇలాంటివి జరుగుతాయనీ లక్ష్మిలాంటి మనుష్యులు ఇంకా మన సమాజంలో ఉన్నారనీ తెలుసుకొంటే... తెలిస్తే నమ్మబుద్ధి కాదు. భయం కలుగుతుంది. ఈ లక్ష్మి మన నగరంలో లేదా మన సొసైటీలో అట్టడుగు వర్గానికి చెందిన ఒక అనామకురాలు. అనామకులతో సమాజానికి పనుండదు. పట్టించుకోరు. కానీ మన ఆర్థిక వ్యవస్థ మొత్తం వీళ్ళ శ్రమమీదే వీళ్ల భుజాలమీదే నిలబడివుంది. అంతవరకే వీళ్లతో అవసరం.

లక్ష్మికి చిన్నతనంలోనే పెళ్లిచేశారు. ఊహ తెలిసేసరికి అతను రోగాలపాలబడి మంచానపడ్డాడు. ప్రస్తుతం అంటే పదేళ్ల తర్వాత కూడా అతనిది అదే స్థితి. వేరేమార్గం లేక గాలికి వదిలేయలేక ఇంత విషమిచ్చి చంపమని కొందరు సలహా ఇచ్చినా మానవతా దృక్పథంతో అతన్ని పోషిస్తూంది. వెనక ఆస్తిలేదు. కేవలం రెక్కల కష్టంతోనే, పళ్లబిగువున అర్థాకలితో కూలిపని చేసి పొట్ట పోసుకుంటోంది. ప్రపంచానికి తెలీని ఈ రకం మనుష్యులు చేసే త్యాగాలు ఎన్నడూ వెలికిరావు. ఎవరికీ ఉత్తేజాన్నివ్వవు.

అయితే రెండేళ్ళక్రితం తను కూరగాయల మార్కెట్లో పనిచేసేప్పుడు ఒక వ్యక్తితో పరిచయం అయింది. పేరు నర్సింహం. అతను ఒకచోటని కాకుండా నానారకాల పన్లూ చేసే మనిషి. కొన్నిసార్లు దొంగతనాలకి పాల్పడినందువల్ల అరెస్టవటం, తన్నులు తినటం, ఉద్యోగాలూడటం జరిగింది. ఆరకంగా ఉండటంవలన తిండిలేని రోజులూ, అర్థాకలీ పరిస్థితుల్లో అతను లక్ష్మికి చేరువై మంచి మాటలతో సానుభూతితో ఆమెని పెళ్లిదాకా నడిపించాడు. ఆమె వివాహితనే సంగతి అతనికి తెలుసు. ఏదో గుళ్లో మామూలుగా జరిగింది. ఆమెకి చేయూతనివ్వటం బదులు ఆమెపైనే ఆధారపడటం ప్రారంభించాడు. అతని ఉద్యోగం ఊడటంతో సంగతి తెలిసేసరికి అంతా అయిపోయింది. తాగుడూ దొంగతనాలూ ఒకలాంటి రహస్య జీవితంలోకి పోయా

డు. మధ్యమధ్య ఈమెమీద పడి బతికేవాడు. మొదటి భర్తని వదిలేయమనీ లేదా తనే అతన్ని చంపుతాననీ తన్నేవాడు. తిట్లు మామూలే. అసలే ఉన్న కష్టాలకు తోడు అతనో గుదిబండలా తయారయ్యాడు.

ఏడాదిక్రితం అతను కొన్ని దొంగతనాల్లో నేరాల్లో పూర్తిగా ఇన్‌వాల్వ్ అయిపోయాడు. దూరప్రాంతాల్లో గ్రామాల్లో చేస్తాడు దోపిడీలు. అందుకుగానూ ఈమె అవసరం అయింది. బలవంతాన బెదిరించి వంటపాత్రలు అమ్మే మనిషిలా వేషం వేయించి తీసుకుపోయేవాడు. తోడుగా తనుండి ఎవరెవరు ఆస్తిపరులో గమనించేవాడు. రాత్రిళ్లు ఈమెని ఊరుబయట కాపలా వుంచి దోచిన సొమ్ము ఈమెకి ఇచ్చి దాటించేవాడు. మాట వినకపోతే విపరీతంగా కొట్టేవాడు. అతనూ మామూలు క్రిమినల్ కాదు. శాడిస్టు కూడా ఎప్పుడూ కత్తి రడీగా ఉంచుకుంటాడు.

అతన్నించి బయటపడేందుకు ఏ ప్రయత్నమూ చేయలేదా? అంటే ఒక పేదరాలూ, ఏ చదువూ లేని మనిషీ, ఏ పలుకుబడీ ఎవరి పరిచయం లేని సామాన్యుల్లానే ఈమే ప్రయత్నించింది. ఒకసారి పోలీస్‌స్టేషన్‌లో రిపోర్ట్ ఇచ్చింది. ఒక లాయర్‌తో కేసు పెట్టింది. అతను ఇలాంటివి జరిగినప్పుడు హింసించేవాడు. పోలీసులు ఒకటిరెండుసార్లు వెతికినప్పటికీ దొరకలేదు. అసలతను ఎక్కడ ఉంటాడో ఎవరికీ తెలీదు.

చివరిగా నాలుగు నెల్లక్రితం ఒక దొంగతనానికి తీసుకుపోయేందుకు వచ్చి లక్ష్మి మొరాయించేసరికి ఒక పశువులా, అడవి జంతువులా కత్తితో ఆమె బొటనవేళ్లు రెండూ నరికేశాడు. అదతని శిక్షాపద్ధతి.

ఇంత చేస్తుంటే మన రక్షకవ్యవస్థ ఏం చేస్తుందా అని మీలో కొందరికి ఆశ్చర్యం కలగొచ్చు. లక్షలాది కోట్లాది అనామకుల్లో ఒకరికి అన్యాయం జరిగిందని పట్టించుకునే స్థితి లేదిప్పుడు. పైగా ఈమె వెళ్లి అతన్ని పట్టుకోమన్న ప్రతిసారీ ఈమెని విసుక్కోవటం, తిట్టటం బయటకు పొమ్మనటం జరిగింది. నామమాత్రంగా ఒకటిరెండుసార్లు వెతికినా ఫలితంలేదు. అక్కడినుంచీ అసలు పట్టించుకోలేదు. ఎస్పీకీ, చివరికి హెూంమినిస్టర్‌కీ విన్నపాలు పంపినా లాభంలేకపోయింది. దానికో కారణం బహుశా నేనను కోటం లోకల్‌వాళ్లకి అతనితో వాటాలుండి వుండవచ్చు.

గత రెండ్నెల్లుగా అతనితో గొడవ చివరిస్టేజీకొచ్చింది.

లక్ష్మిపై ఒకసారి హత్యాప్రయత్నం చేశాడు. ఆ సందర్భంలో అక్కడే ఉన్న లక్ష్మి తమ్ముడు ఎదురుదాడి చేయడంతో గాయపడి తాత్కాలికంగా పారిపోయాడు. పోయే ముందు ఒక భీష్మప్రతిజ్ఞ చేసి పోయాడు. అదేమిటంటే, ఎలాగైనా ఎక్కడ దాక్కున్నా లక్ష్మినీ, ఆమె తమ్ముణ్నీ చంపుతానని. నాలుగైదుసార్లు అవకాశంకోసం తిరిగాడు. ఈరోజుకీ వెంటాడుతున్నాడు. లక్ష్మివాళ్ల పరిస్థితి ఏమిటంటే త్వరత్వరగా భయంగా పనులు చేసుకోవటం. రాత్రిళ్లు ఏ బస్‌స్టాండ్‌లోనో రైల్వేస్టేషన్‌లోనో అందరూ పడుకోవటం. ఎందుకంటే కొంచెం మనుషులూ రద్దీ ఉంటే అతను రాడని. అయినా నిన్నరాత్రి కూడా అతను ప్లాట్‌ఫాంమీద తచ్చాడి దూరంనుంచే గమనించి వెళ్లిపోయాడు.

బహుశా అతను ఈ హాలు బయట పొంచి కూచున్నా ఆశ్చర్యంలేదు. అదీ లక్ష్మి పరిస్థితి'' నరహరిగారు కూర్చున్నారు.

ఒక్కసారిగా అందరూ ఊపిరి బిగబట్టి విన్న ఫలితంగా కొంతసేపు నిశ్శబ్దం... తర్వాత గుసగుసలు. వాతావరణంలో ఉద్రిక్తత అలుముకొంది. చాలామంది సానుభూతిగా లక్ష్మిని చూశారు, ఇలాంటివి కనీవినీ ఎరగని సంఘటనని తెలియటంతో.

ఆమె తలొంచుకొని ఉంది. ఏడవటంలేదు. బహుశా కష్టనష్టాల రాపిడితో మొద్దుబారిపోయినందువలన ఏ భావమూ కన్పించ




టంలేదేమో!

శరత్‌కు తల తిరిగిపోయింది. నరహరి అన్నట్లు మొదటిసారిగా కళ్లు తెరిచిన పసివాడు నగరం నడిరోడ్డుమీద ఒంటరిగా నిలబడినట్లుంది అతని స్థితి.

రాజు లేచాడు. మైక్‌ముందు నిలబడి నిశ్శబ్దంగా అందరినీ పరిశీలించాడు. క్షణంసేపు శరత్ పైన దృష్టినిలిచింది.

"బహుశా వారం రోజులక్రితం షరాబ్‌బజార్‌లో ఒక మార్వాడీ ఇంట్లో దొంగతనం జరిగింది. లాకర్‌లోంచి రెండు లక్షల నగలూ, కొంతసొమ్ము దోచేశారు. అయితే ఏం జరిగిందో తెలీదుగానీ ఆ సమయంలో అక్కడున్న ఇద్దరు ఆడవాళ్లలో ఒకరిని పొడవటంవలన ఆమెని హాస్పటల్లో చేర్చారు. జరిగిన నాలుగ్గంటలకి వ్యాపారవర్గాలన్నీ తమ రక్షణ గురించీ, రక్షణ వ్యవస్థ వైఫల్యం గురించీ పేపర్ ప్రకటనలిచ్చి హోంమంత్రిని కలిశారు. ఐదో గంటలో సిటీ మొత్తం వలపన్ని పాతనేరస్థులందర్నీ బంధించి తీగలాగి తెల్లారేసరికి నిందితుణ్ణి పట్టి డబ్బంతా రికవర్ చేశారు. నేరస్థుల్ని కుళ్లబొడిచి చావు బతుకుల్లో హాస్పటల్‌లో చేర్చారు. వాళ్లు చూపిన కారణం ఏమంటే ఆ సొమ్ముని పంచుకోవటం కోసం వాళ్ళిద్దరూ-నిందితులిద్దరూ కొట్లాడుకొన్నారని.

ఇంత శ్రద్ధా, పట్టుదలా వహించినందుకు రక్షణమంత్రిని తప్పనిసరిగా అభినందించాలి. ఎంచేతనంటే నేరం జరిగింది ఆయన ఎన్నికయిన నియోజకవర్గంలో అన్న కారణంగా అంత త్వరగా స్పందించినందుకు. అయితే ఈ లక్ష్మి కూడా ఇదే నియోజకవర్గంలోని మనిషి. అంతేకాక ఈమె ఆయనకి ఓటేసి గెల్పించినవాళ్లలో ఒక మనిషి కూడా. అందుచేత లక్ష్మికి రక్షణ కల్పించాల్సిన అవసరం ఆయనకి మరింత ఎక్కువ ఉంది.

అయితే నరహరి సార్ చెప్పినట్లు లక్ష్మి అనామకురాలు. ప్రపంచానికి అక్కరలేని మనిషి. పాలకులూ, రక్షకులూ చివరికి పత్రికలు కూడా ఆమెనీ, ఆమెలాంటి అనేకుల్నీ పట్టించుకోవు. ఇక పట్టించుకోవాల్సిన బాధ్యత అనివార్యంగా ప్రజలమీదే పడుతుంది. ఇప్పుడూ పడింది. అందుకే ఈ సభ.

ఈ సభలో వెనకవైపున లక్ష్మి తమ్ముడు కూర్చుని ఉన్నాడు. మీరూ చూడొచ్చు- అతని భుజంమీద నర్సింహం పొడిచిన కత్తిపోటు. ఇతనూ ప్రతిఘటించటంతో నర్సింహంకి తల పగిలింది తోపులాటలో గాయపడిన పులిలాగా ఇప్పుడా నర్సింహం వీళ్లని వెంటాడుతున్నాడు. క్షణక్షణం దాక్కుంటూ ఫ్లాట్‌ఫారాలమీద బతుకుతున్నారు వీళ్లు.

బహుశా మనం డిమాండ్ చేస్తున్నట్టు లక్ష్మికి రక్షణ కల్పించకపోతే త్వరలోనే లక్ష్మికి నూకలు చెల్లిపోతాయి. ఇలా అనాల్సి వస్తున్నందుకు నాకు ఎంతో వేదనగా ఉన్నా ఇది వాస్తవం. ఇరవైనాలుగ్గంటలూ ఈమెని కాపాడ్డమేనా పోలీసులపని అని మీరడుగుతారు. అంత ఘనకార్యం ఎవరూ చేయరుగానీ అతన్ని పట్టుకోవటానికి- వీళ్లు తల్చుకుంటే క్షణం పట్టదు. షరాబ్‌బజార్ నిందితుల్ని వేటాడి పట్టిన వీళ్లకి.

అయితే నేనిక్కడ కేవలం ఈ ఇష్యూమీద మాత్రమే మాట్లాడదలచుకోవటం లేదు. మానవ విలువల నగ్న స్వరూపం గురించే మాట్లాడుతున్నాను. మనం ఎంతగా కరడు గట్టిపోయామంటే... ఈ సభ పెట్టాలా వద్దాని మేం ఎంతో తర్జన భర్జన పడాల్సివచ్చింది. ఎందుకంటే లక్ష్మి ఇంతకుముందే సమాజం దృష్టిలో నిందితురాలు. దొంగతనాల్లో పాల్గొంది కాబట్టి. అది ఇష్టంగానా అయిష్టంగానా అన్నది వేరే సమస్య. ఒక దొంగ కోసం సభ పెట్టటం, ప్రభుత్వాన్ని నిలదీయటం, ఎంతో ఘోరం, నేరం అని జనం చాలామంది అనుకుంటున్నారు. మమ్మల్ని

ఎగతాళి చేశారు. కేవలం జనం మాత్రమే కాదు. మాలో ఉన్న అభ్యుదయవాదులు కూడా... అవును మాలో కొందరు కూడా దీన్ని హేళన చేశారు.

ఈ సమస్య అసలు ఒక సమస్య కాదు వాళ్లకి. లక్ష్మి మనిషి కాదు. ఒక చీమా దోమా లాంటిది. నిజానికి నరహరి సార్. ఈ సభ నేపథ్యాన్ని గనక వివరించకపోయివుంటే, అంటే లక్ష్మి గతచరిత్ర మొత్తం చెప్పకపోయి నట్లయితే మీలో ఎందరు కనీసం సహనంగా ఇంతసేపు ఇక్కడ కూర్చునేవారు.

ఇదెటు దారితీయబోతుంది?

ఈ అతిచిన్న సమస్య రేపు కరాళనృత్యం చేసి మానవ విలువల... మానవహక్కుల మీద ఈ శతాబ్దంలో రెండోసారి మళ్ళీ నెత్తుటి మరక కాబోతుంది. ఈ ఎనిమిదవ దశకం మళ్ళీ నెత్తురోడుతూ తెలుగు నేలమీద భయానక స్మృతిగా నిలిచిపోబోతుంది.

జరగబోయే ఆ ఘాతుకాన్ని నివారించేందుకే ఈ సభని మేం పెట్టలేదుగానీ ఈ సభలో మేం లేవనెత్తిన ప్రశ్నలు కనీసం భవిష్యత్తులో ఒక రికార్డుగా మిగిలిపోతాయనీ... ఈ ప్రశ్నలకు జవాబులు వెతికేందుకు మీలోని మానవతావాదులు ప్రయత్నిస్తారనీ... ఆ అన్వేషణలో అనేక నూతన సత్యాలు వెలుగులోకి వస్తాయనీ''

రాజు మాటలాపేసి తన చోటులోకి వెళ్లిపోయాడు.

కాలం స్థంభించిపోయింది. చాలా సేపు గాఢమైన నిశ్శబ్దం. ఎవరో ఒక మూల క్లాప్స్ కొట్టారు. అందరూ అందుకున్నారు. చప్పట్లతో హాలు మార్మోగిపోయింది. దాంతోపాటే నినాదాలు- లక్ష్మికి న్యాయం చేయాలని. ఆ గొంతుల్లో ఆర్తీ ఆవేశం రెండూ ఉన్నాయి.

శరత్‌కి చాలా సేపు ఏమీ అర్థంకాలేదు. అతడి తల గిర్రున తిరగసాగింది. తనకి తెలీని ప్రపంచం, సంఘటనలూ ఒకసారి చుట్టుముట్టేసరికి... కొంత అర్థమయి ఇంకొంత అర్థం కానట్లుండి... మగత కమ్మినట్లుంది. తన ప్రమేయం లేకనే తన చుట్టూ అనేక సంఘటనలు జరిగిపోతున్నట్లుంది. ఇంతదాకా తను నిర్వహించిన ప్రేక్షక పాత్రపై ఎందుకో హఠాత్తుగా విరక్తి కలిగింది. జరుగుతున్న సంఘటనల్లో తన వంతు భాగాన్ని తనే అందుకోవాలనుకున్నాడు.

తనకు తెలీకనే వాళ్లతో గొంతు కలిపి నినదించాడు- పొద్దున్న వంశీకృష్ణ మాట మర్చిపోయి, మాటే కాదు అసలు మనిషే గుర్తులేదు.

ఇంతలో లక్ష్మి వచ్చింది మైక్ ముందుకు.

ఏం మాట్లాడుతుందా అని సభంతా నిశ్శబ్దంగా ఎదురుచూస్తోంది. కొంతసేపు నిశ్శబ్దం. తర్వాత... వెక్కుతున్న శబ్దం. భోరున ఏడ్చి కుప్పకూలి పోతుందేమో అనుకున్నారు. కానీ ముక్కు చీదుకుని కొంగుతో మొహం రుద్దుకుని గొంతు విప్పిందామె.

"బాబులూ... అమ్మలూ మీరు చదూకున్నోళ్లు. చదుకొని మంచి బతుకులు బతకాల్సినోళ్లు. మీకివ్వన్నీ ఎందుకు? మీరు ఇవ్వన్ని ఆలోచన చేసి మాలాటోళ్ల కోసం నిలుత్తారని నేననుకోలే. కొన్నిరోజుల ముందు పావనమ్మ రజనమ్మ ఇద్దరూ నన్ను కల్సి ఇదిగో నీ ఎనకాతల మేవంతా ఉన్నాం. ఆడి గురించి, ఆడి భయం గురించి నలుగురికీ చెప్పుదాం. నిలబడి కొట్లాడదాం అన్నారు. ఆ పద్ధతిలోనే మంత్రిగారికి, పోలీసుసార్లకీ మనవి చేసుకున్నాం. అయినా బాబులూ ఎవరూ పట్టించుకోలే. మళ్ళీ చాన్నాళ్లకి మిమ్మల్నే చూత్తున్నాను. మా పేటలో ఒకడుండేవాడు. 'చౌడి'గాడనే వాళ్లం. మా పిల్లలందర్లాగే ఆవారా తిరుగుళ్లు తిరిగేవాడు. సినిమా షికార్లని అళ్లమ్మని పీడిచ్చి డబ్బులొల్చుకు పోయినోడు. ఉన్నట్టుండి ఆడు బుద్ధి నేర్చుకుని, తిరుగుళ్లు మాని మంచిగా చదుకోటం మొదలెశాడు. ఇంట్లో సాయితాగా నిలబడటం కూడా ఆరంభించా





డు. ఇదేట్రా ఈడు ఈ మాదిరి బుద్ధిమంతుడయిపోయాడూ అని ఆశ్చర్యపోయాం. ఆడు ఒట్టిగా చదుకొని ఆపకుండా లోకం గురించిన పుత్తకాలూ చదివుతాడంట. బుద్ధిగా ఉండటమే గాకుండా నలుగురికీ బుద్ధి చెప్పటం మొదలేశాడంట. అదిగో బాబులూ అదే నేరవయిపోయింది. కొన్నాళ్లకి వాడినెవురో రవుడీలు చిత్తుగా తన్ని మా పేట రోడ్డుమీద పారేసిపోయారు. తర్వాత ఆడూ ఆడి నేస్తులూ కల్సి ఆ రవుడీల ఎనకుండే పెద్దమనుషుల్ని ఎదురుదెబ్బ తీశారు. అందాకా ఐపులేని పోలీసోళ్లు ఈడికోసం పేటంతా గాలించారు. ఈడేవయ్యాడో అయిపు లేడు. ఎక్కడో రహస్యంగా ఏదో చేత్తుంటాడనీ, రహస్యంగా ఆడి అమ్మా బాపుని చూసిపోతాడనీ అనుకుంటుంటారు మావోళ్లు. అయితే ఆడు ఓపాలి నా కళ్లబడ్డాడు రోడ్డుమీద.

"ఏట్రా ఈ పన్లూ'' అని కేకలేశాను. ఆడు నవ్వేసి "పెద్దమ్మా నీకు లోకం కొద్దిగానే తెలుసు. నిన్నంతా పీక్కుతినే వోళ్లే. కానీ నీలాంటోళ్ల కోసం నిలబడే ఓళ్లూ ఉంటారు. నిలబడితే నాలాగా అవుతూనూ ఉంటారు'' అనేసి తప్పించుకున్నాడు.

మిమ్మల్ని చూత్తే ఆడే గుర్తొచ్చాడు.

ఇదిగో ఆడిలాంటోళ్లని ఏటాడే పెద్దమనుసులు నా మొగుడి లాటోళ్లని మాత్రం వదిలేత్తారు. నా మొగుడి ఎనకాతల ఇంకా బోల్డు మంది పెద్ద మనుసులున్నారు. ఆళ్ల యాపారాలు మంచిగా జరిగిపోవాలంటే ఈడి లాటోళ్లు కావాల. ఈడిలాటోళ్లకి నాలాటోళ్లు కావాల. మల్నాటోళ్ల కోసం ఎవుడు నిలబడాల? నాకీ జనంమీదా, మనుసులుమీద నమ్మకంపోయింది. ఇక్కడ ఎవుడికెవుడూ ఏమీకాడు. అందరూ దొంగలు... అనుకుంటా ఉంటాను. కానీ ఇయ్యాల మిమ్మల్ని చూసినాక మనిషి మీద కొద్దిగా యిశ్వాసం కలుగుతాఉంది. ఇంకా నాలాటోళ్లకోసం నిలబడినోళ్లు ఉన్నారని చాలా ధయిర్నమొచ్చింది. నాకు మళ్లీ బతకాలని ఉంది. నన్ను బతికిచ్చండి బాబులూ..." ఒక్కసారిగా కళ్లనీళ్లు పెట్టుకుని అందరికీ దండం పెట్టింది లక్ష్మి.

సభ ముగిసినట్లుగా ప్రకటించటంతో అందరూ లేచారు.

"మరి నువ్వు ఉంటావా బస్సెక్కుతావా శరత్?" అడిగాడు కోటి.

"నువ్వు?"

"నేనా? కొంచెం పనుందనుకుంటాను. రాజుతో వస్తాను. అదీగాక రాత్రి తొమ్మిదవుతుందిగా. ఇక్కడ అమ్మాయిలు కొందరు సిటీలో దూర ప్రాంతాలకి వెళ్లాల్సి ఉంటుంది. అవసరమయితే వాళ్లని దించి రావటం, చేయటం పనులుంటాయి. ఇవాళ లేటవుతుందేమో నువ్వెళ్లులే' అన్నాడు.

శరత్ కొంచెం ఆలోచించి రాజుతో మాట్లాడాలన్పించినా కుదరని పరిస్థితి గమనించి ఒక్కడే బయల్దేరాడు.

హాలు బయట లక్ష్మి వాళ్లతో మాట్లాడుతున్నాడు రాజు. నరహరిగారితో పాటు ఇంకొందరూ ఉన్నారు. అమ్మాయిలు చాలా మంది గుమిగూడారు. అందరూ లక్ష్మికి ధైర్యం చెప్తున్నారు.

బయటకు నడవబోయాడు శరత్ జనంతో కలిసి.

అంతలో కోటి వచ్చి పిలిచాడు.

"రాజు పిలుస్తున్నాడు''

శరత్ వెళ్లాడు.

"వస్తున్నా'' అన్నట్టు తలూపి కాసేపున్నాక గుంపులోంచి బయటకు వచ్చాడతడు.

"ఏంటి శరత్... పనుందా?"

"ఊం! లేదు. మీరంతా బిజీకదా! నేనెందుకులే అని..."

"బిజీ ఏం లేదబ్బా. వెళ్దాం... లక్ష్మిని దగ్గర్లో రైల్వేస్టేషన్‌లో దించి అవునూ మెస్‌లు మూసేస్తారు కదా! ఎక్కడ తిందామని? నీకభ్యంతరం లేకపోతే మాతోరా అందరం

దొరికిందేదో కానిద్దాం"

అతడు మర్చిపోకుండా తన ఆకలి సంగతి తెలుసుకోవటం శరత్‌ని ఆశ్చర్యపరిచింది. అసలు తననాపిందే అందుగురించి అయుండాలి. మెస్‌లు ఎనిమిదికే మూసేస్తారు యూనివర్సిటీలో. వెళ్లిపోయి ఉంటే ఇబ్బందిపడే వాడే.

అతడికి రాజుపై గౌరవం రెట్టింపయింది.

ఇంకో పది నిముషాల్లో అందరూ బయలుదేరారు.

మెయిన్ రోడ్డుమీద చాలామంది విడిపోయారు. కొందరు బస్టాపుల్లో ఆగారు. మిగిలింది లక్ష్మి, లక్ష్మి తమ్ముడూ, ఇంకా దాసూ, కోటి, నరహరిగారూ, పావనీ, రజనీ ఇంకో నలుగురు వెనుక మాట్లాడుకుంటూ వచ్చి కలిశారు. వాళ్లతోనే స్కూటర్ మీద వచ్చి ఆగిన మరొకతను.

"నేను వెళ్లనా రాజూ. హాస్టల్ తొమ్మిదికేగా క్లోజ్ చేసేది. ఇప్పటికే అరగంట లేటు'' పావని అడిగింది.

"ఆఁ! పద.. అవునూ రెండు బస్సులేం మారతావు ఒక్కదానివీ?"

"తప్పదుగా'' నవ్వింది కర్చీఫ్‌తో నుదురు అద్దుకుంటూ.

"నేను దింపనా'' అడిగాడు స్కూటర్ వాలా.

భుజాలెగరేసింది పావని.

"నాకభ్యంతరం లేదు. మీకే ఇబ్బంది''

"దింపులే రాధాకృష్ణా!" రాజు అన్నాడు.

"పదండి'' అతడు కిక్ కొట్టాడు.

కొద్దిసేపటికి రజని కూడా వెళ్లిపోయింది తనతో వచ్చిన నలుగురినీ తీసుకొని.

"మనం లక్ష్మిని దించి వెళ్లిపోదాం" రాజు శరత్‌తో అన్నాడు.

దారిలో మాటలు, నరహరిగారు కోటి భుజంమీద చేయివేసి మాట్లాడుతున్నారు. శరత్‌కిదీ వింతగానే ఉంది. ఒక లెక్చరర్ అట్లా స్టూడెంట్స్‌తో కలిసి పోవటం, నవ్వుతూ తుళ్లుతూ...

రాజు మాత్రం మౌనంగా ఉన్నాడు.

లక్ష్మి, ఆమె తమ్ముడూ రాజు పక్కగా నడుస్తున్నారు.

హఠాత్తుగా అన్నాడు రాజు ఆమె తమ్ముడితో...

"ఆ రోజు నిన్ను పొడిచినపుడు... రోకలి బండతో కొట్టానన్నావుకదూ. అతనేంటి పడిపోయాడా స్పాట్‌లో?"

"అవునయ్యా... తల పగిలి నెత్తురు వచ్చింది. కాసేపు దిమ్ముగా కూలబడిపోయాడు. చస్తాడేమో అని అందరం భయపడ్డాం. కానీ ఈలోపే మెల్లగా లేచిపోయేడు. అప్పుడే దీన్ని నన్నూ చంపిగానీ నిదరపోనంది. ఆ రోజునుంచీ దీనికోసం చుట్టుపక్కల తిరుగుతానే ఉండాడు''

అందరూ మాటలాపి వింటున్నారు నరహరితో సహా... బాధితులే గొంతు విప్పటంతో.

"అదే... నువ్వు చేసిన తప్పు'' అన్నాడు రాజు.

"ఏది'' అన్నాడు దాసు.

"అక్కడితో వదిలెయ్యటం"

శరత్ మనసులో చిన్న అనుమాన బీజం. అది... పెరిగిపోతోంది.

"అవును... కొట్టినవాడివి మరి రెండు వేసి ఉంటే.. పడిపోయే ఉన్నాడంటున్నావుగా... పీడా వదిలేది. ఎందుకు భయపడినట్టూ?"

"అయ్యా'' అంటున్నాడు లక్ష్మి తమ్ముడు వణుకుతూ.

శరత్ తల గిర్రున తిరగసాగింది. ఏం చెప్తున్నాడు రాజు? ఒక మనిషిని... రెండు కాళ్లూ, చేతులూ, తలా ఉన్న సజీవ శరీరాన్ని ఒక ప్రాణాన్ని... నిలువునా తీయమంటున్నాడు. తల పగలగొట్టి చంపమంటున్నాడు. అలా చేయనందుకు మందలిస్తున్నాడు.

నరహరిగారు మాత్రం నిశ్శబ్దంగా ఉన్నా







రు. మిగిలినవాళ్లు షాక్ తిన్నట్లే ఉంది. మొహాలు పాలిపోయాయి.

శరత్ రాజుని మాఫియా లీడర్‌ని చూసినట్లు చూస్తున్నాడు.

అది గమనించినట్లున్నాడు. నెమ్మదిగా నచ్చచెప్పుకుంటూ అంటున్నాడు రాజు.

"ఒక ప్రాణమున్న మనిషిని చంపటం... ఒక ఈగనీ దోమనీ నల్లినీ పిల్లినీ చంపినట్లు... ఎంతో హీనమైన పని. చెప్పాలంటే పరమ జుగుప్సాకరమైన వ్యవహారం. కానీ వ్యవహారం... చట్టబద్ధంగా ప్రభుత్వమూ చేస్తుంది. త్రీనాట్‌టూ అన్చెప్పి చట్టవ్యతిరేకంగా ప్రభుత్వాలనేలే అనేకమంది... చివరకు ముఖ్యమంత్రులు కూడా చేస్తున్నారు. ఇన్ని క్రిమినల్ రికార్డులున్న మనుషులు... తెల్లారేసరికి మనిషి రక్తం ఓ గ్లాసుడు రుచి చూడందే మంచం దిగనివాళ్లు మనకి పాలకులుగా చెలామణీ కావటం అంత ఆశ్చర్యం కాదుగానీ వాళ్లని మనం ఆమోదించటం, ఓట్లేయటం అసలు ఆశ్చర్యకరమైన విషయం. కాబట్టి నేనిలా అంటుంటే మీకు ఎంతో ఆశ్చర్యంగా ఉండొచ్చు. అది సహజం.

ప్రాణ రక్షణకోసం ఎంతకైనా తెగించమనీ... తెగించితే తప్పులేదని న్యాయశాస్త్రం ఘోషిస్తోంది. లక్ష్మి ప్రాణం పోకముందే నేనీ సలహా ఇస్తున్నాను. ఎటూ తర్వాత మీరంతా అదే అభిప్రాయానికి వస్తారు.. అంతా అయ్యాక. అందుకే ఇప్పుడు మీకు నేను చెప్పింది కటువుగా... హీనంగా కనపడుతుంది'' ఊపిరి వేగంగా పీల్చుకొంటూ ఆగాడు.

కానీ రాజూ... అంటున్నాడు నరహరిగారు.

"స్పష్టంగా మనకు తేలిపోయిందికదా!

లక్ష్మి వేళ్లు నరికేశాడు. ఇతన్ని పొడిచాడు. అసలు ఒక ఆడదాన్ని ఇంత భయంకరంగా హింసించే భర్త నాకు తెల్సి ఎంత శాడిస్టుల్లో నూ లేడు. వాడు నిజంగా పశువుల్లో... కాదు రాక్షసుల్లోనే పెద్ద రాక్షసుడు. ఏ క్షణాన్నయినా లక్ష్మి... అవును నేను మీకు రాసిస్తాను. ఇంతదాకా ఇది మీరు పట్టించుకోలేదు... మనం దించి వెళ్లేలోపే కావచ్చు. ఏ మూల నుండి అయినా వాడు కత్తితో దూకుతాడు. మనం కదిలేలోపు కళ్లు తెరిచేలోపు... నాలుగైదు పోట్లు అంతే. ప్రపంచంలో ఎవడూ ఆపలేడు. మీ మహామహా రాజ్యాలూ, పాలకులూ, న్యాయమూర్తులూ. అది జరగబోతున్న సంఘటన"

"ఇప్పుడు చెప్పండి... ఆ ఇన్సిడెంట్ జరక్కుండా ఏ పద్ధతులు ఉన్నాయి. ఏం చేస్తే ఈమె బతుకుతుంది'' ఆగ్రహంతో ఒగరుస్తున్నాడు రాజు. అతడంత ఎమోషనల్గా ఎప్పుడూ లేడు. ఎంత క్లిష్టమయిన పరిస్థితిని అయినా ఎంతో ఆలోచనతో నిగ్రహంతో ఎదుర్కొనే అతను ఆ క్షణాన ఉన్మత్తుడిలా అగుపిస్తున్నాడు.

ఎవరూ మాట్లాడలేకపోయారు. ఏముందని అసలు మాట్లాడేందుకు. శరత్ రాజు దగ్గరకు సంకోచంతో జరిగి అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. రాజు ఊపిరితిత్తులు ఎగిసిపడుతున్నాయి.

చీకటిలో వెచ్చని స్పర్శ. రాజు చేతిలో నలిగిపోతున్న శరత్ వేళ్లు... అందరూ నుంచుండిపోయారు.

కొంచెం తేరుకుని చేతులు విదుల్చుకొని మొహం తుడుచుకున్నాడు రాజు. ఇంకా గొంతు వణుకుతూనే ఉంది.

"అందుకే' అన్నాడు... ఉమ్మేసి... ముక్కు చీదుకొని.

"ఈసారి ఏమాత్రం అవకాశం దొరికినా... చంపెయ్యి''

"ఊరుకో రాజూ... ఏంటీ పిచ్చి మాటలు'' నరహరిగారు మందలించారు.

"పిచ్చా? ఏంటి పిచ్చి? మీకు లక్ష్మిని బతికించుకోవాలని ఉందా? లేదా?" అరిచాడు రాజు. అతడు దాదాపుగా వెక్కుతున్నాడు.

"బాబూ!" లక్ష్మి భోరున ఏడుస్తోంది, రాజుని ఆపేందుకు ప్రయత్నిస్తూ, శరత్కు కళ్లు చెమర్చాయి. గొంతులో ఏదో ఇరుక్కున్న ఇబ్బంది. ఏమీ మాట్లాడలేకపోయాడు. ఇదే మొదటిసారి ఇలాంటివి చూడటం.

కోటీ దాసూ గుసగుసగా ఏదో చెప్పుకుంటున్నారు.

పది నిముషాలు ..

రాజు తేరుకున్నాడు...

"పదండి''

రోడ్డున పోయేవాళ్లు వింతగా చూస్తూ వెళ్లిపోయారు.

పావుగంట నిశ్శబ్దంగా నడిచాక రైల్వే స్టేషనొచ్చింది. ఫ్లాట్ఫారం మీద లక్ష్మి బంధువులు కలిశారు. వాళ్లు అన్నాలు తెచ్చినట్టున్నారు. చిన్న మూటలున్నాయి.

"వస్తావమ్మా''

అందరూ తలూపి వెను తిరిగారు. రాజు సైలెంట్గా ఉండిపోయాడు. శరత్ ఇంకా అతడి మొహాన్నే అప్పుడప్పుడు చూస్తున్నాడు. తన జీవితంలో మొదటిసారిగా ఏమీకాని ఒక సామాన్యురాలి కోసం కన్నీరు పెట్టిన ఆ యువకుడు... అతని కోసం చెమర్చిన తన కళ్లు.

ఇదేం స్పర్శ? ఇదేమీ ఆర్ద్రత?

హ్యూమన్ టచ్ అంటే ఇదేనా?

శరీరమంతా ముద్దముద్దయినట్లుగా వణుకుతున్నాడు అతడు.

మెయిన్రోడ్ వచ్చాక అన్నాడు దాసు...

"అన్నా మనం కొంచెం తినిపోతే... ఏదయినా హెూటల్లో' రాజు తలూపాడు.

"ఎందుకూ'' అభ్యంతరం చెప్పారు నరహరిగారు.




"మా ఇంటికి పదండి. అందరం కలిసి తినొచ్చు''

"వద్దులే సార్... మీకూ ఇబ్బంది'' కోటి అన్నాడు.

"ఊహూఁ! అదేంలేదు. పదండయ్యా..." బలవంతపెట్టారు.

మెయిన్‌రోడ్ దిగి నాలుగైదు సందులు తిరిగారు.

చుట్టూ చెట్లూ, చిన్న డాబా ఇల్లు..

ఇనుపగేటు చిన్నది తీసి తలుపుకొట్టాడు దాసు.

"వస్తున్నా'' ఎవరిదో గొంతు.

అందరూ ముందుగదిలోకి చేరారు. శరత్ పరిశీలనగా చూశాడు. నాలుగైదు కుర్చీలు, సాదాసీదా గది. అయితే రెండు అలమరాలున్నాయి. వాటి నిండా పుస్తకాలు, రకరకాల అంశాల మీద సాహిత్యం నుండీ చరిత్ర వరకూ, ఫిలాసఫీనుండి సైకాలజీ వరకూ. అయితే దగ్గరకు వెళ్లి పరిశీలించే అవకాశం దొరకలేదు. మొహమాటం కొద్దీ ఆగిపోయాడు.

పుస్తకాలనే చూస్తున్న శరత్‌ని ప్రశ్నార్థకంగా చూశారు నరహరి.

కోటి పరిచయం చేశాడు.

"మంచిది బాబూ... సంతోషం. మీ ఇంజనీరింగ్ కుర్రవాళ్లు... ఇదివరకు అన్నిట్లో ముందుండి లీడ్ చేసేవాళ్లు. రాను రాను ఎంచేతనో తగ్గిపోతోంది వాళ్ల స్పందన. మీ బ్యాచ్‌లో కొద్దిగా వ్యక్తులు కలుస్తున్నారుగానీ చాలా మెజారిటీ ఏ మూవ్‌మెంటు అయినా దూరంగానే ఉండిపోతున్నారు. ఏం రాజు?"

రాజు తలూపాడు.

"మనం క్యాపిటేషన్ ఫీజుకి వ్యతిరేకంగా ఫైట్ చేశాంకదా! ఇంక కాంపిటేటివ్ ఎగ్జామ్స్ వచ్చాయి. ఏ జాబ్‌కు పోవాలన్నా, ఏ పీజీ కోర్స్ చేయాలన్నా చచ్చేంత పోటీ ఉంది. అదీగాక... ఐదేళ్ల ఇంజనీరింగ్ కోర్స్‌ని నాలుగేళ్లు చేశాక వీళ్లమీద స్ట్రెస్ పెరిగిపోయింది'' చెప్పుకుపోయాడు.

కొద్దిసేపటికి లోపలి నుండి ఓ యువతి వచ్చింది.

"రండి నాన్నా'' అంటూ ఇంతకుముందే తెలుసు కాబోలు రాజునీ, అందర్నీ పలకరించింది.

లోపల డైనింగ్ టేబుల్‌మీద అన్నం, ఓ ఆవకాయజాడీ, పప్పూ ఉన్నాయి. నరహరిగారే పళ్లాలు కడిగి తెచ్చారు. ఎవరికి వాళ్లు వడ్డించుకొని తినటం ప్రారంభించారు... ఆకలితో.



రాత్రి పన్నెండు కావొస్తుండగా నరహరి ఇంటినుంచి యూనివర్సిటీ దారిలో నడుస్తున్నారువాళ్లు.

కోటీ, దాసూ ఏవో కబుర్లు చెప్పుకొంటున్నారు. తల వంచుకొని నడుస్తున్న రాజు... పక్కన శరత్. వీధిలైట్లకింద తారురోడ్డు మెరుస్తోంది. నిర్మానుష్యం. లైటు కిందనుంచి నడిచేప్పుడు పొడవుగా పడిన నీడ తగ్గితగ్గి కాళ్లకింద దాక్కుని ముందుకిపోయి దారి చూపిస్తోందా అన్నట్టు కదలాడుతోంది.

శరత్ అప్పుడప్పుడూ రాజుమొహంలోకి చూస్తున్నాడు. అతడిలో ఏఏ గోళాలు, ఏఏ ప్రవాహాలు పరిభ్రమిస్తున్నాయి?

"బాగా మాట్లాడారు మీరు'' అన్నాడు శరత్ ఏమీ తోచక.

"ఊఁ!"

"పాపం లక్ష్మి"

తల ఊపాడు రాజు. కాసేపు మాటల్లేవు.

"నీకేమనిపించింది శరత్' అడిగాడు హఠాత్తుగా.

ఏమీ తోచలేదు. రాజు దగ్గర దాచేదే ముందని.

"ఏంటో అర్థమయ్యీ కానట్లుగా ఉంది. నేను ఇంతకాలం ఉన్న ఈ సమాజంలో ఇన్ని జరుగుతాయని నాకు తెలీదు. నేను ఈ వాస్తవాల్ని... అన్వయించుకోలేకపోతున్నాను. అవును... వీటినెట్లా స్వీకరించాలో... ఏం చేయాలో అయోమయం. మీరు అదృష్టవంతులు..."

"దేనికి" అన్నాడు ఆశ్చర్యంగా రాజు

"మీకంతా తెలుసు..."

"భలేవాడివి. ఎవరికి తెలిసిందయినా సగమే... అలా అనుకోకు. కొద్దిగా ప్రారంభించామని మాకు తెలుసు. కానది ఎటు దారి తీస్తుందో? అయినా చూస్తూనే ఉన్నావుగా. లక్ష్మి విషయంలో... అందరం దిష్టిబొమ్మల్లా... అయితే ఈ మాత్రం చేయగలిగామన్నది... ఎక్స్‌పోజ్ చేశాం అన్నది... ఓ తృప్తి. అందరం నిస్సహాయులం"

మాటల్లోనే వచ్చేశారు. శరత్‌ని దించిపోయేందుకు రాజూ, కోటీ వచ్చారు. కోటి రాజు రూంలోనే పడుకుంటాననటంతో... వాళ్లు వెనక్కి తిరుగుతుండగా బుర్రవేడెక్కి పుస్తకాలు మూసి కిందకొచ్చిన వంశీ...

శరత్‌ను తీక్షణంగా చూశాడు.

★ ★ ★

వంశీకృష్ణ సరిగ్గా మాట్లాడకపోవటంతో విచారం పట్టుకొంది.

తనేం చేశాడని?

రాజు వాళ్లతో కలిసి మీటింగ్‌కు వెళ్ళాడంతేగా. పైగా అదే చివరిసారని అనుకొని ఏదో తప్పక వెళ్ళాడు. అక్కడ లక్ష్మి కేసూ... విద్యార్థుల ఎమోషన్స్ తనని ఆకర్షించిన మాట వాస్తవం. తనకు తెలీని ప్రపంచం కళ్లముందు ఆవిష్కరించబడటం. వంశీ చెప్పినట్లుకాక రాజులో ఏదో నిజాయితీ ఉంది. అదే ఆకర్షించింది ముఖ్యంగా.

అయినా తన కెరీర్ మాటేమిటి?

క్షమాపణ అడగాలి వంశీని

సారీ వంశీ. నువ్వు చెప్పింది నిజంగా ఇప్పుడే అర్థమయింది. ఇవ్వాళ్టినుంచీ అన్నీ బంద్. కోటీ లేదు, రమణా లేదు, రాజూ లేదు, అర్జున్ లేదు, ఇర్ఫాన్ లేదు, శ్రీధర్ లేదు, శశీ లేదు.

ఇంకెవరు...

మాధురి.

మాధురి లేదా?

వద్దు. పాపం మాధురిని ఉంచాలి. యూ ఆరేన్ ఎక్సెప్షెన్ మధూ... ఎక్సెప్షనల్ కేస్ నీది.

రెండురోజుల గజిబిజి ఆలోచనల్లో కోటిని తప్పించుకొని తిరుగాడి సాయంత్రం పూట హాస్టల్ మెట్లెక్కుతున్నాడు. పై మెట్ల వరసలో వంశీ గొంతు వినపడుతోంది. అతడు ఆగిపోయాడు.

"నీలాగా నేనెక్కడ చదువుతాన్రా. సిగిరెట్లూ, సినిమాలూ... పెట్టి పుట్టాలి దేనికయినా"

వంశీ గొంతులో కూడా అసంతృప్తి. తననుకున్నది అనుకున్నట్టు జరగటం లేదని. అయితే తనూ బాధితుడేనన్నమాట. తనకో రకమయిన డైవర్షన్‌లు వస్తే అతని కొకరకం. కానీ అతడు కంట్రోల్ చేసుకోగలడని తనకు తెలుసు.

"ఎక్కడరా... నాతో అట్లానే వాగుతుంటావు" ఆ గొంతు రవికుమార్‌ది. వంశీకి గట్టిపోటీదారుడు.

"ముయ్... ఇవాళ ప్రవీణ్‌గాడితో సినిమా ప్రోగ్రాం. వద్దురా బామ్మర్దీ అంటే వినిఛస్తాడా. వాడికేదో డబ్బు అందినట్టుంది. ఇంక అయిపోకముందే... నన్ను"





"ఏం సినిమా..."

"ఏదో ఒకటి ఫస్ట్‌షో"

వింటున్న శరత్‌కి మెరుపులాగా ఆలోచన తట్టింది. వంశీకి కనపడకుండా పక్కకు తిరిగి తన రూంకుపోయి మొహం కడుక్కుని కాసేపాగి ప్రవీణ్ రూంకు వెళ్ళాడు. వంశీ లేడు కాబోలు అతడి రూం లాక్ చేసివుంది. డోర్ కొట్టి పిలిచాడు.

"ప్రవీణ్"

అతడొచ్చాడు. కాసేపు పిచ్చాపాటీ మాట్లాడి...

"నేనూ ఇవాళ సినిమా ప్రోగ్రాం అనుకున్నా. రమణ కదలటంలేదు. ఒక్కడినే వెళ్లాలంటే బోర్' అన్నాడు.

"అలా అయితే మాతో జాయిన్ అవ్వు. వంశీ, నేనూ పోతున్నాం"

"సరే... వెళ్లేప్పుడు పిలవండి"

వచ్చి రూంలో కూర్చున్నాడు. సినిమాకు పోయి వచ్చేలోపు వంశీతో ఎలాగయినా మాటలు పెంచి మంచి చేసుకోవాలని అతడి ఉద్దేశం. తనపై అపార్థాలు తొలిగిపోతాయి. తన ఎక్స్‌ప్లనేషన్ వింటే.

కొంతసేపటికి ప్రవీణ్ వచ్చి పిలిచాడు.

ఇద్దరూ హాస్టలు బయటకు వచ్చేసరికి అక్కడ... వంశీ శరత్‌నుచూసి అయిష్టంగా తల తిప్పుకున్నాడు. వీడెక్కడ దాపురించాడా అన్నట్లు. అతడికింతవరకూ తెలిసినట్లు లేదు శరత్ వస్తున్నట్టు.

ముగ్గురూ ఆటోలో.

ఆ థియేటర్ మెయిన్ రోడ్డునుంచీ అర కిలో మీటరు లోపలకు ఉంది. దారిలో శ్మశానం, పిచ్చి చెట్లతో ఖాళీస్థలాలూ, కొంత రిమోట్‌గానే ఉంది. ఆటోలో పోవటం మంచిదయింది.

ప్రవీణ్‌కు నచ్చిన ఆ సినిమా ఈ ఒక్క థియేటర్‌లోనే ఆడుతోందట. నటశూన్యులే అందరూ.

ఇంటర్వెల్‌దాకా మూతి బిగించుకొని కూర్చున్నాడు వంశీ. వెనకాల కూర్చున్నవాళ్లెవరో ఇద్దరు... హీరోయిన్ కనపడినప్పుడెల్లా ఈలలు వేస్తూ, నోటితోనే మానభంగం చేస్తూ... న్యూసెన్స్‌గా ఉంటే.. వెనక్కి తిరిగి కోపంగా వాళ్లని చూసి... వాళ్లు క్రూరంగా కళ్ళెగరేస్తే భయపడి... ఆ టెన్షన్‌లో ఏదేదో చెప్పబోయి... ఎట్టకేలకు శరత్‌ని పలకరించాడు.

ఆ మాత్రానికే సంతోషించిన శరత్ కూల్ డ్రింక్స్ కొనితెచ్చాడు తనే.

'సైలెన్స్ ప్లీజ్' స్లైడ్ వచ్చేలోపు దీనంగా చూస్తున్న అతడిమీద జాలిపడి ఇలా అన్నాడు వంశీ.

"చూడు శరత్! నీమీద నాకేదో కోపం ఉందని... అనుకుంటున్నావా?"

తల అడ్డంగా తిప్పాడు శరత్ 'లేద'న్నట్లు.

"కేవలం నీమీద... ఎట్లా చెప్పటం... సానుభూతి. కొంత అభిమానం... లేకపోతే నిన్ను పట్టించుకోవాల్సిన అవసరం నాకేంటి? నీకు తెలుసుగా నేనెంత..."

"అవునవును... అయామ్ గ్రేట్‌ఫుల్ టు యూ"

"మనం... ఏదో మధ్యతరగతినుంచి కిందామీదా పడుతూ అమ్మానాన్నల రెక్కల కష్టంమీద ఇక్కడిదాకా వచ్చాం. మనకా వాళ్లలాగా కోటాలూ లేవు... వీళ్లలాగా ఆస్తులూ వాటాలూ లేవు. మనం మనం సాయంచేసుకుంటూ... మనలో కిందున్నవాడిని పైకి లాగకపోతే వాళ్లంతా ఎలాగో బాగుపడి ఛస్తారు. మనమే దిక్కుమాలినట్టు చెడతాం.

ఎందుకు చెప్పు ఆ గొడవలు. రాజయినా జ్ఞానేశ్వర్రావయినా ఓల్గా అయినా గంగయినా... ఒడ్డునుంచి చూసి ఆనందించు. లోతు తెలీకుండా కాలు పెట్టావా? పీకల్దాకా మునిగిపోతావు"

"ఐకెన్ అండర్‌స్టాండ్. కుర్రతనంలో... రక్తం వేడిగా ఉరుకులెత్తుతుంది. ఏంక్సైటీ ఉంటుంది. ఐ ఎప్రిషియేట్ దట్ యాంక్సైటీ. కానీ... దానికి కొంచెం ఆలోచన జోడిస్తే నువ్వు సొసైటీకి ఏదయినా చెయ్యాలను కుంటే యూకెన్ డూ ఇట్ ఇన్ ఎ బెటర్‌వే... ఏదయినా మంచి ఉద్యోగం... పొజిషన్‌లో ఉండి పదిమందికి చదువు చెప్పించు. లేదూ... మనలో అవకాశాలు లేని జెమ్స్ ఎంతమందో... వాళ్లకి చెయ్యి అందించు''

ఉత్సుకతతో భక్తితో విన్నాడు శరత్.

తననుకున్నంత తెలీనివాడుకాదనీ... వంశీ మంచి మేథావి అని అన్పించింది. అతడిపై గౌరవానికి తోడు భక్తి కలిగింది.

భక్తి... అతడు ఆలోచించిన తీరుపై...

ప్రవీణ్ సినిమాహాల్లో నలుదిక్కులా చూస్తున్నాడు. అతడి దృష్టి... కలర్స్‌కోసం వెతుకుతూంది. రంగురంగుల చీరెలా... జాకెట్లా... మిడ్డీలా... ఓణీలా అన్నది కాదు ప్రశ్న. ఆయా దుస్తులు ధరించిన శరీరాలు.

"ఒరే బావా! అదిగో ఆ మూల, జాకెట్టు ఉందంటావా?" అన్నాడు వంశీని వేలుతో పొడిచి.

"ఎక్కడా?" అన్నాడు వంశీ శరత్‌తో సంభాషణ ఆపి.

"వంటిమీద"

అతడికి కాసేపు అర్థంకాలేదు. తర్వాత ఆదిక్కు చూసి ప్రవీణ్‌ని చీవాట్లు పెట్టాడు.

"ఏంట్రా ఇవ్వాళ రెచ్చిపోతున్నావ్?"

"ఎప్పుడూ చదువేనా... అప్పుడప్పుడూ..." అన్నాడు కన్నుకొట్టి.

శరత్‌కూ కొత్తగానే ఉంది. ప్రవీణ్ ప్రవర్తన, ఏంటో క్లాస్‌లో ఫస్టురాంకర్ ప్రవీణ్‌కూ ఇక్కడీ సినిమాహాల్లో ప్రవీణ్‌కీ పోలికలేదు. ఒకదాంట్లో శిఖరమ్మీద ఉన్నవాడు ఇంకో దాంట్లో పాతాళంలో ఉంటాడా?





"తెలీనిచోట ఏం ప్రతాపం చూపిస్తావులే' అన్నాడు వంశీ నవ్వి.

"షేమ్... అవమానిస్తున్నావు''

"నీ ప్రతాపం మీ డిపార్ట్‌మెంట్‌లో చూపియ్యి''

"ఎక్కడబ్బా... మా క్లాసులో ముగ్గురేగా అమ్మాయిలు. ఆల్రెడీ..." శరత్‌ను చూసి ఆగాడు.

వంశీలో ఆసక్తి జనించింది. "చెప్పు'' అన్నాడు.

"మనోడూ..." అన్నాడు శరత్‌ని చూపించి ప్రవీణ్.

"ఆహా... మనోడే.. మాధురి అని... మంచి ఫిజిక్... సారీ శరత్... జస్ట్ ఫ్రెండ్లీగా..."

వంశీ మొహంలో ఆశ్చర్యం కాదది... అశాంతి. ఎవరూ గమనించకముందే... నవ్వు అతికించుకొన్నాడు.

"అయితే... పర్లేదు. అప్పుడే మెయింటెయిన్ చేస్తున్నాడు''

శరత్‌కు కష్టమేసింది. ఇంత చీదరగా మాట్లాడుతాడా వంశీ అన్న అపనమ్మకంవల్లే ఇంకా వాళ్లనేమీ అన్లేక మౌనంగా కూర్చున్నాడు. ఇందాకటివరకూ వంశీ మాట్లాడిందానికి... ఇప్పుడు గౌరవం పోతోంది.

ఆలోచనలోనే సినిమా ముగిసింది.

వంశీ సీరియస్‌గా బయటకు నడిచాడు.

"బావగాడికి... బుర్రచెడగొట్టా..." ప్రవీణ్ వెనకాల గుసగుసగా అంటున్నాడు సంతోషంగా.

గేటు దాటివచ్చారు. చీకటి రోడ్డులో జనం నడిచిపోతున్న అలికిడి.

"ఆటోలు మెయిన్‌రోడ్డుమీదే దొరుకుతయ్'' ప్రవీణ్ అన్నాడు.

"అరకిలోమీటరు... నడువ్... తప్పుద్దా'' వంశీ విసుక్కున్నాడు.

ముందు వంశీ వెనక ఇద్దరూ. అప్పటికే జనం వెళ్లిపోయినట్టుంది. కొద్దిదూరంవరకూ

నిర్మానుష్యంగా అవతల అలికిడిగా ఉంది. నెమ్మదిగానే నడుస్తున్నారు.

సినిమా హాలు వెలుతురు తగ్గిపోయి స్మశానం దగ్గరకొచ్చేసరికి మరింత చీకటిగా ఉంది. వెనకాల ఎవరో వడివడిగా అనుసరిస్తున్న చప్పుడు. అడుగుల శబ్దం.

శరత్ తల తిప్పి చూశాడు.

ఓ స్త్రీ హడావిడిగా వస్తోంది. ఆమెకు ఇంకా వెనకాల ఆమెని అనుసరిస్తున్న రెండు ఆకారాలు లీలగా... కన్పిస్తున్నాయి.

"శరత్..." అన్నాడు ప్రవీణ్ ఆందోళనగా.

వాళ్లామెని ఫాలో చేస్తున్నారు అన్నది స్పష్టమే... కానీ...

ఇంకొద్ది దూరం నడిచేసరికి ఆమె దాదాపు చాలా వేగంగా నడిచి శరత్ వాళ్ల దగ్గరకు వచ్చేసింది. ఆమె... ఇందాక ప్రవీణ్ కామెంట్ చేసిన స్త్రీ. మల్లెపూలూ... జాకెట్టూ... చూస్తుండగానే...

ఆమె తమను దాటి ముందుకెళ్లిపోతోంది. ఇంకో రెణ్నిమిషాలు నడిస్తే... అవతల జనావాసాలూ... మనుష్యులూ కన్పిస్తారు. అంతలోనే శరత్‌ను రాసుకొంటూ ఆమెవైపు నడిచారు ఆ ఇద్దరు ఆగంతకులు. వాళ్లిందాకా శరత్‌వాళ్ల వెనుక సీట్లో అల్లరి చేసినవాళ్లు. మొరటుగా, లావుగా ఉన్నారు.

కాలిబాటమీద చరచరా నడుస్తున్న చప్పుళ్లు.

ఇంకో పదడుగులు వేసిందా స్త్రీ. ఉన్నట్టుండి ఒక్కసారిగా పరుగందుకొంది. ఓ వందడుగులు దాటితే... సేఫ్‌గా ఉండొచ్చని కాబోలు. అంతదాకా సంశయిస్తూ అనుసరిస్తున్న ఆ ఇద్దరూ

ఆమె పరిగెత్తటం చూసి వాళ్లూ పరుగందుకున్నారు. ఇంకో పదడుగులు దాటేలోపే ఆమెని పట్టుకున్నారు. కెవ్వున అరుపులు. నోరు నొక్కుతున్న చప్పుడు. గిజగిజా కొట్టుకుంటున్న ఆమెని ఆ ఇద్దరూ మోసుకుంటూ పక్కనే తుప్పల్లోకి లాక్కెళ్తున్నారు. తుప్పల్లో కీచుమన్న పురుగులు నిశ్శబ్దం వహించాయి. పుల్లలు విరుగుతున్న శబ్దం... కొమ్మలు రాసుకొంటున్న అలికిడి...

షాక్‌లో ఉన్నారు శరత్, ప్రవీణ్‌లు. కళ్ల ముందే ఒక స్త్రీని అదీ... పదడుగుల దూరంలో... బలాత్కారంగా ఎత్తుకుపోవటం... ఇప్పుడేం చేయాలి? ఏం చెయ్యాలో ప్రపంచంలో ఏ పాఠ్యగ్రంథమూ బోధించదు. ఏ ప్రవక్తా సూత్రీకరించడు. ఏం చేయాలి?

అయోమయంగా... నిలబడిపోయినవాళ్లు...

ఒక్క నిముషం...

వంశీ వెనక్కి చూసి ఏదో నిర్ణయానికొచ్చి పరుగందుకొన్నాడు. ఆ ఇద్దరూ ఆమెని లాక్కెళ్లిన వైపుగా రోడ్డుపక్క తుప్పల్లోకి దూకి మాయమయ్యాడు.

"బావా..." ఆపబోయాడు ప్రవీణ్. అప్పటికే లేటయింది.

"ఏం చేద్దాం" శరత్‌కు టెన్షన్‌తో చెమటలు పట్టాయి. టార్జాన్ తర్వాత ఇదే ఇంకోసారీ దౌర్జన్యాన్ని చూడటం.

పది సెకన్లు.

ఓ నిర్ణయానికొచ్చి "పద... వంశీకి సహాయం లేకపోతే... వాళ్లేదయినా... ఆమె సంగతలా ఉంచి వంశీ డేంజర్‌లో ఇరుక్కుంటాడు''

రోడ్డు దిగాడు శరత్.

ప్రవీణ్ అటూ ఇటూ చూసి ఓ కర్రపుల్లా, బండరాయీ తెచ్చాడు. తుప్పలూ పొదలూ... వాళ్లెటుపోయారో సరిగ్గా తెలీటంలేదు. బాగా లోపలికి ఈడ్చుకుపోయారా?

ఇప్పటికే వంశీకేదయినా జరగలేదుకదా? చెవులు రిక్కించి అటూ ఇటూ చూస్తూ... నడుస్తున్నారు. ఓ వందడుగులు.

అవతలగా ముక్కుతున్న శబ్దం... వంశీ గొంతు కాదు. ఊపిరి పీల్చుకొని ప్రవీణ్‌ను

హెచ్చరికగా చూసి... నిశ్శబ్దంగా అడుగులు ఎత్తి వేస్తూ సమీపించాడు.

ఆ తుమ్మచెట్టు... కవతల...

ఆమెని నేలమీదకు నొక్కుతున్నాడొకడు. చేతులు రెండూ వంచుతూ... వెల్లకిలా... గిలగిలా కొట్టుకొంటోంది. ముక్కుతూ ఉంది. రెండోవాడు... ఆమె కాళ్లు తొక్కిపట్టి...

అదికాదు... శరత్ చూస్తున్నది...

అక్కడ వంశీ...

వంశీ...

వంశీ ఆమె నోరు నొక్కుతున్నాడు. తన కర్చీఫ్ తీస్తూ...

"శరత్" అన్నాడు ప్రవీణ్ భయంగా.

నమ్మిన నేల చీలి... జారిపోయే క్షణాన్న ఆకాశంనుంచి జారిపడిన పిడుగు మెదడు మీద పడి... విస్ఫోటనం జరిగి...

శరత్ విరుచుకుపడిపోయాడు.

★ ★ ★

ఆటో హాస్టల్ మెట్లముందుదాకా వచ్చి ఆగింది.

ప్రవీణ్ వెళ్లి రమణను పిలుచుకు వచ్చాడు. రమణ కంగారుపడి పరిగెత్తుకొచ్చాడు. ఇద్దరూ కలిసి...

శరత్‌ను రూంకు మోసుకువెళ్లారు.

"ఏంటిదీ? ఎప్పుడూ లేనిది?"

ప్రవీణ్ మాట్లాడలేదు.

దుప్పటి కప్పి పక్కనే కూర్చున్నాడు రమణ. శరత్ మొహం పాలిపోయివుంది. పెదవులు ఎండిపోయి, దీర్ఘంగా శ్వాస ఆడుతోంది.

"మా రూంలో వాటర్ జగ్ ఉంది తీసుకురా" అన్నాడు రమణ.

ప్రవీణ్ జగ్ అందించి...

"నేను... వస్తా" అనేసి వెళ్లిపోయాడు.

సినిమా చూసి వస్తూ కళ్లు తిరిగి పడిపోయాడా? అంత బలహీనంగా కన్పించడే శరత్!? పైగా బ్యాక్‌గ్రౌండ్ పల్లెటూరు. కనుక కొంత నయంగానే ఉంటాడు తమకన్నా.

పన్నెండుకి శ్రీనివాస్ వచ్చాడు. మత్తులో ఉన్నాడు.

"ఏ... మయింది" అడిగాడు.

'నీ బొంద' అనుకుని "నథింగ్. కొంచెం ఫీవర్ కాబోలు" అన్నాడు వీడితో నసెక్కడ భరిస్తాం అని.

"గాడ్ బ్లెస్... శరత్"

కాసేపటికి ముసుగు తన్ని పడుకున్నాడు శ్రీనివాస్.

రమణ వెళ్లి కోటిని పిల్చుకొచ్చాడు.

"నువ్వెళ్లు నేను కూర్చుంటా" అని రమణను పంపించాడు కోటి. రూం గడిపెట్టి, లైటు తీసి, ఫ్యాన్ ఐదులోపెట్టి, కుర్చీమీద కూచుని చూస్తున్నాడు చిరుచీకటిలోనే. కిటికీలోంచి వెన్నెల పలకనేలమీద పడుతోంది. అప్పుడప్పుడు దుప్పటికింద ఉలిక్కిపడుతున్న శరత్ దేహం...

తెల్లారుతుండగా... కళ్లు తెరిచాడు శరత్.

ఇంకా భయం...గా... చూస్తున్నాడు.

"నేను కోటిని..." అతడిని కదిపాడు కోటి.

మెల్లగా స్పృహలోకొచ్చి నిశ్శబ్దంగా కోటి మొహంలోకి చూస్తున్నాడు. అతడి తలమీద చేయివేసి దగ్గరకు జరిగాడు కుర్చీలోంచి.

బుగ్గమీదుగా... జారుతున్న వెచ్చని... తడి.

★ ★ ★

డాక్టర్ దగ్గరకు వెళ్దామని బలవంతపెట్టినా శరత్ ఒప్పుకోలేదు. మందలించి ఊరుకున్నాడు రమణ.

"మెస్‌దాకా పద. ఏమయినా పడితే నీరసం తగ్గుతుంది. అందుకే కళ్లు తిరిగుంటాయి"

రమణ సాయంతో మెస్‌దాకా నడిచివెళ్లాడు నెమ్మదిగా.

ఇడ్లీ... వడ...సాంబారు.






ఒక ఇడ్లీతిని ఇక సయించక వదిలేశాడు.

"ఇట్లా అయితే..." తిట్టాడు రమణ.

తిరిగొచ్చి మంచంమీద పడుకొని "క్లా సుకు వెళ్లవూ'' అన్నాడు.

"ఏంవంక చెప్దామా అని చూస్తోంది భౌతి కకాయం. ఇవాళ నువ్వు దొరికావు. సో... హాలీడే''

నవ్వుకొన్నారు.

"ఉండు ఈ భౌతికకాయానికి స్నానం చేయించి వస్తా''

రమణ వెళ్లిన పావుగంటకి కోటి వచ్చాడు. తేటగా కనపడుతున్న శరత్‌ను చూసి ఊపిరి పీల్చుకొని.

"పర్లేదుగా'' అన్నాడు.

"పనుంటే వెళ్లు. బానే ఉందిప్పుడు'' అన్నాడు శరత్.

"ఆс! అదే. రాజు దగ్గరకి అర్జెంట్' సంజాయిషీగా గొంతు.

"అట్లనే... ఏంటి అర్జెంట్'

"ఆరోజు... లక్ష్మి''

"ఆс! ఆс! చెప్పు ఏమయింది'' లేచి కూర్చున్నాడు.

"ఆమె..."

"ఊс! వాట్ హాపెండ్?"

"పొడిచి చంపేశాడట వాడు''

శరత్ వెనక్కి వాలిపోయాడు. మగతలోకి.

"అర్రే..."

"ఏం వాగావురా కోటీ..." రమణ మంద లించాడు వెనకనుండీ.

"అసలే బాలేదుకదా! బుర్ర లేదూ..."

"సారీ... సారీ... అబ్బ ఏంటో నాకీ బుర్ర పంజేయటంలేదు. పొద్దుట్నించీ''

"సరే... నువ్వు పోయి... ఎవరయినా.. ఊc ఎలా ఎవరొస్తారు. ఆటో తీసుకొస్తే మనం తీసుకుపోదాం. డాక్టర్ దగ్గరకి''

కోటి వెళ్లిపోయాడు హడావిడిగా.

★ ★ ★

"ఇక్కడ చూసేవాళ్లే లేనట్టుంది''

శరత్ నుదురు చూస్తున్నాడు రాజు. టెంపరేచర్ ఉంది.

"నేనూ... రమణా..." అన్నాడు కోటి.

"మా రూంలో అయితే... ఎవరో ఒకళ్లు మనవాళ్లుంటారుగా. బాలయ్యకి క్లాసుల్లేవు కూడా ఈ వారం..."

★ ★ ★

ఉదయాన్నే హడావిడిగా వచ్చాడు రాధాకృష్ణ.

శరత్ అప్పుడే లేచి బాలయ్యా సహాయంతో మొఖప్రక్షాళనం గావించి, మంచంపై దిళ్లు ఆనించి, నెమ్మదిగా కూర్చున్నాడు వాటికి చేరగిలపడి.

"రాజు రాలే ఇంకా?"

"మెస్‌వైపు వెళ్లాడు. పాలు తెద్దామని కూర్చోగానీ... ఏం ఖంగారు?"

"రాత్రి ఒక సంఘటన జరిగింది. కాంట్రవర్సీ అయ్యేట్లున్నది''

"ఏంటబ్బా అంత వివాదాస్పదం?"

"నందిత తెల్సుగా ఫైనల్ ఎమ్మే. నిన్న పదిన్నరకి హాస్టల్‌కి వెళ్ళిందట. తొమ్మిదింటికి గేట్లు మూస్తారుకదా! అయినా హాస్టల్ అమ్మాయిలు అటూ ఇటూ చేసి ఎంతలేదన్నా పదిలోపు చేరతారు. ఇంకో అరగంట లేటు. అయితే వార్డెన్ ఆపి గట్టిగా మందలించిందట. తను హర్టయ్యింది. తోడుగా వచ్చిన ఇంకో అమ్మాయీ, ఇద్దరబ్బాయిలూ వార్డెన్‌తో పోట్లాడారట. కొంత రప్చర్ అయింది. వార్డెన్ ఫోను కొట్టి ఎవర్నో పోలీసుని పిలిపించిందట. అతనూ ఏదో అన్నాడట"

"హర్టయ్యింది... రప్చరయ్యింది... అయింది. ఏంటా భాష? వివరంగా ఏడువు. నాకర్థంగాక చస్తున్నా'' బాలయ్య కోప్పడ్డాడు.

"అదండీ వీడి వరస. వీడికి తెలుగుభాషే రాదు. మరేదయినా లిపిలేని భాష అయితే గానీ ఆనదు. అదేదో కనిపెట్టాలి. మా లింగ్విస్టిక్స్ రీడర్‌ని అడిగితే ఏదోఒకటిసజెస్ట్ చేస్తాడు. నెల్రోజుల్లో నేర్చుకుని రేపిడిక్స్ టైపులో నీకు బోధిస్తాను''

"లిపిలేని భాషని చదివే మొనగాడివి నువ్వేరా ప్రపంచంలో మొట్టమొదటివాడివి. అందుకే నిన్ను'' మళ్ళీ తిట్టాడు బాలయ్య నవ్వుతూ.

ఘర్షణ ఇంకెంతసేపు జరిగేదోగానీ రాజు వచ్చాడు. ఫ్లాస్కు పట్టుకుని. తోడుగా కోటి కూడా ఉన్నాడు. అతడి చేతిలో బ్రెడ్ పాకెట్ ఉంది.

"గురూ: నీ కోసమే'' రాధాకృష్ణ అన్నాడు ఉద్వేగంగా.

"ఏంటి విషయం? రాజు ప్రశ్నార్థకంగా చూసి శరత్ పక్కన కూచుని నాడీ నుదురూ చూశాడు. టెంపరేచర్ పెద్దగా లేదు.

"టాబ్లెట్ వేసుకుందువు. ముందు కొంచెం తిను'' శరత్‌తో అంటూ అటు తిరిగాడు.

రాధాకృష్ణ వివరించాడు.

"రాత్రి పదిన్నరకి రావటమేమని అరిచిందట వార్డెన్. అయితే భాష కాస్త... నువ్వే చెప్పాలి. కాస్తో ఎక్కువో... మొత్తానికి అతిగా వాడింది. 'పక్కనే బాయ్ ఫ్రెండ్స్‌ని వెంటేసుకు తిరుగుతున్నావు. మేనర్స్‌లేదు. ఇంతగా తిరిగే దానివి హాస్టల్‌కి రావటమేం? ఎవడో ఒకడితో రూంకెళ్లకపోయావా?' అంటూ ఏదేదో అంది. నందిత షాక్ తింది. కొంతసేపటికి నందితకు తోడుగా వచ్చినవాళ్లు వార్డెన్ మీద అరిచారు. పోలీసుని పిలిచింది. అతను పోలీసు భాషలో సున్నితంగా





మందలించాడట. ఆమాత్రానికే ఏడ్చే సిందట. అట్లా ఇష్యూ పెద్దదయింది. స్టూడెంట్స్ గుమిగూడారు. పావనీవాళ్లు జోక్యం చేసుకుని సర్ది చెప్పారు. అప్పటికి ముగిసింది. కానీ పొద్దున్నే వార్డెన్ బాధితులంతా కొంతమంది బాయ్స్ కూడా కల్సి బయట సమావేశమయ్యారు. నందిత కూడా ఉంది. రాత్రి తనని ఘోరమయిన మాట వాడిందట వార్డెన్. ప్రాస్. అనో ఏదో. వార్డెన్‌తో క్షమాపణ చెప్పించాలని డిమాండు. పావనిని పిలిచారు మనవాళ్లు. మన మాధవీలత కూడా ఉంది. ఇంకొందరు లాకాలేజి వాళ్లూ చేరారు.

గొడవేమిటంటే ఈ సమస్యని డీల్ చేయటం గురించి మాధవీ, పావనీ విభేదిస్తున్నారు. పావని మండిపడుతోంది వార్డెన్ మీద. మాధవి ఒక ప్రశ్న వేస్తోంది.

"ఊc!" అన్నాడు రాజు కొంత ఊహించి.

"అసలు ఈ అమ్మాయికి రాత్రి పదిన్నరదాకా ఏం పనులుంటాయి? అదీ బాయ్ ఫ్రెండ్స్‌తో లేటుగా వెళ్లటం నందిత తప్పు గనుక..."

"అంతే మరి అడ్డమైన తిరుగుళ్లూ ఎవడు తిరగమన్నాడు'' కోపంగా అన్నాడు బాలయ్య.

రాజతడిని ఆశ్చర్యంగా చూసి "అంత కోపమెందుకు'' అన్నాడు.

"అట్ల తిరిగితే అనరామరి. ప్రాస్ ఏంటి? ఇంకేదయినా అంటారు''

"నేననేది నీ ఒపీనియన్ గురించికాదు. ఆ ఎక్స్‌ప్రెషన్ అంత అవసరం లేదని. సరేగానీ రాధా! ఇప్పుడు ఎక్కడున్నారువాళ్లు?"

"హాస్టల్ బయట లాన్‌లో ఉన్నారు. నువ్వున్నావేమో అని నేనొచ్చా''

"పద.. బాలయ్యా నువ్వూ వస్తే అక్కడ ఆలోచించుకోవచ్చు. కోటీ నువ్వు శరత్ దగ్గరుంటావా?" అన్నాడు రాజు లేచినుంచొని.

కోటి తల ఊపాడు.

"నేనూ వస్తా'' అన్నాడు శరత్ హఠాత్తుగా.

బాలయ్య నోరు తెరుచుకుంది.

"ఏంటీ? ఈ స్థితిలో... అసలు లేచి నుంచొందామనే?"

"ఆc! ఏంటంటా? బానే ఉంది నాకు. మీరే వద్దన్న కొద్దీ ఎక్కిస్తున్నారవన్నీ'' అన్నాడు శరత్ మందులూ, గ్లూకోజ్‌లను చూపిస్తూ.

"రానీలే బాలయ్యా.. శరత్ జాగ్రత్త! ఏమాత్రం స్ట్రెయిన్‌గా అన్పించినా పడుకో ఏం? నేను మనవాళ్లని తీసుకుని బస్టాపు దగ్గర గార్డెన్‌కి వస్తాను. మనవాడికి శ్రమ ఉండదుగా అక్కడయితే సరేనా''

"ఉండు గురూ'' రాధాకృష్ణ బతిమాలాడు శరత్‌ని.

"ఊcహూc" మొండిగా తలూపాడు అతడు.

"సరే తప్పుద్దా. పదవయ్యా బాలయ్యా'' రాధాకృష్ణ బాలయ్య సాయంతో శరత్‌ను లేపాడు. వాళ్లమీద కొంచెం భారంవేసి హాస్టల్ బయట వరకూ వచ్చాడు. ఇంక నడవగలనన్పించి చేతులు తీసేశాడు.

కోటి రూం లాక్ చేసి వీళ్లను కలిశాడు. ముగ్గురూ తలా ఒక ఆలోచనలో పక్కన నడుస్తుంటే శరత్‌కి గమ్మత్తుగా అన్పించింది. అందులోనూ బాలయ్య. అతడు శూన్యంలోకి కళ్లు పొడుచుకుని చూస్తున్నాడు. అక్కడేదో ఉన్నట్టు అతడు ఆగిపోయాడు చిన్నగా వాళ్లని పరీక్షిద్దామని.

ముగ్గురూ ఓ వందడుగులు వెళ్లిపోయారు.

కోటి ముందుగా గమనించినట్లుంది. తల తిప్పి ఆదుర్దాగా చూశాడు. మిగిలిన ఇద్దరూ ఆగిపోయారు ప్రశ్నార్థకంగా.

శరత్ ఒక్కడే ఊగుతూ నడిచి వాళ్లని కలిశాడు. నవ్వు మొహం చూసి వాళ్లు ఊపిరి పీల్చుకున్నారు.

"ఒకే?" రాధాకృష్ణ అడిగాడు.

"ఓకే ఏం లేదు. మీకు చుట్టూ ఏం జరుగుతోందో తెలుస్తోందా అని చిన్న టెస్టు''

"అది పట్టించుకోకు గురూ...సమాజంలో ఏం జరుగుతుందా అని తీవ్రంగా ఆలోచిస్తుంటాం కదా! చుట్టూ ఏం జరిగేదీ తెలీదు. మన బాలయ్యమరీ... వీడికి వళ్లూ పయీ తెలీదు. ఓ సారేమయిందో తెల్సా?"

"లాస్టియరు... కల్చరల్ ఫంక్షను కనుకుంటా. ఏదో పనిమీద వీడి రూంకొచ్చాను. కొంచెం సేపయ్యాక నేను మొహం కడుక్కునేప్పుడు ఏదో క్విజ్ ఉందని బై చెప్పి వెళ్లిపోయాడు. అదీ ఎట్లా తలదువ్వుకుని, ఇస్త్రీ బట్టలు వేసుకుని. ఎప్పుడూ లేంది ఏంట్రా వీడు ఇంత బుద్ధిగా మర్చిపోకుండా తయారయ్యాడూ... మామూలుగా మనోడి అవతారం తెల్సుగా నీకు. అట్లాలేదూ అని... పర్లేదు... లైన్‌లో పడ్డాడు. అనుకుంటూ రూం లాక్‌చేసి బయల్దేరాను. అప్పుడు చూద్దునుకదా!"

"ఏమయింది'' శరత్ నవ్వేందుకు తయారై ఉత్సాహంగా అడిగాడు.

"అబ్బ ఊరుకోరా'' బాలయ్య కసిరాడు.

"ఊరుకుంటాలే... చెప్పి, ఏమయిందీ అనడిగావు. వాడిగ్గాదు నాకయింది అవ్వాల్సిందంతా. వీడికోసం ఆడిటోరియం, ఇండోర్, సెమినార్‌హాలూ, ఎగ్జామ్ హాలూ ఒకటేమిటి ఎక్కడెక్కడ ప్రోగ్రాంలు జరుగుతున్నాయో అక్కడకెల్లా తిరిగి తిరిగి చచ్చాను, అదీ ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని''

"ఎందుకు?"

"ఎందుకంటే వీడు నా చెప్పు- ఒకటి వేసుకుపోయాడు. అదీ ఎట్లనుకున్నావు. వాడి స్లిప్పర్స్‌లో ఒకదాన్నొదిలి. నావేమో తోలు చెప్పులాయె. నా గుండెల్లో బాంబులు పేలినయ్''

"ఎందుకు? ఆయనొచ్చేదాకా కూచోపాయ్యావు రూంలో'' కోటి అన్నాడు నవ్వు ఆపుకుంటూ.

"భలే... అదే చేద్దును గానీ వీడి సంగతేంటి. వీడికి స్టేజీ ప్రోగ్రాం ఉంది. ఇంటర్ యూనివర్సిటీ లెవెల్లో లిటరరీ క్విజ్‌లో మనోడు మన తరపున పోటీ ఇస్తున్నాడు మరి, స్టేజీ ఎక్కి బయటివాళ్లతో వీడి చెప్పులతోనే ఎక్కేసి నిర్భయంగా కూచుని ఉంటాడని నాకు తెల్సుగా. కానీ నా సంగతట్లాకాదే..."

బాలయ్యను చేరటానికెంత కష్టపడిందీ, అతన్ని స్టేజికిందకు ఎవరూ గమనించకుండా రప్పించి చెప్పులు ఎలా మార్పించిందీ, ఈలోపు అమ్మాయిలు కంటపడినప్పుడల్లా నుంచుండిపోయి కాళ్లు కన్పించకుండా సర్కస్ ఫీట్‌లెలా చేసిందీ... రాధాకృష్ణ వర్ణిస్తున్నాడు. చెట్లచాటున దాక్కున్నాడట కొన్నిసార్లు.

శరత్ పడీపడీ నవ్వాడు. అతడి కళ్లవెంట నీరు వచ్చింది, జరిగిందంతా ఊహించుకొని.

బాలయ్య ఇదేమీ పట్టించుకోకుండా చిరాకుగా నడుస్తున్నాడు. శరత్‌కి అతనిపై అభిమానం ఇంకొంచెం పెరిగింది.

"ఇంతకీ క్విజ్ ఏమయింది?" కోటి అడిగాడు.

"ఇంకేమవుతుంది. మనోడుంటే ఎవరికీ పోదుగా. బుర్ర గట్టిదే'' పొగిడాడు బాలయ్యని.

నవ్వుతూ తుళ్లుతూ నడిచారు వాళ్లు. శరత్‌కి హఠాత్తుగా ఒక చిత్రమైన మనఃస్థితి కలిగింది. ఇంతదాకా వాళ్లెవరు? తనెవరు? అసలెలా ఎక్కడ కలిశారు? ఇప్పుడు తన భారాన్ని వీళ్లెందుకు మోస్తున్నట్టు? తనెందుకు వీళ్లతో కలిసి తిరుగుతున్నట్టు? ఎందుకిలా పగలబడి నవ్వుతున్నట్టు?

వాళ్లు కేవలం మానవతా దృష్టితో తనను ఆదుకొన్నారు. వాళ్ళేమిటో తెల్సుకుని కల్సిపోయాడు తను. అదేనేమో సంబంధం. ఈ రకమైన 'పర్సనల్ టచ్' తనకి మరెక్కడా దొరకలేదు ఎందుచేతనో. రూంమేటు శ్రీని




వాస్‌నుండీ వంశీకృష్ణదాకా. ఏదో అర్థంకాని దూరం, కన్పించని తెర తమమధ్య ఉండిపోయింది.

ఆలోచనతోనే వాళ్లు బస్‌స్టాపు చేరారు.

అవతలగా రాజు పిలిచాడు. పక్కన పావని, మాధవీలత, దాసు, ఇంకోఇద్దరు అమ్మాయిలు కూర్చుని ఉన్నారు పచ్చికలో

అందరూ కూర్చున్నాక... అందాకా తగువులాడుకొంటున్నట్లుంది. మళ్ళీ కొనసాగింపుగా, గొంతు విప్పింది మాధవి. ఆమెని పావని తప్ప ఎవరూ వ్యతిరేకిస్తున్నట్టు లేదు.

రాజు నిశ్శబ్దంగా వింటున్నాడు.

"రాత్రిళ్లు తిరగటం నందిత తప్పు. కనక మనం చేసేదేంలేదు'' అంది మాధవి.

"సో..." అని ఆగింది పావని అందర్నీ ఒకసారి చూసి.

"మీ అభిప్రాయం కూడా అదేనా? లేటుగా రాత్రిళ్లు తిరగటం... తప్పయితే నేను కూడా అదే తప్పు కొన్ని వందలసార్లు చేసిఉంటాను. మొన్న లక్ష్మి సభరోజున వచ్చేసరికి పది దాటింది. తెలుసా?"

కొంచెం ఉక్కిరిబిక్కిరయింది మాధవి.

"అది కాదు నా ఉద్దేశం" సర్దిచెప్పింది.

"మరేది?"

బాలయ్య తన చూపుల్ని తిప్పి పావనితో అన్నాడు.

"నువ్వు అవసరాలరీత్యా తిరగటం, ఆ అమ్మాయి బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగటం ఒకటేనా?"

"నాకు ఒక సందేహం వస్తోంది. అసలు మీకూ నాకూ ఏమిటి సంబంధం? మీరు అందరూ నాకు ఫ్రెండ్స్ కారా? అంటే బాయ్ ఫ్రెండ్సేకదా. మీతో తిరగటం... ఎందుకూ? అసలిక్కడ మీతో కూచోటం తప్పు కాదా?"

"అదుగో అదే వద్దంటున్నా. నువ్వు వేరు. మన స్నేహం వేరు. వాళ్ల పరిస్థితి వేరు. నువ్వు రాత్రి పన్నెండుదాకా తిరిగినా నువ్వు మనకి అంటే మూవ్‌మెంటుకి లాయల్‌గా ఉంటావు. నీది తప్పెలా అవుతుంది?" అంది మాధవి.

ఎందుకో నవ్వింది పావని.

"చూశారా? అందరికీ సమానహక్కులు. సమాన న్యాయం అంటున్నాం. అవిప్పుడిప్పుడే వచ్చే ఆశ కనీసం రేఖామాత్రంగా అయినా లేదు. అప్పుడే ఆయా హక్కుల్ని, న్యాయాన్ని విడగొట్టి పారేస్తున్నాం. నేను లాయల్‌గా ఉంటాను కాబట్టి లేటుగా రావచ్చు. నేను మగాళ్లతో తిరగొచ్చు. అప్పుడప్పుడు ఏ రాధాకృష్ణో ఎవరో తన వెహికిల్‌మీద నన్ను దింపచ్చు. నందితో ఇంకెవరో ఆపనే చేస్తే అది తప్పు. సరిగ్గా ఇదే ఆదేశాల్లో అమలవుతుంది. లాయల్‌గా ఉండేవాళ్లకి ఒక క్యూ, సామాన్యులకు ఒక క్యూ. వాళ్లకి కార్లూ, మిద్దెలూ, వీళ్లకి గుడిసెలూ... అందుకే అక్కడ కుప్పకూలే పరిస్థితి ఉందివ్వాళ. అయినా ఏమాత్రం ఆలోచన లేకుండా మళ్ళీ అవే పద్ధతులు. రాజూ! లాయల్ అంటే ఇంకో అర్థం ఏంటో తెలుసా! రాజభక్తి, రాజుగారి భక్తులకి వేరే న్యాయం అన్నమాట" ఆవేశంగా అంది పావని. ఎందుకో ఆమెలో ఇవాళ దేనిపై ఆగ్రహమో కట్టలు తెంచుకుంటోంది.

అందరూ ఖంగుతిన్నట్లు ఉండిపోయారు. ఆమె మాటలకంటే ఆమెలో పెల్లుబుకుతున్న భావోద్రేకానికి.

రాధాకృష్ణ ఒక్కడే కులాసాగా నవ్వాడు. అతడీ ఘర్షణని ఆనందిస్తున్నట్టున్నాడు. ఇక డైరెక్టుగా ఆమెకి సపోర్ట్ ఇవ్వాలనుకుని అన్నాడు ఇలా...

"ప్రత్యామ్నాయ సంస్కృతిని స్థాపిద్దాం అని మనం అంటుంటాంకదా! అంటే ఉన్న సంస్కృతిలో బూజుని దులుపుదామనేగా మన ఉద్దేశం. జరుగుతుందేంటంటే బూజుని ఇంకా పెంచుతున్నాం. పావని సరిగ్గా అడిగింది. మీరేమో మనం సామాన్యులం కాదు

గదా. గొప్పోళ్లంకదా! అందుకని మనం తిరగటంలో తప్పులేదు అంటున్నారు. ఆర్వెల్ అన్నాడు కదా బాలయ్యా! మనం ఇంకెక్కువ సమానం అనీ''

"ఒరేయ్ తెల్సీతెలియని మాటలొద్దు. ఆర్వెల్ ఎందుకుగానీ. ఇదాలోచించు. మాధవి అనటంలో తప్పుండొచ్చు. కానీ ఎస్సెన్స్ ఏమిటీ? బైక్‌లమీద సినిమాలకీ, షికార్లకీ తిరగటానికీ, ఈ వ్యవస్థని మార్చేందుకు ఉద్యమాల్లో తిరగటానికీ తేడా లేదూ! బుర్ర పెట్టి ఆలోచించు'' కోపంగా అన్నాడు బాలయ్య. అతడి కళ్లముందు కార్లల్లో బార్లకు పోయి బీర్లుతాగే కుర్రకారు కనపడ్డారు. ఇంకొంచెం మంట పుట్టింది వాళ్ల కల్చర్ ఏంటా అని ఆలోచించటంతో.

పావని జోక్యం చేసుకోబోయింది.

"ఆగండి'' అన్నాడు రాజు. అతడి మొహం ప్రశాంతంగా ఉంది. పావనీ, బాలయ్యల్లోని ఉద్రేకాలూ, రెండు వ్యతిరేక దృక్పథాలూ అతడినేమీ ఖంగారు పెట్టినట్టు లేదు. ఇలాంటివి ఎన్ని చూశానో అన్నట్టుంది వాలకం.

శరత్ ఎంతో ఆసక్తిగా వింటున్నాడు. చూస్తుంటే ఇద్దరి ఆలోచనలూ సరిగ్గానే ఉన్నట్లనిపిస్తోంది ఇంకా వింతేమిటంటే పావని మాట్లాడేటప్పుడు ఆమెది మాత్రమే సరైందన్పిస్తోంది. ఇవతలి వాళ్లపై కోపం వస్తోంది. మళ్లీ బాలయ్యా, మాధవీ మాట్లాడుతున్నప్పుడు వాళ్లే కరెక్టనిపిస్తోంది.అలాంటిది రాజెలా పరిష్కరిస్తాడా అని ఒకింత టెన్షన్ కూడా కలిగింది.

రాజు అందర్నీ చూసి తల ఊపి అడిగాడు.

"బాలయ్యా ఏంటయ్యా ఇప్పుడు చెప్పు''

చెప్పేదేంటి గురూ. అయిందిగా. వాళ్ల వెర్షన్ విన్నావుగా'' రాధాకృష్ణ ఆపాడు.

"అది సరేలేబ్బా! అసలు మనం ఏ పాయింటుమీద మాట్లాడుకుంటున్నామో అర్థంకాకే అడుగుతున్నా. ఆర్వెల్ గురించీ, రుమేనియా గురించీ కాదుగా ఇక్కడ మనం కూర్చున్నది. నందిత సమస్య'' అన్నాడు రాజు.

"అయితే వాటి గురించి మాట్లాడనేకూడదా?" రాధాకృష్ణ కోపం తెచ్చుకున్నాడు.

రాజు శాంతంగా చూశాడు.

"తప్పకుండా. అన్నీ మాట్లాడుకోవాలి. అన్నింటినీ చర్చించాలి. ప్రశ్నించాలి. ప్రశ్నలకు సరైన జవాబులు వస్తేనే కార్యక్రమంలోకి దిగాలి. సైంటిఫిక్‌గా మనని సంతృప్తిపరచని ఏ మార్గమైనా మనం ఒబే చేయాల్సిన అవసరం లేదు. అయితే ఏది ముందు? ఏది వెనక? ఒక మెథడాలజీ ఉండాలి. ఒక పద్ధతి. నందిత గురించి కదా మనం అనుకుంటున్నది. ముందిక్కడికి రండి. ఇదయ్యాక ఆర్వెల్లేంటి? హెూవార్డ్ ఫాస్ట్‌నుంచి అల్బర్ట్‌కామూ వరకూ, రుమేనియా నుండి పెగ్గింగ్ యూనివర్సిటీదాకా అన్నీ తెలుసుకుందాం. ఇవాళ టైం కుదరకపోతే ఇంకోసారి... ఎందుకు రేపే కూర్చుందాం. అందరం కలిసి ఎట్‌లీస్ట్ వీక్లీ ఒన్స్ అయినా కూచుందాం. ఏదోఒకటిఅధ్యయనం చేద్దాం అని నేనింతకు ముందే ప్రపోజ్ చేశాను. గుర్తుందా? ఇప్పుడు ఆవేశపడేవాళ్లు అప్పుడు సైలెంట్‌గా ఉండిపోయారు. ఓకే ఇక రండి. ముందు మాధవి చెప్తుంది'' అని మాధవిని చూశాడు.

బాలయ్యా, మాధవీ ఒకేసారి చెప్పబోయారు. ఏదీ అర్థం కాలేదు. రాధాకృష్ణ ఏదో అన్నాడు.

కోటి తలపట్టుకున్నాడు.

"ఏంటయ్యా బాలయ్యా. ఇందాకటినుండి నువ్వేదో చెప్పాలని ట్రై చేస్తున్నావు. నీ బాధేంటీ?" రాజు అడిగాడు.

బాలయ్య చిన్నబుచ్చుకున్నాడు. కొంత విసుగూ వచ్చినట్టుంది.

"నేనొక్కటే అడుగుతున్నా... ఇన్ని మాటలెందుకు? నందిత అనే అమ్మాయి రాత్రిళ్లు...




బాయి ఫ్రెండ్స్‌తో... బైకులమీద తిరగటం తప్పా? కాదా?..."

"అదేనా నీ ప్రశ్న? ఇంకేమీలేదూ?" రాజు ప్రశాంతంగా అడిగాడు.

"అదే చెప్పు... తప్పా? కాదా?"

రాజుని అందరూ టెన్షన్‌గా చూశారు. అతడు చెప్పేదానిమీదే ఆశలు పెట్టుకున్నారు ఇరు పక్షీయులూ. ఏం చెబుతాడు?

రాజు నోరు విప్పాడు.

"తప్పే..."

"హియర్... హియర్' చప్పట్లు కొట్టాడు కోటి. అతడాక్షణాన్నే బాలయ్యా మాధవీలవైపుకి దూకేశాడు... రాజు నిర్ణయం ఏంటా అని ఇంతదాకా సంశయంతో ఆగి.

రాధాకృష్ణ కోపంగా ఏదో అనబోతున్నాడు. "రాజూ నువ్వు కూడా..." అన్నట్టు చూస్తోంది పావని దెబ్బతిన్నట్టుగా.

"తప్పే... ఎందుకని అడగరేం. బాలయ్యా ప్రశ్నకి మాత్రమే చెప్తున్నాను. నందిత అనే అమ్మాయి రాత్రిళ్లు తిరగటం తప్పు. ఎందుకంటే మొదటిది ఆ అమ్మాయి హెల్త్ మామూలుగానే అంత మంచిదికాదు. ఇక లేటుగా తిరిగితే నిద్ర చెడగొట్టుకుని... ఇంకా పాడయ్యే అవకాశం ఉంది. రెండోది బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగటం. సాధారణంగా బాయ్‌ఫ్రెండ్స్ అంటే అమ్మాయిల సమస్యల్ని అంతగా పట్టించుకునే రకాలు కాదు... ఎంతసేపూ తమ గొడవే తప్ప. మూడోది బైకులమీద తిరగటం. ఇదీ తప్పే... బైక్ అంటే చాలా రిస్క్. టూ వీలర్ కనుక పడిపోయే ఛాన్సుంది. ఎక్కడైనా పెట్రోల్ అయిపోయినా చావే. నందితతో తిరిగేవాడు ఈ అమ్మాయితోనే వెహికల్‌ను తోయించే రకమైతే ఇంకా పెద్ద చావు అందుకే తప్పు అంటున్నాను'' రాజు నేలమీద చరిచి చెప్పాడు.

బాలయ్య బృందం అయోమయంగా చూసింది.

పావని చెయ్యి అడ్డం పెట్టుకుని నవ్వింది. శరత్‌కూడా పగలబడి నవ్వబోయి బలవంతాన ముక్కుతూ కూచున్నాడు కర్చీఫ్ అడ్డం పెట్టుకుని.

"గురూ ఇంత... హ్యాండిస్తావనుకోలేదు'' రాధాకృష్ణ బాలయ్యను చూపుతూ అన్నాడు.

"చెయ్యిచ్చిందేమీ లేదు. నేను బాలయ్య ప్రశ్నను పాయింట్‌లుగా విడగొట్టి చెప్పాను. మరీ అంత సీరియస్‌గా ఉండకూడదు కదోయ్. కొంచెం నవ్వండి బాబులూ... ముందసలు ఇష్యూ చూడండి... హాస్టల్... అన్నట్టు శరత్... బోరుకొడుతోందా? నిన్నసలు పట్టించుకోనే లేదు''

"లేదు... లేదు... కానీండి. నిజంగా ఇంత చిన్నగా కన్పించే ఈ సమస్య... ఎన్ని మలుపులు తిరుగుతుందో గమనిస్తున్నా. ఇంట్రెస్ట్‌గా ఉంది'' అన్నాడు శరత్.

"అదీ.. వెరీగుడ్... సాధారణంగా మేమింత తీవ్రంగానూ ప్రతిదీ ఆలోచిస్తుంటాం. కొన్ని విషయాల్లో ప్రతిపక్షం ఉంటే అది మరింత బలమెక్కుతుంది. మా పావని ఉంది. ఎప్పుడూ ప్రశ్నలతో సిద్ధంగా ఉంటుంది. నన్ను ముప్పుతిప్పలు పెడుతుంది. అలాంటప్పుడు ఇంకా బాలయ్యా కూడా సామాన్యుడు కాదు. అందుకే ఇవాళ ఈ చర్చ ఇంత ఘాటెక్కింది''

"ముందిది చెప్పండి... వార్డెన్ తిట్టింది... లేటుగా వచ్చినందుకు. ఏమనీ? మామూలుగా కొంత కసురుకోటం... ఓకే నిజానికి అది కూడా చేయకపోతే మంచిది. రూల్ ప్రకారం తొమ్మిది దాటకూడదు అవునా? ముందా రూల్ సంగతి మనం ఆలోచించాలి. అది మార్చే అవకాశం ఉందా అనేది సిటీలో ఏ పనిమీద వెళ్లినా అమ్మాయిలకు కావల్సిన స్టేషనరీనుండీ కాస్మటిక్స్ వరకూ... తొమ్మిది లోపు తిరిగిరావటం చాలా కష్టం. అందులోనూ మెస్‌టైం ఎనిమిదిలోపే. క్యాబట్టి భోజనం ముగించి పరిగెత్తాలి. గంటలో తిరిగి చేరుకోటం అసాధ్యం. కనుక పది దాకా

ఆ క్రైం పెంచే ప్రయత్నం చేయాలని మనం డిమాండ్ పెట్టాలి. ఇంక వార్డెన్ తిట్టటం తప్పకుండా ఖండించాలి. వ్యభిచారి అనేదా కా ఎందుకుపోయింది? అదేమాట రేపు మన మీదే ప్రయోగించొచ్చు. పావని నిలదీసిన ట్లు... తననే అంటే కనుక బియాండ్‌ది డిసిప్లిన్‌కు పోయి పోలీసు సాయంతో రెచ్చిపో వటాన్ని మనం వ్యతిరేకిస్తాం. ఇంతవరకూ ఏమైనా అభ్యంతరం ఉందా?"

బాలయ్య తలూపాడు అంగీకారంగా. మాధవి అశాంతిగా చూస్తోంది. రాజు చిన్నగా నవ్వి కొనసాగించాడు.

"ఇప్పుడు మీ అభ్యంతరాలు చూద్దాం. ఇట్లా చేస్తే మనం నందిత బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగటాన్ని సమర్థిస్తున్నట్లు కాదా! అని కదా ప్రశ్న. ఒకరకంగా అవును... ఒక రకంగాకాదు''

"అదేంటి..." అందొక అమ్మాయి పావని పక్కన కూర్చున్నదల్లా ముందుకు జరిగి.

"ఎస్... బాయ్‌ఫ్రెండ్స్‌తో తిరగటాన్ని మనం ఏరకంగా తప్పంటాం? సమాజం తప్పుగా చూస్తుంది కాబట్టా? సమాజం ఇంకా చాలా వాటిని ఇదివరకు తప్పుగా చూసింది. మళ్లీ మారింది. తప్పులు ఒప్పులయ్యాయి. విధవా వివాహం లాంటివి. కనుక అట్లాకాదు. జనరల్‌గా మగ స్నేహితులతో తిరగటం శీలం అనే కోణంలోంచే తప్పు. చెడిపోతార న్న సందేహం. అమ్మాయిల కింతకన్నా అవమానం ఉందా? అంత లూజ్ కారెక్టర్లా వాళ్లవి. పైగా గ్రామాల్లో కాదుగానీ చిన్నచిన్న టౌన్‌లనుండీ కూడా ఆడామగా పరస్పర సహకారాలు అవసరం అయ్యాయి ఇవాళ. ఏ చిన్న ఆఫీసు తీసుకున్నా ఆ ఇంటర్ యాక్షన్స్ ఉంటాయి. అలాగే విద్యార్థుల మధ్య... క్యాంపస్‌లో లక్ష అవసరాలుంటాయి. నోట్స్‌లనుండీ సినిమాలదాకా... కనుక దాన్ని మనం వ్యతిరేకిస్తే రాధా అన్నట్టు బూజుని ఇంకా పెంచినట్లే.

"ఈ పాయింటు దగ్గరే పావనీ, రాధాలు ఆవేశపడినట్లుంది. నిజానికి ఆడామగా తిరగటాన్ని మనం వ్యతిరేకించటం... ఏ పర్పస్‌తో తిరుగుతున్నారనేదాన్ని ఆ లక్ష్యాన్నీ వ్యతిరేకిస్తాం. వ్యతిరేకించడం అంటే అట్లా తిరిగే ప్రతి జంటనీ పట్టుకుని పోట్లాడతాం అని కాదు. నందిత స్నేహం వెనకాల గొప్ప లక్ష్యాలేవీ లేవు నాకు తెలిసి. చిన్నచిన్న సరదాలు... కలిసి కాఫీలు... సినిమాలు అంతవరకే. అదేమీ మహత్తర కార్యంకాదు. మామూలు మనిషికుండే కోర్కెలు లేదూ అవసరాలు. కాబట్టి ఆమెని పనిగట్టుకు ఖండిచనక్కర్లా. అయితే ఆమె తన మార్గాన్ని సరైందిగా ప్రచారం చేస్తూ అందర్నీ తనలాగే ఉండమనే పద్ధతిలో మాట్లాడితే బాలయ్య అన్నట్టు తీవ్రంగా వ్యతిరేకిస్తాం. నందిత అలాంటిదికాదు నాకు తెలిసి.

నిజానికి నందితది తప్పయితే ఆ పనులు లేటుగా తిరగటం... వగైరా... బాయ్‌ఫ్రెండ్స్‌తో కాదు గర్ల్‌ఫ్రెండ్స్‌తో చేసినా తప్పే. అవునా? కాదా?"

అందరూ సంతృప్తిగా తలూపారు సమాధానం దొరికినట్లయి.

శరత్ విస్మయంగా రాజుని పరిశీలిస్తూ కూచున్నాడు. అతను విశ్లేషించిన తీరు అద్భుతంగా ఉంది. కానీ ఈ పాయింట్లు ఎక్కడో విన్నట్లూ ఉంది. ఎక్కడా?

"రైట్" అంది పావని ఆనందంగా చేతులూపి.

"నిజానికి'' అన్నాడు రాజు నవ్వి.

"నేను చెప్పిందేమీ లేదు. మీ ఇద్దరూ వేరువేరు కోణాల్లో ఈ అంశం గురించి ఆలోచించి.. ఆవేశపడ్డారు. అసలు ఆడామగా కలిసి తిరగటం తప్పు అని బాలయ్యావాళ్లు అంటున్నట్టుగా మండిపడింది పావని. నందితని మొత్తంగా సమర్థిస్తుంది కాబోలని పావనితో బాలయ్య పోట్లాడాడు. వేరువేరు ప్లేస్‌లో... చర్చ జరిగి ఇలా అయింది.




ఇంతకూ నందితా వాళ్లెటు పోయినట్టు?"

శరత్‌కు అర్థమయింది... రాజు వాళ్ల మాటల్నే ఎలా తిప్పి ఒప్పించాడో. దాసు ఈలవేశాడు.

"అసలు వాళ్లుగొడవ విరమించుకున్నట్లుంది. మనం మాత్రం హెూరాహెూరీ..." అన్నాడతడు.

"భలే..." అన్నాడు కోటి.

"ఇంకేమయినా..." రాజు పావని పక్కన కూచుని ఉన్న ఇద్దరమ్మాయిల్నీ అడిగాడు.

వాళ్లు తల తిప్పారు లేవన్నట్లు.

"సరే... నందితావాళ్లు విరమించుకున్నా లేకున్నా ఓసారి గాళ్స్‌ని కదిలించి చూడండి. మరి మనం ఏంచేద్దాం ఇప్పుడూ..."

మాధవి భుజాలెగరేసింది.

"ఇందాక రాధా..." గుర్తు చేశాడు కోటి.

"ఆం! అవును. ఏం రాధా. ఆర్వెల్ గురించి నువ్వూ, తూర్పు యూరోప్ గురించి పావనీ క్లాసులు... పోనీ మాకు అర్థమయ్యేట్టు చిన్న ఉపన్యాసం ఇస్తున్నారా లేదా?" రాజు తలెగరేసి అడిగాడు.

రాధాకృష్ణ ఇబ్బందిగా మొహంపెట్టాడు. గొంతులో వెలక్కాయ ఇరుక్కున్నట్లుందతనికి. 'నేరకపోయి వాళ్ల పేర్లు వాడేశానేమో' అన్నట్లుంది అతని వాలకం.

పావని అటు తిరిగి నవ్వుకొంటోంది.

"అమ్మాయి... తప్పించుకోకు. నీకు తప్పదు'' రాజు పిలిచాడు.

"అదీ మంచిగయ్యింది'' దాసు పావనిని ఏడ్పిస్తూ అన్నాడు.

"సరే... ఈ విషయాలే కాక నాకో ఆలోచనొస్తుందబ్బా. బాలయ్యా నువ్వూ వినాలి'' రాజు అనటంతో అందరూ దగ్గరకు జరిగారు.

"ఫ్రెంచ్ విద్యార్థులనుకుంటాను. ఒక బ్రహ్మాండమయిన ప్రయత్నం చేశారు. మనకి చాలా ఉపయోగపడేది ఆ విధానం"

అర్థం కానట్లు చూశాడు రాధాకృష్ణ.

"ఊం! ముందు నన్నాలోచించనీయండి. మీకు ఎలా చెప్పాలా అని'' కాసేపాగి మళ్లీ కొనసాగించాడు.

"ఇప్పుడూ... మన యూనివర్సిటీలో వేరువేరు శాస్త్రాలున్నాయి. వేర్వేరు రంగాలు. ఆయా సబ్జెక్టుల్లో స్టూడెంట్సున్నారు. మనలోనే ఫరెగ్జాంపుల్ రాధాకృష్ణ ఇంగ్లీష్, బాలయ్య హిస్టరీ, పావని సైకాలజీ, మాధవి లా... ఇంకా రకరకాలు. మనం చదివే చదువులు సాధారణంగా ఎకడమిక్ స్టాండర్డ్స్‌లోనే వుంటాయి. కొన్ని సబ్జెక్టులు... ముఖ్యంగా సైన్స్‌లాంటివి పర్లేదు. వాటినెంత చెడగొట్టాలన్నా ప్రస్తుతం వీలుకాదు. చేయాల్సిందంతా చేశారు మన పండితులు. నిజానికి వాటినెంతో అద్భుతంగా, స్టూడెంట్స్‌కి వికాసం కలిగేట్లు బోధించవచ్చు. సరే ఈ ఆర్ట్స్ ఫాకల్టీస్‌లో... కొన్ని పరమ అధ్వాన్నంగా ఉంటాయి. చరిత్ర తీసుకోండి... భారత చరిత్రకొచ్చేసరికి అన్నీ వక్రీకరణలే. పుక్కిటి పురాణాలనుంచీ పునాదులు వేస్తారు. కోశాంబి, థాపర్‌లు చదివితేగానీ బ్యాలెన్స్‌డ్‌గా మనం అర్థం చేసుకోలేం. అట్లనే ఎకనామిక్స్. ఇంకా స్మితూ, రికార్డోలే ప్రామాణికం. తప్పదు గనుక మార్క్స్ వస్తాడు.

ఈ పరిమితులూ, అశాస్త్రీయ పద్ధతులూ విద్యార్థుల్ని రోజురోజుకీ కుంచించుకుపోయేట్లు చేస్తుంటాయి. ఎంతసేపు పరీక్షలు ఎట్లా గట్టెక్కాలి అని తప్ప ఆ సబ్జెక్టుల్లో ఏముంది? దానిద్వారా సమాజాన్ని ఎలా అర్థంచేసుకోవాలి? దాన్నెలా సమాజాభివృద్ధికి వినియోగించాలి? ఈ ఆలోచన ఎవరికీ రాదు.

ఈ యూనివర్సిటీనీ, ఇక్కడి ఎకడమిక్ సిస్టంనీ మనం ఎటూ మార్చలేం. అంటే వీలయినప్పుడల్లా డిమాండ్ చేస్తాంగానీ సమీప భవిష్యత్తులో ఏమీ మార్పుల్ని ఆశించలేం కదా!"

"నాకర్థమవుతుందిగానీ మనం ఏం చె

య్యాలని నీ ఊహ?" బాలయ్య అడిగాడు.

"ఏమీ చెయ్యలేమని చెప్తున్నట్టున్నాడు" పావని సెటైరికల్‌గా అంది.

"ఊఁహూఁ... చెయ్యాలి... చెయ్యగలం. అదే చెప్తూంది"

"ఏంటో?"

"పారలల్ యూనివర్సిటీ" నవ్వాడు రాజు.

బాంబు పేలినంత సంచలనం కలిగింది అందరిలో. అంతా ఆశ్చర్యంగా ఆసక్తిగా చూశారు.

"ఏంటీ...? పారలల్... యూని..." కళ్లు టపటపా ఆర్పుతూ అడిగాడు రాధాకృష్ణ. అతడి ఆశ్చర్యానికి అంతులేదు.

"అవును... సమాంతరంగా మనం ఒక యూనివర్సిటీని నడపటం"

"అన్నా! మనోళ్లకి మెస్‌బిల్లులు కట్టటమే... ఒకోసారి సర్కస్‌ఫీటు. ఇంకో యూనివర్సిటీని... బిల్డింగులూ, ఆఫీసులూ... క్లాస్ రూంలూ..." దాసు సందేహం.

"ఆహాఁ! అట్లాకాదు. మళ్లీ నువ్వు ఎకడమిక్ పద్ధతిలో ఆలోచిస్తున్నావ్. మనం పాతని ధ్వంసం చేసి నూతన సృష్టి చేస్తాం. ఇక్కడ నా ఉద్దేశ్యమేమిటంటే ఇందాకే అన్నట్లు మనలో వేరువేరు శాస్త్రాలు చదివేవాళ్లు ఉన్నారు. వాళ్లు ఎకడమిక్ శాస్త్రాన్ని క్షుణ్ణంగా చదివి దాని పరిమితుల్ని అవకతవకల్నీ అర్థం చేసుకుని ఆ సబ్జెక్టని మళ్లీ శాస్త్రీయంగా హేతుబద్ధంగా మార్చి... లేదూ బయట ఇంతకుముందే అట్లాంటి శాస్త్రీయ అధ్యయనాలు అందుబాటులో ఉంటే వాటిని అధ్యయనం చేసి అ రెంటినీ బోధించాలి. ఒక్కమాటలో బాలయ్య మన యూనివర్సిటీలో బోధించే చరిత్రనీ, శాస్త్రీయంగా అందుబాటులో ఉండే చరిత్రలు... ఫరెక్జాంపుల్ కోశాంబి, కార్, ఆరెస్ శర్మలాంటివాళ్ల కృషినీ తులనాత్మకంగా... తను ఎటూ చదువుతున్నాడనుకో... మనకు బోధిస్తాడు. దానితో మనకు రెండు ప్రయోజనాలు ఉంటాయి..." చెప్పుకుపోతున్నాడు రాజు.

"అర్థమయింది" కేక పెట్టింది మాధవి.

"నే చెప్పనా..." అంది పావని.

"ఇంక నిన్ను పట్టలేం" అన్నాడు కోటి.

"ఒక ప్రయోజనం మనకు శాస్త్రీయ దృక్పథం అలవడుతుంది. రెండు..." పావని చెప్పబోయింది.

"పరీక్షలు ఎట్లా గట్టెక్కాలో తెలుస్తుంది..." రాధాకృష్ణ జోక్‌గా అన్నాడు.

"నిజమే... జోక్ కాదు. ఆ లాభం ఎటూ ఉంటుంది. ఎప్పుడూ అరిగిపోయిన లెక్చర్లూ, వయసుడిగిన ప్రొఫెసర్లు, రొడ్డకొట్టుడు బోధనా పద్ధతులూ... గ్రామఫోన్ రికార్డుల్లా మనం పరీక్షలు రాయటం... అక్కడ తరతరాలనుండీ అరిగిపోయిన టేపునే మళ్లీ తిప్పటం... మన చచ్చుపుచ్చు రాతలకి అబ్బురపడిపోయి రాంకులిచ్చే జీవచ్ఛవాల్లాంటి ఎగ్జామినర్లూ... ఇంతేనా? ఈ చెత్తని మనం ఊడ్చేయాలి. కొంత క్రియేటివ్‌గా చదవటం... రాయటం మనకి గొప్ప ఉత్సాహాన్నిస్తుంది. ఈ ప్రయోగం చేస్తే అద్భుతంగా ఉంటుంది"

"బావుంది... అయితే దీని స్వరూపం ఎట్లా? అంటే మనం ఏరకంగా నిర్వహించాలి! క్లాసులు పెడితే ఎక్కడ పెట్టాలి? ఎవరు లెక్చరర్లు... మన నరహరి సార్ లాంటి వాళ్లా...? ఎవరొస్తారు వినటానికి? రేపు పరీక్షలు రాసేప్పుడు మనం రాజీపడే ఆన్సర్ చేయాల్సి ఉంటుంది. ఆ ఇబ్బందినెట్లా అధిగమించటం?" ప్రశ్నల వర్షం కురిసింది.

"ఇది నేనొక్కడినే ఎట్లా చెప్పగలగటం? నాకో ఆలోచన ఉంది. అది తప్పు కావచ్చు. మనం ఈ ఆలోచనవరకూ ఓకే అనుకుంటే ప్రాక్టీస్‌లో ఎట్లా అనేది అందరం చర్చించుకొని ఆరంభించాలి. ఎటూ మనం అనుకు




న్నది జరగదు. వచ్చే సమస్యల్ని పరిష్క రించుకుంటూ అధిగమించటం.. ఇట్లా జరగాలి''

"అయినా కొన్నిటికి నేను ఆలోచించాను. కరక్టేమో చెప్పండి. క్లాసులెక్కడ అంటే మన క్లాస్ రూమ్స్‌లోనే. పగలు వాళ్ల సెషన్స్... సాయంత్రాలు మనవి జరుగుతాయి. దీనికి అథారిటీస్ ఒప్పుకోరంటే ఇంకో మార్గం ఆలోచించాలి. అయినా సైంటిఫిక్ స్టడీస్‌కి అడ్డొచ్చే అధికారి ఎవరబ్బా ఈ యూనివర్సిటీలో...? అంత బుర్రలేని మనిషికి మనం సన్మానం చేయాల్సిందే. పిల్లలంతా మేం చదుకుంటాం బాబూ అంటే వద్దు అనరనే నా నమ్మకం. ఎక్కడా కుదరకపోతే మన హాస్టల్ రూములో, లేదా హాల్స్‌లో, అక్కడా కుదరకపోతే ఇదిగో ఈ లాన్స్‌లో... పచ్చని చెట్లమధ్య పచ్చికమీద లెక్చరర్లు... ఈ మాటకొంత నాకు నచ్చలా. అయినా బోధించేది, ఆ బాధ్యత తీసుకునేది కొంతమందే కనుక అందాం. ఈ పనిచేసేది కేవలం మన స్టూడెంట్స్. నరహరి గారిలాంటి వాళ్లూ వద్దు. మన యూనివర్సిటీ కేవలం స్టూడెంట్స్‌తో నడపబడుతుంది. ట్రూ డెమొక్రటిక్‌గా... అయినా అవసరం అన్పిస్తే గెస్ట్ లెక్చరర్స్ విందాం బయటివాళ్లని పిలిచి''

"ఇంకా ఒకే సబ్జెక్టు ఒక్కరే చెప్పటం కూడా తప్పు. దాన్ని కొన్ని పార్టులుగా విభజించి... వీలయినంత ఎక్కువమందిని ప్రిపేర్ చేయించాలి. అట్లా సబ్జెక్టుని లోతుగా స్టడీ చేయటం వీలవుతుంది. అదే టైంలో ఎక్కువమంది ఇన్‌వాల్వ్ అవుతారు. నిజానికిది రివల్యూషనరీ స్పిరిట్. ఎంతసేపూ ఒక్కో టాపిక్‌కి ఒక్కో స్పెషలిస్ట్ ఉండటం... మన ఆర్గనైజేషన్స్‌లో చూస్తాం. ఆ నిలయ విద్వాంసుల వాద్య సంగీతం విన్లేక చస్తారు మన్లాటివాళ్లూ... జనమూ కూడా. అయితే అందరూ ఎఫీషియంట్‌గా చెప్పలేరన్నది నిజం. కానీ ఫెయిలయినా సరే ఈ ప్రయత్నం జరగాలి. వీలయినంతమందిని ఇన్‌వాల్వ్ చేయాలి. అవసరమైతే గైడెన్స్‌కోసం ఆ శాస్త్రంలో నిష్ణాతుల సహాయం తీసుకోవాలి. ఇంక వినేందుకెవరొస్తారు? ఈ ప్రశ్న చిత్రంగా ఉంది. ప్రపంచం గురించి తెల్సుకోవాలనే వాడు వస్తాడు. తమతమ కూపాల్లో తపస్సు చేసుకునేవాళ్లు రారు. నిజానికి కూపస్థ జీవులు చాలా తక్కువమందే ఉంటారు. ఎక్కువ మంది మన విద్యార్థులు ఎప్పుడూ అశాంతితో తిరగటం మనం చూస్తుంటాం. తమకే తెలీని అన్వేషణలోవాళ్లు రకరకాల మార్గాలు వెతుకుతుంటారు. సినిమాలూ, షికార్లూ, మత రాజకీయాలూ కుల రాజకీయాలూ వగైరా... అన్నీ ఈ అన్వేషణలోని అంశాలే. మనం సృష్టించే ప్రత్యామ్నాయ సంస్కృతీ, విజ్ఞానమూ తప్పక వీళ్లలో అనేకుల్ని మంచి మార్గంలోకే తిప్పుతాయి. నిజానికవన్నీ వచ్చాయంటే ఇవాళ క్యాంపస్‌ను ఊపిపారేస్తున్నాయంటే కారణం మన వైఫల్యంకాదా? మనం ఎంత బాగా సబ్జెక్టుని స్టడీ చేయగలం, క్రియేటివ్‌గా ఎలా చెప్పగలం అన్న కృషిని పెంచుకుంటే మెజారిటీ విద్యార్థులు మన క్లాసులకి ఉరకలెత్తివస్తారు''

"పరీక్షల సంగతడిగారు ఎవరో? మనకు సబ్జెక్టు ఎంత తెలుసు అనేదికాదు. వాళ్లడిగిన ప్రశ్నకి వాళ్లూశించిన సమాధానం మర్చిపోకుండా ఇచ్చామా లేదా అనేది మన పరీక్షా విధానానికి గీటురాయి. కనుక ఈ యాంగిల్‌నూ మనం ఆలోచిద్దాం. ఇదిగో అసలు విషయం ఇదీ. మన టెక్స్టు బుక్స్‌లో ఉందిదీ. ఎగ్జామ్స్‌లో మనం రాయాల్సింది ఇంతవరకే. ఈ వాస్తవాల్ని రాస్తే అయ్యవార్లకు పూనకాలొస్తాయి. కనుక దీన్ని ఈ రకంగా తిప్పి రాస్తే మార్కులొస్తాయి. అనేదీ మనం బోధిద్దాం. ఈ యాస్పెక్ట్ నిజానికి మన యూనివర్సిటీకి హైలైట్ అవుతుంది. ఒకటి ఎకడమిక్, ఎగ్జామ్ సిస్టమ్స్ రంగులు బయట పడతాయి. రెండు మన విద్యార్థులకి మంచి మార్కులెట్లా తెచ్చుకోవాలో అర్థం చేయించి

నట్లూ ఉంటుంది. నిజానికీ విషయమే మెజారిటీ స్టూడెంట్స్‌ని మన దగ్గరకు లాక్కొస్తుంది''

"కరెక్ట్... అసలు ఈ సెషన్స్‌కి మనం ఫీజులు కూడా వసూలు చేయొచ్చు'' అంది పావని.

నవ్వులు...

"మరి కార్యక్రమం వాయిదాలూ రాజీలూ లేకుండా ప్రారంభించాలి. ఇంక మీరే మీ ఆలోచనలు చెప్పండి''

కొంతసేపు చర్చ జరిగింది. ఎవరెవరు ఏం చేయాలో ఓ కొలిక్కి వచ్చింది.

"మేం పొద్దుట్నించి ఏం తినలేదు'' నీరసంగా అంది పావని.

"చెప్పరేం... మేం కూడా చాయ్ తాగనేలేదు. కాంటీన్‌కి నడవండి'' రాజు లేచి నిలబడ్డాడు.

"శరత్?"

"నేనూ వస్తా''

"ఉండవోయ్ అసలే జ్వరం"

"ఇప్పుడేం లేదుగా. వారం నుంచీ పడుకొని బోరు కొట్టి చస్తున్నా''

"సర్లేబ్బా... వస్తాడు''

క్యాంటిన్‌దాకా బృందం నడిచింది. అక్కడ పావనీ మాధవీ ఇద్దరే టిఫిన్ తిన్నారు.

పది సింగిల్ టీలు.

బిల్లు శరత్ కట్టేశాడు రాజు లేచేలోపు.

"మరిలేద్దాం" మాధవి అంది.

"మీరెటు?"

"మేమటు''

"మేమిటు''

ఎవరెవరు ఎటెటో చెప్పుకున్నాక నందిత విషయం చివరగా గుర్తుచేశాడు రాజు.

అందరూ రోడ్డు మీదకు వచ్చాక చీలిపోయారు.

రాజు సిటీలో పనుందని బస్టాపులో నుంచున్నాడు. చేయికలిపి కోటీ బాలయ్యల వెనుక మెల్లగా నడుస్తున్నాడు శరత్. ఇందాక జరిగిన ఆ చర్చ... ఆడామగా కలిసి తిరగటం... తనకంత అభ్యంతరం కాదుగానీ.. అసలు అభ్యంతరమే... మాధురితో స్నేహం నడుస్తూనే ఉందిగా.

తామిద్దరూ కలిసి తిరగటం... ఆ స్నేహానికి లక్ష్యమేమిటి? ఉన్నతమయిన లక్ష్యం లేనే లేదు.

ఇంతకూ... మాధురితో ఇన్నాళ్లు జరిగాక... అన్పిస్తోంది. ఏ పర్పస్ కోసం తమ స్నేహం?



శరత్‌కు వళ్లు స్వాధీనంలోకి వచ్చేలోపు రాజూవాళ్ల రూం బాగా అలవాటయిపోయింది. ముఖ్యంగా అక్కడికొచ్చే వ్యక్తులు. యూనివర్సిటీలో దాదాపు అన్నిశాఖలనుండీ విద్యార్థులు కలిసిపోతున్నారు రాజుని. రకరకాల మనస్తత్వాలు. రకరకాల ప్రవృత్తులు.

కొందరు అగ్గిబరాటాలు, కొందరు టార్నెడోలు, కొందరు వేళ్లు కోసేసిన ఉల్లికాడలు, కొందరు నెత్తిన నీళ్లకుండలు, కొందరు సరదాగా మాట్లాడుతున్నట్టనిపించే సీరియస్ థింకర్లు. కొందరు మేకపోతు గంభీరులు, ఇంకొందరు జేబుల్లో చిడతలు దాచుకొని అవి తీయకుండానే భజన చేసే అవసరగత ప్రాణు





లు, మరికొందరు ఆ చిడతల్ని తమకోసం కాక రాజుకోసం తెచ్చి తమ గొప్పలు చెప్పుకో బోయి భంగపడే ఫోజుల రాయుళ్లు.

పాపం... ఇంకోరకం వ్యక్తులు. రాజుమీద చాలా అభిమానంతో వచ్చి నిశ్శబ్దంగా కాసేపు చూసి వెళ్లిపోతుంటారు. ఏదో చెప్పాలని ప్రయత్నం. నోరు పెగలదో? లేక ఏం చెప్పాలో తోచదో? తాము కూడా నిశ్శబ్దంగా ఉండిపోవాల్సి వస్తుంది. అయినాసరే ఏదో ఒకటిమాట్లాడించే ప్రయత్నం చేస్తుంటారు రాజూ, బాలయ్యా.

ఇక్కడో తేడా ఉంది. వాళ్లేం మాట్లాడేది క్షణాలమీద అర్థం చేసుకొని తగినట్లు సిద్ధమవుతాడు రాజు. బాలయ్యది అందుకు వ్యతిరేకం. తన ఆలోచనా ప్రవాహంలో తను కొట్టుకుపోతుంటాడు. అప్పుడప్పుడు తల బయటకు పెట్టి వచ్చినవాళ్లని చూసి పలకరిస్తుంటాడు. వాళ్లేం చెప్తారో, ఈయనేం వింటాడో, విని ఏం అర్థం చేసుకుంటాడో ఆ భగవంతుడికే తెలియాలి.

వచ్చినవాళ్లు అయోమయంగా తిరిగిపోతారు.

స్టూడెంట్సే కాక కొందరు స్టాఫ్ కూడా వస్తూంటారు. వాళ్లు తక్కువే. ఎక్కువగా వచ్చేది నాన్ టీచింగ్ స్టాఫ్, మెస్, గార్డెన్ వర్కర్స్.

ఒక్కొక్కరిదొక్కో సమస్య.

సాధారణంగా పని చేసేచోట సహ ఉద్యోగులతోనో, పై ఉద్యోగులతోనో గొడవలు వస్తూనేవుంటాయి. నానారకాల మనుషులు గనుక ఏ చిన్నపని చేయబోయినా ఏదోక సమస్య వస్తుంది. అలాంటి సందర్భాల్లో కారాలూ మిరియాలూ నూరుతూ వస్తారు వాళ్లు.

"అసలు వాడెప్పుడూ అంతే. సుపీరియర్‌గా ఫీలవుతాడు''

"ఎందుకనీ?"

"ఎవడికి తెలుసు. అన్యాయంగా నామీద కత్తిగట్టి''

"ఏంచేశాడు?"

"ఏం చేయాలేం? ఏ పని చేయబోయినా పుల్ల వేస్తుంటే''

"ఏం చేద్దామంటావ్?"

"వాడిని... ఏసేయాల్సిందే''

"అంటే... నాకర్థంకాలే'

"అబ్బ... వేయటం అంటే..." మెడకష్టంగా చూపుడువేలు కదుపుతాడు.

తామంతా నవ్వు బిగబట్టుకొంటారు. రాజుమాత్రం అమాయకంగా సంభాషణ కొనసాగిస్తాడు.

"తప్పదంటావా?"

"తప్పదేంటి... తప్పదంతే. నువ్వే అంటావుగా అన్యాయాన్ని ఎదిరించాలని. పీడించేవాళ్లని..."

"సరే..." రాజు నిట్టూర్పు.

"మరెప్పుడు...?"

"అదే ఆలోచిస్తున్నా. నీకు వచ్చేవారం సెలవు దొరుకుద్దా?"

"ఎందుకు దొరకదూ? హెడ్‌గాడు ఇవ్వలేదనుకో... ఏసేయటమే''

"సరే... నీకు వీలయినరోజు శలవు పెట్టు. ఏరోజు పెట్టేదీ మా అందరికీ చెప్తే మేమూ వస్తాం"

"నాదగ్గరకొస్తారా...? ఎందుకూ? పైగా నేను లీవ్ పెడితే'

"నీ కన్వీనియన్స్‌నిబట్టి నువ్వు.. చేస్తావుగా''

"అర్థంకాలేదు. నేను చేసేదేంటి? మీరుకదా వాడ్నేసుకునేది''

"కాదు నువ్వే. మేమంతా చూడ్డానికి వస్తాం"

"దేన్ని...?"

"నువ్వు వాడ్నెవర్నో వేస్తానంటున్నావుగా''

"నేనేంటి? మీరు చేయాలని నేను చెప్తుంటే" చెమటలు తుడుచుకొంటాడు.

"పీడించేవాడిని పీడించబడేవాడు ఎదుర్కోవటం న్యాయమని నువ్వే అన్నావుక దయ్యా! నువ్వు ముందుండి ఆ పని చేయట మే సబబు"

అతడికి కిక్కు దిగిపోతుంది.

"బాబ్బాబు... అసలు సంగతి వదిలేసి మీరు నన్నేడిపిస్తున్నారు"

అప్పుడు రాజు నచ్చచెప్తాడు.

"నిజమే... మనకి బాధ కలిగితే ఏదొకటి చేయాలనిపిస్తుంది. కానీ ఒక్కరమే చేయటంకాదు. మనలాగే బాధలు పడేవాళ్లని... పీడితుల్ని ఏకం చేసి వ్యక్తికయినా, సంఘంకయినా, సంస్థకయినా వ్యతిరేకంగా ఫైట్... సామూహికంగా ప్రతిఘటించటం... ఇక్కడ సమస్య నీదిమాత్రం... వ్యక్తిగతం అని నేననుకోవటం. మనమంటే లేదా మనకి పడని ప్రతివాడినీ ఖసేయాల్సిందేనా?" కొనసాగిస్తాడలా.

ఇంకొందరుంటారు...

"ఎందుకు చేస్తారయ్యా మీరూ? ఆలోచన... ఐక్యత... పోరాటం... గుడ్డూ గూసూ... నాకు చెప్పొద్దు ఈ శాంతి సందేశాలు. పైగా అధ్యయనం చేయాలేం... అధ్యయనం... బాగా చేయండి. పుస్తకాలు తక్కువైతే మేమంతా చందాలేసుకు కొనిస్తాం నాలుగు లారీల లోడు. కళ్లజోళ్ల షాపొకటీ, చాయ్ దుకాణమొకటీ మీకు కేటాయిస్తాం. ఆ రెండూ చాలుగా మీకూ..."

వీళ్లలోనే ఇంకోరకం శివాలు తొక్కుకుంటూ వస్తారు.

"అక్కడేదో చేశాం. ఇక్కడేదో సాధించాం. ఆ జిల్లా చూడు ఆ తాలూకా చూడంటారేంటయ్యా? ఇక్కడీ నగరం నడిబొడ్డున... ఆ పదవి ఎక్కి కూచున్న... గాడు మొన్న... కేసులో పాతిక లక్షలు... కూచున్నాడు... ఏం చేశారయ్యా మీరూ. ఆహాఁ! నాకు తెలీక అడుగుతున్నా ఏం చేశారూ అంట.

... కొడుకుని జుట్టు పట్టుకుని... ఏదీ బ్రాయిలర్ కోడిని పట్టుకున్నట్టు ఒడుపుగా వాలుగా పట్టుకొని ఒక చేత్తో... పైనుంచి కిందదాకా జాగ్రత్తగా అంగుళం వదలకుండా సర్రన దించితే... ఏది ఇటుజూడు... గట గట... కారిపోవాల్సిందే. వసంతం ఆడుకి వాలి చూసిన జనాలు..."

"సరే... బావుంది" అంటాడు రాజు.

"నవ్వుతాలకి కాదు... నిజంగానే అంటున్నా"

"నిజంగానేలేవయ్యా. ఇప్పుడు టైం చూడు. ఆరున్నర. ఈ టైంలో నువ్వు నిజాలే చెప్తావని నాకు తెలుసుగా"

"అదీ. అట్లొప్పుకో. మరి నేనొస్తా. ఏడింటికి ఇంట్లో ఉండకపోతే మా ఆవిడ చంపేస్తుంది"

"అర్రే. నాది లేటు. పావుదక్కువ ఏడు పద మ్మరీ" వాచీ సరిచేస్తాడు.

"అమ్మో ఇంక పావుగంటే. మావిడ చంపేస్తుంది" బయటకు పరిగెత్తుతాడతడు

రూం పడిపోయేట్లు నవ్వుతారు అందరూ

రాజులో ప్రత్యేకత ఏమంటే అతడెప్పుడు నవ్వడు పనికట్టుకుని. కేవలం మనిషిలోని బలహీనతల్ని చూసి ఎగతాళి చేయటం చాటున నవ్వటం ఎందుకో నచ్చదు. అతడికి తప్పదనుకుంటే డైరెక్టుగా ఆ వ్యక్తితోనే వట్లాడి నచ్చచెప్తాడు. సాధ్యమయినంతవరకు నొప్పించడు. అతని తప్పును అతడితోనే గుర్తింపచేస్తాడు.

ప్రస్తుతం రాజు చెప్పిన పారలల్ యూనివర్సిటీ పని నడుస్తోంది. దానికి పేరు కూడా నిర్ణయించారు. 'స్టూడెంట్స్ యూనివర్సిటీ' అని.

★ ★ ★

ఎంత చిత్రంగా ఉంది?

మొన్నటిదాకా రాజూ వాళ్లంటే అం





లాంటి భయంతో ముడుచుకున్నట్టయి ఆరోజు కోటి తీసుకొస్తే హాస్టల్ గేటుదాకా వచ్చి మెట్లమీద వెనక్కి తిరుగుదామని ఆలోచన చేసిన నేనేనా?

ఈ రూంలో కాళ్లు బారజాపి పడుకొని బాలయ్యతో రాజుతో పనులు చేయించు కొంటున్నది.

వచ్చాక ఓసారే అడిగాడు రాజు.

"ఏం జరిగింది?"

"ఏంలేదు"

తను ఆ విషయం... తలుచుకోవటానికే అసహ్యం కలిగే ఆ వంశీగాడి విషయం చెప్పదలచుకోలేదు. ఇంకది సమాధి కావల్సిందే నాతోనే.

ఇంకెప్పుడూ అడగలేదు రాజు.

పూర్ రాజు. మనుష్యులిలా... వంశీగాడిలా ఉండగలరని తెలుసా? ఒక్కసారి నీకా సంగతి తెలిస్తే నీ ఉద్యమాల్నీ, పుస్తకాల్నీ తుంగలో తొక్కి ఈ మనుష్యుల కోసమా నా ఆరాటం అని. ఎక్కడికి పోతావో?

అందరూ నీలాగే ఉంటారనుకునే అమాయకుడివి నువ్వు.

బాలయ్య మాత్రం.

అధ్యయనం తప్ప తన సంగతే తనకి పట్టదు. స్టూడెంట్స్ యూనివర్సిటీ పనుల్లో తలమునకలయి చదువులో, రాతలో మునిగి తేలుతున్నారు. ఆ కళ్లజోడూ, ఆ అవతారం, అయోమయం.

మొన్న ఓ రోజు తను రాసిన నోట్సుని ఫెయిర్ చేయమని ఇచ్చాడు మొహమాటంగా. అర్ధరాత్రిదాకా ఆపనిలో... ఉండి టైం తెలీక ఒక గొప్ప సంతృప్తితో ఎందరికో పనికొచ్చే ఆపని పూర్తి చేశాను. నలుగురి కోసం పనిచేయటం ఆ భావనే ఎంతో ఉద్వేగానికి గురిచేసింది.

సామూహిక శ్రమైక జీవన సౌందర్యం అలసటే తెలీలేదు.

యూనివర్సిటీ బాగా నడుస్తోందట.

మంచందిగి నేనూ హాజరవుతానంటే ఎప్పుడూ లేనిది రాజే కోప్పడ్డాడు. డాక్టర్ సలహా కాబోలు.

మొదటిరోజు పావని సైకాలజీమీద క్లాస్ చెప్పిందట. దాసు ఆశ్చర్యపడిపోతూ అన్నాడు. స్టూడెంట్సందర్నీ మెస్మరైజ్ చేసిందట. మామూలుగా కనిపించే పావని సరదాగా సీరియస్‌గా ప్రశ్నలతో దాడిచేసే పావని... అనేకమంది విద్యార్థులకి పాఠం చెప్పి తనతో పాటు మానసిక శాస్త్రపు లోతుల్లోకి ఎలా తీసుకెళ్లిందో? ఆమె క్లాసు చెప్పే దృశ్యం... అద్భుతంగా ఉంది.

ఇంకా పేర్లు తెలీని చాలామంది విద్యార్థులు క్లాసులకి రావటమేకాక యాక్టివ్‌గా కార్యక్రమాల్లో పాలుపంచుకుంటున్నారని వార్త. కోటి మొన్న డాన్స్ చేయబోయినంతపని చేశాడు. రెగ్యులర్ క్లాసులకి వెళ్లని జనం కూడా స్టూడెంట్స్ యూనివర్సిటీకి వస్తున్నారట.

కొత్తగా వచ్చిన వార్తేమిటంటే.

యూనివర్సిటీ అథారిటీస్ ఈ క్లాసుల మీద కన్నేసి ఉంచారట. పేపర్ కవరేజి రావటంతో సిటీలో చర్చనీయాంశమైందట. బహుశా ఇంకెంతోకాలం అధికారులు ఊరుకోరు. ఈ యూనివర్సిటీకొచ్చే పాపులారిటీ చూసి ఎలాగో ఆపాలని ప్రయత్నిస్తారు.

తిన్నగా కుదరకపోతే... దొంగదారుల్లో రాజునిగానీ, పావనినిగానీ సస్పెండ్ చేస్తారేమో?

ఓపిక తిరిగి రావటంతో బాక్ టుది కోర్ట్... రమణ సహాయంతో బహుశా రేపే నా రూంకి వెళ్తాను.

ఇక్కడ వీళ్లకి ఇబ్బంది కల్గించటం... పనులు చేయించుకోవటం.

ఇబ్బందిగా ఉంది నాకే.

★ ★ ★

ఒక వ్యక్తితో పరిచయం లేకుండానే అతి సన్నిహితంగా భావించటం వింత పరిస్థితే. కానీ అది అనుభవంలోకి వచ్చాక నమ్మక తప్పటంలేదు.

రాజు...

రాజుతో అందరితోలాగే మామూలు పరిచయమే అన్పిస్తోందికానీ... మానసికంగా అతడికి చాలా దగ్గరగా ఉన్నట్లనిపిస్తోంది. మొదటిసారి ఇలా అంత పరిచయం లేకపోయినా ఆ మనిషిని యిష్టపడటం.

కారణం బహుశా రాజు ఎన్నుకొని పనిచేస్తున్న రాజకీయాలు కాదు. అవేవీ నాకు తెలీదుకదా! ఒక్కముక్కా అర్థం కావు.

కానీ అవేవీ తెలీకపోయినా రాజులో ఉండే లక్షణాలు... ఏమనాలో. మానవత్వపు అంశ... ప్రపంచాన్ని ఆలింగనం చేసుకొనే విశాలత్వం... తనకు అంత గొప్పగా అన్పిస్తాయి.

మనిషి అనేవాడు ఉంటే బహుశా రాజులానే ఉంటాడేమో!

ఎందుకో తెలీదుగానీ...

రాజుని తల్చుకొంటే పెద్ద చెట్టు గుర్తొస్తుంది. మర్రిచెట్టు... ఎన్నెన్ని గాలులకీ వర్షాలకీ అది చెదరదు. తను ఎంతో స్థిరంగా నిలబడి ఎందరికో ఆశ్రయం ఇస్తుంది.

అలాగే...

రాజు దగ్గరుంటే గొప్ప ప్రశాంతతనీ... భద్రతనీ ఫీలవుతాం. నీలోని బాధలూ, వేదనలూ, విషాదాలూ అన్ని విసిరెయ్... అతడు మోస్తాడు. అతడో ప్రవక్తకాకపోవచ్చుగానీ నీ భారాన్నంతా మోసేందుకు సిద్ధంగా ఉంటాడు. ఏ మనిషి సాన్నిహిత్యం మనకి సంతోషాన్నీ భద్రతనూ ఇస్తుందో ఆ మనిషిని ప్రేమించటం అత్యంత సహజం.

మొన్న ఇంటి దగ్గరనుంచి టెలిగ్రాం

వచ్చింది.

'స్టార్ట్ ఇమ్మిడియట్లీ'

కళ్లు కన్పడటం చెవులు వినపడటం మానేశాయి.

ఏమయి ఉంటుంది? అమ్మకిగానీ...

ఒక్కసారి అమ్మ గుర్తొచ్చి కాళ్లు వణికాయి. అమ్మా నన్ను క్షమించు. ఇక్కడీ విశ్వవిద్యాలయ వేగవంతమయిన జీవితంలో నీ సంగతే మర్చిపోయాను. నెలనెలా నువ్వు పంపే డబ్బు అందుకోవటం... ఆరోగ్యం జాగ్రత్త అని నువ్వు రాసే వాక్యాలు నిర్లక్ష్యంగా చదివి మర్చిపోవటం... ఇక్కడీ చదువుల్లో... స్నేహితులతో అనేక రకాల సాంగత్యాల్లో...

కాలం ఎంత త్వరగా పరిగెత్తుతోంది. అప్పుడే రెండేళ్లు దాటిపోయి ఇంకో ఏడాదికి కోర్సు ముగిసి పోబోతోంది. ఈ మధ్యకాలంలో అప్పుడప్పుడూ లెటర్లూ శలవుల్లో వెళ్లిరావటం తప్ప తమ ఇంట్లో ప్రశాంతంగా ఇదివరకులా ఉన్నది ఎప్పుడు?

యూనివర్సిటీ కొచ్చాక ఇదివరకటి జీవితం అంత రుచించటం లేదు. అంటే హేళనగా కాదు. ఎందుకో తన ఊరూ అక్కడి స్నేహితులూ చివరకు శ్రీధర్... ఆ ప్రపంచంలో ఎక్కువ కాలం ఇమడలేకపోతున్నాను. రానురాను వాళ్లతో మాట్లాడేందుకు విషయం లేకుండా పోతోంది.

గతంలో తాము ఇష్టంతో, ఉద్వేగంతో, ఆసక్తితో మాట్లాడుకొన్న ఏ విషయమూ ఇప్పుడు అట్లా అనిపించటంలేదు. నా ప్రపంచం వేరయిపోయిందా లేక వాళ్లు వేరయిపోయారా?

వాళ్లక్కడే ఉండిపోయారుగానీ...

తనే ఈ విశ్వవిద్యాలయ జీవితం అనుభవంలోకొచ్చాక ఓ కొత్త మనిషిగా తయారవు

తున్నాడు. అదే...

తనలో వచ్చిన ఆ మార్పే...

శ్రీధర్‌కు నచ్చలేదు కాబోలు. కొన్ని నెలల క్రితం తనను మందలిస్తూ రాశాడు. అలాంటివి చాలానే రాశాడు. వాటిని చదివి సొరుగులో పడేసి మర్చిపోవటం మామూలయింది.

ఇదివరకులా శ్రీధర్‌కి ఉత్తరాలు రాయలేక పోతున్నాను. మనసు విప్పలేకపోతున్నాను. బలవంతాన రాయబోతే అది నువ్వు క్షేమం... నేనూ క్షేమంలా అయిపోతున్నాయి. లెటర్‌లు ఏ రకంగా అయితే రాయవద్దనుకున్నానో ఆ పద్ధతివాడాల్సి వస్తోంది.

ఇంక ఆపేశాను. ఇప్పుడటునుంచి కూడా అంతగా రావటంలేదు. ఫ్రెండ్స్‌తో అంటే సరే.

అమ్మతో...

ఇదివరకులా సన్నిహితంగా మెలగలేకపోతున్నాను. ఇదీ అని చెప్పరాని భావం. మళ్లీ ప్రేమ అభిమానం లేవా అంటే...

అమ్మ... నాకోసం తన జీవితం మొత్తాన్నీ ఖర్చు చేసిన అమ్మ. తనపై ఎన్నో ఆశలు పెట్టుకొన్న అమ్మ... అమ్మంటే ఇష్టం, గౌరవం, కానీ ఇదివరకులా జీవితమంటే అమ్మేకాదు. అమ్మ మాత్రమే కాదు. ఇదే నాలో వచ్చిన మార్పు. అమ్మ సాంగత్యం ఒకటే నాకు సంతృప్తి నివ్వటంలేదు. ఇంకేదో చాలా కావాలనిపిస్తోంది. ఇంకా బయట చాలా ప్రపంచం ఉంది.

అందుకే...

తను అమ్మకి అర్థం కాకుండా పోతున్నాడు. దూరమైపోతున్నాడు. కొంపతీసి... ఏదయినా అఘాయిత్యానికి తలపడలేదుకదా?

'స్టార్ట్ ఇమ్మిడియట్లీ...

నా పాలిపోయిన మొహం చూసి ఇంటికి పంపించటానికి కోటీ, రాజు, రమణా వచ్చేరు స్టేషన్‌దాకా. ఏదో అధైర్యం... భయం... అపరాధ భావన. నా పరిస్థితి చూసి చివరి క్షణాల్లో రాజు కూడా నాతో రైలెక్కేశాడు.

రాజు... నాతో... ఇంటికి...

కలలో కూడా ఊహించని సంఘటన. ఇంక నిశ్చింతగా ఊరుకున్నాను. రాజున్నాడుగా... ఇంటి దగ్గర మాత్రం టెన్షన్ మొదలయింది.

ఇంటికెళ్లాక...

అమ్మబానే ఉంది. థాంక్‌గాడ్... కానీ చిక్కి శల్యమయింది. కారణం బుజ్జి. వాడు ఇంట్లోంచి రెండు రోజుల క్రితం వెళ్లిపోయాడట. ఏవో గొడవలు. సరిగ్గా ఇంటికిరాక... కాలేజికి పోక... సినిమాలూ... క్లాసులెగ్గొట్టడం ముఖ్యంగా అమ్మ మాట వినకపోవటం... ఎదిరించటం...

ఎందుకయిందిలా?

బుజ్జీ... నాకు తెలీనంతగా ఎదిగిపోయావురా.

రాజే అమ్మకూ నాకూ ధైర్యం చెప్పి... వెతికే పని గురించి ప్రయత్నాలు ప్రారంభింపచేశాడు. ఫ్రెండ్స్... బంధువులూ నాలుగూళ్లు తిరిగి... తర్వాత రోజు వాడిని పట్టుకొచ్చారు.

పాలిపోయిన అమ్మ... లోపల ఇంట్లో...

బయట బుజ్జీ, నేనూ. వాడు నన్ను ధిక్కారంగా చూస్తున్నాడు.

ఆ రాత్రి రాజు నన్నూ బుజ్జినీ తీసుకుని ఊరిబయట రోడ్డు పక్కన వంతెన మీద కూర్చోబెట్టి మాట్లాడాడు. ముందు పొగరుగా... నిరసనగా జవాబు చెప్పిన బుజ్జిగాడు... రాజుకి లొంగిపోయినట్టు... తన మనసులోని బాధ వెళ్లగక్కేడు.

"అమ్మ మీద ప్రేమే కాని 'ప్రతి పనికీ నన్ను సతాయిస్తుంది. నువ్వు కూడా లేకపోయేసరికి నామీదే దృష్టి. ఏ పనిచేసినా చేయకపోయినా సాధింపులు... కన్నతల్లి.. శత్రువులా ఎందుకు చూస్తోంది. పాపం అమ్మ పడిన




కష్టాలూ నాన్నతో మోసగించబడి ప్రపంచం మీద నమ్మకం పోయి...

తనలోని అసంతృప్తినీ బాధనీ నా మీద వెళ్లగక్కితే... నేనెక్కడ చావను'' అంటున్న బుజ్జిని చూసి వాడి వెక్కిళ్లు చూసి... నాకూ కంట నీరు తిరిగింది. ఎందుకో మొదటిసారిగా వాడిపై ఆప్యాయత కల్గింది. వాడిక్కడ ఈ రకంగా బాధపడుతుంటే ఎవరున్నారు వాడికి? పాపం ఇంట్లోంచి పారిపోయే పరిస్థితి ఎందుకొచ్చింది? వాడి కడుపులో బాధని ఎవరు పట్టించుకోవాలి?

రాజుమొదటిసారిగా గుర్తించినట్టున్నాడు. అయినా మామూలుగా ఎంతో పెద్ద మనసుతో అదో అతి సాధారణ విషయంలా... అమ్మ గురించి అడిగాడు... అంటే అమ్మను కట్టుకొని మోసం చేసినవాడు... మా నాన్న సంగతి.

ఇంతకాలం మరెక్కడా బయట పడకుండా కాపాడుకొచ్చిన ఆ రహస్యం ఇక రాజుముందు దాయలేక చెప్పేశాను. బుజ్జి కడుపులో పడ్డాక అమ్మని కాదని వేరెవర్నో పెళ్లాడి... ఆమె ఆస్తిపాస్తులకు యజమాని అయిన నాన్న కాదు అతడు...

అప్పుడు మా ఇద్దరికీ రాజు చెప్పిన జాగ్రత్తలు...

అమ్మనెట్లా అర్థం చేసుకోవాలో... ఎందుకు ఆమె ఆ రకంగా తయారయిందో... అసలు మనిషి నాన్న సుఖంగా ఉండి.. అమ్మ ఎందుకు ఇలా అసంతృప్తితో.. మమ్మల్ని సాధిస్తుందో ఆమెని ప్రేమిస్తూనే ఆమె చాదస్తాల్ని మూర్ఖత్వాన్ని ఎలా ఎదిరించాలో... ఆమె మాటల్ని ఏమాత్రం పట్టించుకోకుండా ఎలా నిలబడి... ఎలా నచ్చచెప్పాలో... ప్రేమిస్తూ ఘర్షిస్తూ ఇంటినెలా తీర్చిదిద్దుకోవాలో...

అంతదాకా ఒక్కమాట కూడా రాని నాకు... ఏం చెయ్యాలో బుజ్జిగాడికి ఏం చెప్పాలో అర్థంకాక పెనుగులాడుతున్న నాకు రాజు పరమాప్తుడయ్యాడు.

ఆ తెల్లారి రాజుని రైలెక్కించి మరి వారంలో కలుస్తానని మళ్లీ ధైర్యంగా ఇంటికి తిరిగి వెళ్లిన నేను...

ఇదివరకటి అపరాధ భావనపోయి ఎంతో ఆత్మవిశ్వాసంతో గడపలోకి అడుగుపెట్టాను. ఏదో అజమాయిషీ చేయబోతున్న మామయ్యని చూపులతోనే నిలబెట్టి...

నీ పరిధి దాటి రాకు అని కళ్లతోనే హెచ్చరించాను. తర్వాత కలిసిన మిత్రులు... శ్రీధర్... సాంబయ్య... శ్రీను... వాళ్లతో మళ్లీ మామూలుగానే మాట్లాడాను.

కానీ మారిపోయిన నా భావాలు... నిలవ నీరులాంటి వాళ్ల ఆలోచనలు... రెంటికీ పొంతన కుదరటంలేదు.

  

శరత్ యూనివర్సిటీలోకి అడుగు పెట్టేసరికి...

తన కళ్లను తనే నమ్మలేకపోయాడు. క్యాంపస్‌లో మనిషి కన్పించలేదు. అక్కడక్కడా టీచింగ్, నాన్‌టీచింగ్ స్టాఫ్ మాత్రం తిరుగాడుతున్నారు. హాస్టల్‌వైపు నడుస్తుంటే అటూ ఇటూ ఏ డిపార్ట్‌మెంట్‌లోనూ స్టూడెంట్స్ అలికిడి లేదు. ఏం జరిగింది?

రోడ్డుమీద ఓ పోలీస్ జీప్.... జుయ్యిమంటూ వీ.సీ. ఆఫీస్‌వైపుకి పోయింది. ఆ తర్వాత నిశ్శబ్దం. ఎన్నడూ లేనిది కొన్ని వేలమంది తిరుగాడే క్యాంపస్ మొత్తం నిశ్శబ్దంగా ఉంది.

అతడు హాస్టల్ బిల్డింగ్స్ సమీపించేకొద్దీ... కొద్దిగా తెలిసింది. విద్యార్థుల అలికిడి... చాలా రూంలు లాక్‌చేసి వున్నాయి. అక్కడక్కడా మాత్రం ఒకరిద్దరు ఉన్నట్టుంది. శ్రీనివాస్ కూడా లేడు. కీకోసం వెతికాడు. డోర్ పైన చిన్న సందులో దొరికింది.

బ్యాగ్ లోపల పెట్టి హడావిడిగా కన్పించిన ఓ రూంలోకి వెళ్లాడు. అక్కడ

సీనియర్సెవరో ఉన్నారు... నలుగురు. పరిచయం లేనివాళ్లే. వాళ్లనడిగాడు... వీడెవడా అన్నట్టు చూసి...

"ఆర్ట్స్ కాలేజీలో అరెస్టులు జరిగాయి'' అన్నాడొకతను.

"పేర్లు... ఏమన్నా తెలుసాండి?" అన్నాడు ఆదుర్దాగా.

"రాజు అట మొత్తం పదిమందిని''

షాక్ తగిలింది. ఎందుకు అరెస్ట్ చేసినట్టు? వీళ్లకి తెలిసి ఉండకపోవచ్చు. కోటికోసం వెళ్లాడు. అక్కడ ఎవరూ లేరు. వెనక్కి తిరిగొచ్చి రూం లాక్‌చేసి... మళ్లీ ఇందాకటివాళ్లనే అడిగాడు.

"స్టూడెంట్సందరూ..."

"సెక్రటేరియట్‌కు వెళ్లారు. అక్కడేదో మెమొరాండం ఇవ్వాలని కాబోలు. మీరు వెళ్లకండి. ఎందుకు గొడవ?"

మరో పావుగంటకు బస్ క్యాచ్ చేశాడు శరత్. సెక్రటేరియట్ దగ్గరకు వెళ్లేసరికి... బుద్ధపూర్ణిమ వైపుకి ట్రాఫిక్‌ని మళ్లిస్తున్నారు. ఆ కార్నర్‌లో దిగి... సెక్రటేరియట్‌వైపు నడవడం ప్రారంభించాడు. ఆ రోడ్డుమీద ఏ వాహనమూ వెళ్లటంలేదు. కానీ... విద్యార్థి జనసమూహం... కొద్దిదూరంలో కోలాహలంగా వుంది.

కొన్ని వేలమంది.

కొంతమంది రోడ్డుమీద బైఠాయించారు. సెక్రటేరియట్ గేట్లు బార్లా తీసివున్నాయి. కొందరు లోపల ఉన్నారు. అందరూ గుంపులు గుంపులుగా స్లోగన్స్ ఇస్తున్నారు. తెల్సిన మొహాలు కనపడటంలేదు. నుంచోని చూస్తున్న ఒకతడిని అడిగాడు.

అతడు నిజాం కాలేజ్‌నుండి వచ్చాడట. నగరంలోని ముఖ్యమయిన కాలేజ్‌లనుండి చాలామంది వచ్చారు. ఉమెన్స్ కాలేజ్‌నుండీ కూడా. అమ్మాయిలు కొంతమంది సెక్రటేరియట్ గేటు దగ్గర పోలీసులతో ఘర్షణ పడుతున్నారు. లోపల ప్రధాన కార్యదర్శిని చుట్టుముట్టారట.

ఘెరావ్... దాదాపు గంటనుండీ.

లోపల ఏం జరుగుతోందో ఏమీ అర్థం కావటంలేదు. విద్యార్థులమధ్యనుండి తిరుగుతుండగా అవతలెక్కడో రమణ తల కన్పించింది. గుంపుని అటుతోసీ ఇటుతోసీ అతడిని పట్టుకున్నాడు.

"అసలేమయిందీ?"

"ఇక్కడ కాదు. నాకు చచ్చే ఆకలిగా ఉంది. ఇవాళ మెస్‌టైం అయిపోయినా అందరం ఇక్కడే ఉన్నాం. అక్కడేదయినా తింటేగానీ'' అని శరత్‌ను రోడ్డు క్రాస్ చేయించి ఓ హోటల్‌లోకి తీసుకెళ్లాడు. అతడి మాటల సారాంశం ఇదీ.

ఏదో ఇంగ్లీష్ మేగజైన్ మంచి కవరేజి ఇచ్చిందట పారలల్ యూనివర్సిటీమీద. కొంతమంది స్టూడెంట్స్‌తో ఇంటర్వ్యూలు కూడా అయ్యాయి. అవీ వచ్చాయి. దీనిమీద అధ్యాపకుల అభిప్రాయం కూడా తీసుకున్నారు ఆ విలేకరులు. కొంతమంది పొగిడారు. ఇంకొందరు తెగిడారు. చివరగా వీసీని అడిగితే, నాది ఒకే ఒక యూనివర్సిటీ. దానికి నేను వైస్ ఛాన్సలర్‌ని. మీరు చెప్పిన విశ్వవిద్యాలయం ఎక్కడుందో నాకు తెలీదు పొమ్మన్నాడట.

దాంతో పత్రికవాళ్లు క్లాసులు జరిగేటప్పుడు ఫొటో తీసి బాగా వివరంగా వేశారట. వీసీ కామెంట్స్ కూడా.

పత్రిక మార్కెట్‌లోకి రిలీజ్ అయ్యాక జ్ఞానేశ్వరరావు బృందం ఊరేగింపుగా విద్యాశాఖమంత్రికి విజ్ఞప్తి ఇచ్చారట. మన సంస్కృతినీ,చరిత్రనూ ఆ పారలల్ యూనివర్సిటీవాళ్లు సర్వనాశనం చేస్తున్నారు గనుక దాన్ని మూసేయించండి అని. ఆ వేడీ ఈ వేడీ కలిసి...

అరెస్ట్‌కి దారితీసి...

సిటీలో అందరు విద్యార్థులకూ చేరి...




చివరికి ఇక్కడీ ఘెరావ్‌కు దారితీసింది.

మధ్యాహ్నం రెండు అవుతుండగా రాజూ వాళ్లని విడుదలచేశారు. ప్రధాన కార్యదర్శి స్వయంగా ఫోన్‌చేసి విడిపించాడు.

రోడ్లమీద విద్యార్థులు కోలాహలంగా అరిచారు.

★ ★ ★

కోటితో పనుండి వెతుక్కుంటూ అటూ ఇటూ తిరిగి ఏమయినా రాజువాళ్ల రూంలో ఉన్నాడేమో అని ఈ టైంలో ఉండకపోవచ్చని తెలిసి కూడా అలాగే వెళ్లాడు. తలుపు తీసిన బాలయ్య లేడని చెప్పాడు.

ఆ సమయానికి రాజు లోపలే ఉండటంతో వెనక్కి వెళ్లబోయినవాడు లోపలికి నడిచాడు.

"శరత్" పలకరించాడు అతడు.

"ఎక్కడికీ...?" అడిగాడు శరత్. అతడు బట్టలు సర్దుకొంటున్నాడు. బాలయ్య అందిస్తున్నాడు. కొన్ని బుక్స్ కూడా. ఎందుకో బాలయ్య మొహంలో ఇదీ అని చెప్పలేని భావం... ఇబ్బంది కాబోలు. ఎందుకో? ఇంకా దిగులుగానే ఉన్నట్టున్నాడు.

బదులు చెప్పలేదు రాజు.

"కోటికోసమా? రాలేదే ఇటు. ఎటు వెళ్లాడో?"

సర్దటం అయింది. బ్యాగ్ జిప్పు మూసి టైం చూసుకొన్నాడు రాజు. తలెత్తి బాలయ్యను చూశాడు. బాలయ్య లేచి షర్టు తగిలించుకొన్నాడు. రాజు ఆ రూంని మొత్తం చూస్తున్నాడు మెల్లగా. దాదాపు నాలుగేళ్లు. ఆ రూంలో ఎన్నింటినో ఎందరితోనో పంచుకొన్నాడు.

"వెళ్దామా?" బాలయ్య అడిగాడు.

రాజు బ్యాగ్ భుజాన తగిలించుకొని మరోసారి కలియచూసి బయటకు నడిచాడు. ముగ్గురూ బస్టాప్ దగ్గర నుంచొన్నారు. రాజు పక్కకు నడిచాడు... బాలయ్యతో. శరత్ రోడ్డువైపు చూస్తున్నాడు. ఐదు నిముషాలు ఏదో మాట్లాడి బస్ వస్తుందన్న శరత్ పిలుపుతో వెనక్కి వచ్చారు ఇద్దరూ.

మూడోనెంబర్ బస్సు బస్టాపుకి పదిగజాల దూరంలో ఆగింది. కదిలే సమయంలో రాజు పరిగెత్తి ఎక్కేశాడు. ఓ చేత్తో బ్యాగ్ లోపలకు విసిరి చేయి ఊపుతున్నాడు.

బస్సు దూరంగా... పోతోంది... అతడిని మోసుకుంటూ.

వెనకగా చెయ్యి ఊపుతున్న బాలయ్యా... చెయ్యి దించి కళ్లు తుడుచుకోవటం... శరత్ దృష్టిని దాటిపోలేదు.

అతడికి... ఏదో... జరుగుతోందని తెలుస్తూవుంది. అడగటం బాగోదని ఊరుకున్నాడు. ఇద్దరూ వెనుదిరిగారు.

అదే అతడు రాజుని చివరిసారిగా చూసింది.

★ ★ ★

జనరల్ పోస్టాఫీస్ మీదుగా బ్యాంక్ స్ట్రీట్‌వైపుకి తిరిగి అడుగులేస్తున్నాడు బాలయ్య. కళ్లు రోడ్డుపక్క ఫుట్‌పాత్‌లమీద వెతుకుతున్నాయి పాత పుస్తకాలకోసం. అది తప్ప వేరే గమనించే స్థితిలో లేడు. తలొంచుకుని జాగ్రత్తగానే నడుస్తున్నాడు.

వెనకనుంచి లాగడంతో ఎవరా? అని తల తిప్పాడు.

రాజేశ్వరి.

పావని ఫ్రెండ్. ఈమధ్యన తరచూ కన్పిస్తోందిగానీ తను అంతగా పట్టించుకోలేదు. పేరు మొన్నే తెలిసింది.

"హలో" అన్నాడు ఎందుకాపిందా అని ఆలోచిస్తూ.

"మరీ అంత ఆలోచనా? చూడండి ఎదురుగా"

డ్రైనేజి మ్యాన్‌హోల్. ఐరన్‌ప్లేటు ఎవరో ఎత్తుకుపోయినట్టుంది. కొంచెం ఉంటే పార్టులు ఊడేవి, తనవి మాత్రమేకాదు కళ్లజోడువి కూడా. ఈపాటికి కిందెక్కడో ఈదులాడుతూ...

"థాంక్స్... రక్షించారు'' కళ్లజోడు సరిగ్గా సర్దుకొంటూ అన్నాడు.

"పర్లేదు... మీరెందాకా. పదండి... నేనూ బస్టాండుదాకా వస్తున్నా''

ఇద్దరూ మాట్లాడుకొంటూ నడుస్తున్నారు. వర్తమాన రాజకీయాలు. ఇంకా చరిత్ర కూడా. బాలయ్యాని మాట్లాడించాలంటే చరిత్ర సంగతి ఎత్తాల్సిందే.

మూలమలుపు దగ్గర రాజేశ్వరికి తగల బోయి కాలు పక్కకి లాక్కుని సారీ అని వెళ్లిపోతున్నాడు ఓ యువకుడు. అతడిప క్కన ఏదో మాట్లాడుతున్న ఓ యువతి.

"అతను... శరత్ అనుకుంటాను. కోటితో కనపడుతుంటాడు'' అంది రాజేశ్వరి.

"ఎవరూ'' బాలయ్యా వెనక్కి చూశాడు. ఎవరూ కన్పించలేదు.

"ఏమో'' అన్నాడు తనే.

"ఈమధ్య ఆ అమ్మాయితో ఎక్కువగా కనిపిస్తున్నాడు, ఇప్పుడు కూడా. ఏమిటో...'' ప్రశ్నార్థకంగా అడిగింది.

బాలయ్యా భుజాలెగరేశాడు.

కనిపించని శరత్, కనిపించని ఆ అమ్మా యిని ప్రేమిస్తున్నాడేమో ఎవరు చెప్పగలరు? ప్రేమ కన్పించి చస్తుందా ఏమిటి?

బాలయ్యా మళ్లీ ఆలోచనలో మునిగి తల వంచుకున్నాడు.

'ఈయనొకడు...' అనుకొంది రాజేశ్వరి.

జీపీఓ వైపుగా నడుస్తున్న శరత్ తలూపు తున్నాడు. మాధురి మాట్లాడేస్తోంది. అతడు వింటున్నట్లే ఉంది. కానీ...

పొద్దున హాస్టల్‌కెందుకు ఫోన్ చేసినట్టూ? అందులో ఆడపిల్ల... హాస్టల్‌కి ఫోన్‌చేసి ఫలా నావాడ్ని పిలువు అనటం అంత తేలిక కాదు. అంటే అనేయచ్చు కానీ తర్వాతి ప్రశ్నలు వినలేరు. అతడొచ్చి మాట్లాడేలోపు హాస్టల్‌లో మిగిలినవాళ్లంతా వచ్చి ఫోన్ ఎత్తి పరామ ర్శించి, ఎవరు కావాలని విచారించి, మీరెవ రని ప్రశ్నించి కూపీ లాగే ప్రయత్నం చేస్తుంటా రు.

సాధారణంగా అలాంటి ఫోన్‌లు రావు. మగ స్నేహితులో, బంధువులో పిలుస్తుంటా రు. కానీ మాధురి పొద్దున్నే ఫోన్ చేసి ఇప్పుడిక్కడ సెంటర్‌లో కలవమంది. కలి శాక అటు నడుద్దాం అని చెప్పి ఏదేదో మాట్లాడేస్తోంది.

ఇద్దరూ పబ్లిక్ గార్డెన్స్‌వైపు తిరిగారు.

రెండు రూపాయల పల్లీలు కట్టించింది గేటుదగ్గర. కాలిబాట దాటి అవతలగా గడ్డి మీద కూర్చున్నారు. అడుగుదామా వద్దా అన్న సంశయంలోంచి బయటపడి...

"ఏంటి మధూ... పిలిచావు?'' అడిగాడు.

మధు...

మొదటిసారిగా ఆ సన్నిహితమైన పిలుపు, ఆమెలో సంచలనం కలిగించింది. అతడిని అభిమానంగా చూసింది. ఎందుకితనిపై తన కి ఆ... భావం.

"శరత్'

"ఊఁ!''

కళ్లు కలుసుకొన్నాయి. కరుణ ప్రవహించే ఆమె చూపుల్లో అశాంతి. మొదటిసారిగా ఆమె నవ్వులో ఇబ్బంది. చెప్పటానికి వీల్లేని భావం. అతడికేదో అర్థమవుతూ...

"ఇంట్లో ఏమయినా...?''

"అహాఁ! అదికాదు''

"... ...''

"నిన్న మా బంధువులొచ్చారు ఊరు నుండి. మా పెదనాన్న వస్తూ వస్తూ ఓ సంబంధం తెచ్చారు'' బలహీనంగా నవ్వింది.

శరత్ లోపల సుడిగుండం ఒకటి రయ్యి మని తిప్పటం మొదలుపెట్టింది. శరీరం మొత్తం ఒక్కసారి రక్తాన్ని తోడి, దాని స్థానంలో నీళ్లు ప్రవహిస్తున్నట్టు నిస్సత్తువ. ఏమీ అర్థంకాని శూన్యంలో అతడు గిరికీలు




కొడుతున్నాడు.

మాధురి తలొంచుకుని పల్లీలు వలుస్తోంది.

ఇప్పుడేం చెయ్యాలి? భూతంలాంటి ఆ ప్రశ్న విశ్వవ్యాపితమవుతోంది. అరగంట గడిచింది క్షణం క్షణం యుగాల్ని తలపింపచేస్తూ.

ఇంతవరకూ మాధురి ఏమనుకొంటోంది? తనేం చేయాలని ఆశిస్తోంది? అడగబోయి... కొరడాలాంటి దెబ్బ తగిలినట్లు ఒక ఆలోచన కలగటంతో ఆగిపోయాడు. ఇంకా నోరు విప్పి చెప్పాలా?

పొద్దున ఫోన్ చేసి ఇప్పుడు తనకి చెప్పటం... ఆమె ఉద్దేశ్యం తెలుస్తూనేవుంది గా! అది చాలదూ?

ఉత్త ఫూల్‌లాగా తనే అడగబోవటం...!

అతడు గడ్డిపరకలు పీకుతూ... ఆమె పల్లీలు వలుస్తూ కాలం గడిచిపోతోంది. చీకటి పడేసూచనగా పడమరదిక్కులో ఇంకొంచెం మిగిలిన కాంతిరేఖలు అదృశ్యమవుతున్నాయి.

"మరి..." అంది మాధురి.

"... ..."

"నేను వెళ్లాలి... చుట్టాలు ఎదురుచూస్తుంటారు!"

ఏదోకటి తన సమాధానం ఆశిస్తున్నది. ఏదోకటి చెప్పాలి! కానీ ఏం చెప్పాలి...? తన చేతుల్లో ఏముంది? ఏం చేయగలడు?

మొదటిసారిగా తనెంత నిస్సహాయుడో తెలిసినట్టు నిరుత్తరుడయ్యాడు శరత్. ఒక్కసారి ఈ నగరం రోడ్డుమీద నిలబడితే... ఏముంది తనకి ఆసరా? తనకే గడ్డిపోచ దొరకటంలేదు. ఈ గోదావరి వరదలో కొట్టుకుపోబోతున్న మాధురి చేస్తున్న ఆక్రందనలు విన్పించుకొని ఏం ప్రయోజనం? తను అందించబోయే చేయి ఓటిదని ఆమెకి ఎలా చెప్పటం?

ఇద్దరూ రోడ్డెక్కారు.

అటుగా వచ్చే ఆటోని పిలిచింది మాధురి. ఎక్కి అతడిని చూసింది. ఒక్కక్షణం జాలి. కానీ అనంతమయిన క్రోధం... ఎవరిమీద ఆ క్రోధం? శరత్... నీ చేతగానితనం నీదికాదు. నాకు తెలుసు.

ఆటోడ్రైవరు స్టార్ట్ చేయబోతున్నాడు.

అతడి చేయి అందుకొంది... గట్టిగా నొక్కింది. ఆటో ముందుకు దూకింది. డీజిల్ పొగ చిమ్ముతూ, దుమ్ము రేపుతూ.

పొగలో కళ్లు చిట్లించుకొని, తల వంచుకున్నాడు శరత్.

అరచేతిలో పల్లీలు... మాధురి వలిచిపెట్టిన పల్లీలు.

★ ★ ★

అందరూ తలకి ఏభై వేసుకొని కొనిచ్చిన బహుమతులు... వంట సామగ్రినుంచీ వాల్ క్లాక్‌దాకా... అందమైన బండిల్స్‌లో ప్యాక్ చేసి ఆ గోనెసంచీ... భుజాన వేసుకుంటే బాగోదని... ఆటోలో వేసి పన్నెండో నెంబర్ హాస్టల్‌ముందునుంచి బయలుదేరబోతున్నాడు రామచంద్రారెడ్డి. పక్కన వీఎస్వీ చిన్న సూట్‌కేసుతో వచ్చి కూచున్నాడు.

ఇద్దరూ మూడు రోజుల ప్రోగ్రాంమీద తిరుపతి వెళ్తున్నారు. మొదటిరోజు మాధురి పెళ్ళికి హాజరయి ఆ గిఫ్టులు అందించటం... రెండోరోజు స్వామి దర్శనం... మూడోరోజు మొక్కు... గుండు కొట్టించుకోవటం. ఈసారయినా తనకు వార, మాస, భూత, ప్రేత, స్టాక్ మార్కెట్ సాహిత్యంనుంచి క్లాసు పుస్తకాలమీదకు దృష్టి మళ్లించి చదువబ్బేట్టు చెయ్యమని రామచెందర్ మొక్కుకున్నాడు. అలాని ఎవరికీ తెలీదు. వీఎస్వీమాత్రం ప్రవీణ్‌కి క్లాసు పుస్తకాలనుంచి... ఏ అమ్మాయిమీదకో ఏ విస్కీమీదకో దృష్టి తిప్పి అతడికి చదువబ్బకూడదని మొక్కుకోబోయి స్వామివారికి కోపం వస్తుందేమోనని తనకు ఫస్ట్‌రాంకు చివరిదాకా వచ్చేట్టు చూడమని ముడుపులు కట్టాడు.

ఆటో కదుల్తుండగా ఎదురుగా వస్తున్నారు శరత్, కోటీ. వాళ్లపక్కగా పోతూ అదోలా నవ్వాడు రాంచెందర్. పక్కకు వంగి వీఎస్వీకి ఏదో చెప్తున్నాడు.

"వీడొకడు... పెళ్లి పెద్దరికంమాత్రం బాగా వచ్చు. అదో సైకాలజీలే. పెద్ద మనిషి తరహాగా తిరుగుతూ, అమ్మాయిల కుటుంబాలలోకి జొరబడి వాళ్ల పెద్దల మెప్పు పొంది... ఆ అమ్మాయిల సంరక్షణా బాధ్యత వాళ్ల తర్వాత వీడే చూస్తున్నట్టు ఫీలయిపోతూ..." అంటున్నాడు కోటి.

శరత్ తలొంచుకుని ఆలోచిస్తున్నాడు.

"మొన్న కనపడి... నిన్ను అడిగినట్టు చెప్పమంది. జ్యూయెల్రీ షాపు దగ్గరేదో కొంటున్నారు తనూ వాళ్లమ్మా. పెళ్లి జరిగాక చదువు మానేస్తుందట. కండిషన్ పెట్టినట్టున్నారు అతని తరఫువాళ్లు. బొచ్చెడు ఉంది. చదివి ఊళ్లేలతావా అని అప్పుడే అత్తగారు అడిగేశారట" అన్నాడు కోటి.

"అవునూ! ఏంటి అదోలా ఉన్నావ్" అని అడిగి... మళ్లీ టాపిక్ మార్చాడు శరత్ మొహం చూసి.

"అశ్లీల ప్రతిఘటన అని... బూతు సినిమాలకీ, పత్రికలకీ, నవలలకీ వ్యతిరేకంగా స్త్రీలనీ... స్టూడెంట్స్‌నీ కదిలిద్దామని పావనీ బాలయ్యా ప్రయత్నాల్లో ఉన్నారు. తల ప్రాణం తోకకి వస్తోంది. రాజు వెళ్లిపోయాక ఆ లోటు పూడ్చటం..." అంటున్నాడు.

"ఎటయినా పోదాం పద" అన్నాడు శరత్.

ఇద్దరూ ఆర్ట్స్ కాలేజ్‌వైపు నడుస్తున్నారు వెనక్కి తిరిగి.

"నిన్నొకటి అడగనా?" అన్నాడు శరత్.

"అడుగూ" అన్నాడు వింతగా చూసి.

"రాజు సంగతి... ఎక్కడా అన్లేదు నేను... ఆరోజు బస్సెక్కించాక అర్థమయింది, ఇక..."

కాసేపు ఆలోచించి అన్నాడు కోటి "నాకూ తెలీదు... కానీ... క్యాంపస్‌కంటే బయట సమాజం పెద్దది. అక్కడ చేయాల్సిన పోరాటాలు ఉన్నాయి. ఇప్పుడిప్పుడే పెరుగుతున్న కదలికను అందుకొని... ముందుకు తీసుకు పోవటం... బహుశా అందుకే..."

మాటల్లో గమనించలేదు. అటునుంచి పావనీ, రాజేశ్వరీ, బాలయ్యా ఇంకొందరు అమ్మాయిలు వస్తూ... కేకపెట్టారు.

"ఏంటయ్యా కోటీ... షికార్లు. అందర్నీ కదిలిద్దామని ఊరంతా తిరుగుతున్నాం. మీరుమాత్రం షికార్లు కొడుతున్నారు. మాతో రావచ్చుగా" అంది పావని.

"మేమెక్కడా? మీరా అనుభవజ్ఞులు. మేమేంచేస్తాం".

"ఆహాం! తప్పించుకొందామనే. రండి బాబూ. అయినా ఈ ఏడాది... ఇంకొద్ది నెలల్లో ఎక్జామ్స్ అయిపోయాక... మనలో ఎంత మంది మిగుల్తారో కాంపస్‌లో. దాదాపు బ్యాచ్ మొత్తం మనవాళ్లు... రాజేశ్వరీ... శంకరనారాయణా ఒకరిద్దరు తప్ప ఇంక రోడ్లమీద పడతాం సర్టిఫికెట్లు పట్టుకొని. ఇంకా క్యాంపస్‌లో ఏం చేసినా మీరే. మాతో తిరిగితే అనుభవం అయినా వస్తుంది. ఈలోపు..."

"మీరు లేకపోతే... అంతే... మాపని. సరేగానీ ఇటెక్కడికి?"

"జ్ఞానేశ్వరరావుకోసం"

"వాడా? వాడితో ఏంపని మనకి. మొన్న... అరెస్టులు చేయించి" కోటి కోపం తెచ్చుకున్నాడు.

"ఏం చేస్తాం? మేమూ అశ్లీలతను సహించం. ఎదుర్కొంటాం అంటున్నారు వాళ్లు. కలిసి వస్తామంటే కాదని ఎలా అంటాం. రేపు కమిటీ ఫాం చేయాలి. రమ్మని ఆహ్వానించటానికి..." అంది రాజేశ్వరి.

కాసేపు ఘర్షణ పడ్డాక "పదండి" అన్నాడు కోటి ఇక వాదించలేక.

"అతనిదగ్గర అరిచేవు ఇలాంటివి. ఇష్యూ





బేస్ట్. కేవలం సంఘటనవరకే కలుస్తాం" అంది పావని.

"సంఘటన అయినా... కలిపి ఏం చేసినా... వాళ్ళ దృష్టి వేరూ, మనది వేరూ. మనమేమో స్త్రీని మారకపు వస్తువుగా... తన శరీరాన్ని... దీనికి వ్యతిరేకంగా. అంతేకాక... మొత్తం స్త్రీ విముక్తిని దృష్టిలో ఉంచుకొంటాం. ముందుకు కదిలించేందుకు. వాళ్లేమో శరీర ప్రదర్శనవరకే... వ్యతిరేకం. ఆ తర్వాత స్త్రీని మళ్లీ పురాణాల కాలంలోకి... రామరాజ్యంలోకి తీసుకుపోదామని. అది మర్చిపోకూడదు'' అంది పావని మళ్లీ.

"అవును. ఇది ఆలోచించనేలేదు'' అన్నాడు కోటి.

★ ★ ★

ఎంత చిత్రమీ జీవితం?

కళ్ళముందే గిర్రున తిరిగిపోయిన క్యాంపస్ లైఫ్. ఇంకొద్ది నెలల్లో వచ్చేస్తున్న ఫైనల్ ఎగ్జామ్స్. ఇంతవరకూ ఎదురయిన అనుభవాలు. ఇంకా మొదటిరోజు రైలు దిగి వచ్చిన దృశ్యం కళ్ళముందు కదలాడుతూనే వుంది... స్పష్టంగా.

బెరుకు బెరుకుగా... అనిశ్చితంగా ఈ మహా విశ్వవిద్యాలయాన్ని చూసి ఏం కానుందో? ఏం చెయ్యాలో అర్థంకాని... అమాయకపు స్థితిలోంచి... విద్యార్థి జీవితంలోని అనేకానేక పార్శ్వాలను తెలుసుకొంటూ... ఇప్పుడీ చివరి పరీక్షలకు సన్నద్ధమవుతూ... ఎంత చిత్రం...

పావనీ, బాలయ్య, దాసూ అందరూ క్యాంపస్ వదిలి ఇప్పటికే ఎనిమిది నెలలు. రాజు వెళ్లిపోయాక అట్లానే కొనసాగిన స్టూడెంట్స్ యూనివర్సిటీ... వీళ్ల నిష్క్రమణతో మూతపడి రాజేశ్వరీ, కోటీ, శంకర్నారాయ

ఐల చిరుచిరు ప్రయత్నాలకు మళ్లీ మొదల యినట్టే అయి... అప్పుడే తెరపడిపోయింది. ఇంకా అనేక ప్రయత్నాలూ, ఉద్యమాలూ తలపెట్టి విఫలమయి కొన్నిసార్లు తల వాచి పోయి... అలిసిపోయిన కోటిని చూస్తే బాధ కలుగుతుంది.

ఎందుకనో కోటిలాగా ఎప్పటికీ పూర్తిగా ఒప్పుకోలేక... అర్థంకాక... ప్రేక్షకుడిగానే చూ స్తున్నాను.

క్లాస్‌మేట్స్ కూడా కొన్ని రోజులకి ఎవరి జీవన సమరంలోకి వాళ్లు... ఎవరి అన్వేష ణలో వాళ్లు వెళ్లిపోతారని గుర్తొస్తే దిగులుగా ఉంది. 'ఎక్జామినేషన్ మూడ్ అట్నుంచి ఈ దిగులు మూడ్‌లోకి అప్పుడే వెళ్లిపోయి క్లాసు గదుల్నీ, హాస్టల్‌నీ, మిత్రుల్నీ వదలలేనట్లు చూస్తున్నానట.

రమణ చెప్పాడు,

అన్నట్టు... అర్జున్ ఓరోజు తాగివచ్చి లేడీస్ హాస్టల్‌ముందు చేసిన గోలకి సస్పెండ్ అయి ఇంటికి పోయి అప్పుడే ఏడాదయింది. పాపం శశి ర్యాంక్ పడిపోయింది అతడి కారణంగా. ఎవరు బాధితులు? ఎవరు కార కులు?

వంశీ మొహం చూసి భరించలేనన్న నిర్ణయానికొచ్చి తప్పించుకొని తిరిగే బాధ అతడు కాంపస్‌లోంచి చదువయిపోవటంతో తప్పిపోయింది. ఇప్పుడు ఓ పెద్ద కంపెనీలో అసిస్టెంట్ మేనేజర్ అతడు.

మాధురి అనుకోకుండా ఓ సినిమా హాలు దగ్గర... భర్త బైక్ వెనకాల కూర్చొని తల తిప్పుకొని కన్పించింది. ఆనందంగానే కనప డింది.

అప్పుడే మాకొచ్చిన సీనియర్ హెూదాతో నోట్సులకోసం వచ్చే జూనియర్స్‌మీద అధా రిటీ చేస్తున్నాం. వాళ్లు భయపడుతూ (ని జంగానేనా...?) మాకు జవాబులిస్తారు. నేను మాత్రం మా బ్యాచ్‌లాగా చేయను.

ఒకప్పుడు నేనూ జూనియర్నేగా.



ఆ గదిలో నిద్రపోతున్న శరత్ ఉలిక్కిపడ్డా డు. ధన్ మని చప్పుడు. మత్తులోనే వాలిపో తున్న కనురెప్పల్ని ప్రయత్నంమీద తెరిచి చూశాడు. ఒక్కక్షణం తనెక్కడుందీ అర్థం కాలేదు. ఖంగారుగా లేచి కూర్చున్నాడు.

అవతలగా గోడపక్కన నాలుగు పేపర్లు పరుచుకొని నిద్రపోతున్న కోటిని చూశాక... ఖంగారు తగ్గి చాపమీద వెల్లకిలా పడుకొన్నా డు. తలకింద లావాటి పుస్తకం దిండుగా బాగా పనికొచ్చింది. పైన ఆస్‌బెస్టాస్ రేకులు కన్పిస్తున్నాయి. వాటిని సపోర్టుగా ఇనుప పైపు, బిగించినట్లూ.

ఆ ధన్‌మన్న శబ్దం.

బయట నవ్వులూ, కేకలూ... పిల్లలెవరో పరుగులు తీస్తున్నారు. బంతి కాబోలు. వాళ్ల సందడి తప్పిస్తే నిశ్శబ్దం. ఇంకా ఎనిమిది దాటనందున ఈ హైదరాబాద్ నగరంలోని ఉదయపు చల్లదనం హాయిగా ఉంది. ఫ్యాన్ లేకపోయినా చెమటలు పట్టవు గమ్మత్తుగా ఇలాంటి ఉదయాలు తనకి ఇష్టం.

మెల్లగా నిద్రలోకి జారుకున్నాడతడు.

ఓ పదిరోజుల క్రితం ఊరినుండి సికింద్రా బాద్ స్టేషన్‌లో ట్రెయిన్ దిగి తిన్నగా యూని వర్సిటీకి పోయి ఓంప్రకాష్‌ని పట్టుకుంటే ఇంకొందరి పాతమిత్రుల చిరునామాలు ఇచ్చాడు. ఓ రెండురోజులు తన రూంలోనే





మకాం. అప్పుడే తను వాళ్లకి సీనియర్ అయిపోయాడు. చూస్తుండగానే యూనివర్సిటీ జీవితం అయిపోయింది. ఎందుకో ఆ హాస్టల్ గదిని చూస్తుంటే తగని విచారం కల్గింది. ముఖ్యంగా గది కిటికీలోంచి కనబడుతున్న వేపచెట్టు. చేయిచాస్తే ఆకులు అందుతాయి. అలాంటి చెట్లమధ్య అక్కడక్కడా కన్పిస్తున్న మరికొన్ని హాస్టల్స్. ఆ మూడ్‌లోనే ఓంప్రకాష్ ఇచ్చిన చిరునామాల కోసం తిరగసాగేడు.

తన క్లాస్‌మేట్స్‌లో చాలామంది సిటీలో లేరు. కొంతమంది బయట రాష్ట్రాలకు పోయి ఉద్యోగాలు చేస్తున్నారు.

శ్రీనివాస్‌కు రాయలసీమలో ఒక కెమికల్ ఫ్యాక్టరీలో మంచి జాబ్ వచ్చిందట. వాళ్ల నాన్నగారి ఇన్‌ఫ్లూయెన్స్.

ఆ తర్వాతిరోజు... పారడైజ్ అవతల నుండి సిటీబస్సులో వస్తున్నాడు శరత్.

పేరేడ్ గ్రౌండ్స్.

రోడ్డుకటూ ఇటూ జనప్రవాహం.

రాడ్‌ను గట్టిగా పట్టుకొని యధాలాపంగా జనాన్ని గమనిస్తున్న అతడు ఉలిక్కిపడ్డాడు. ఎదురుగా కన్పిస్తున్న ఓ రోడ్డు మలుపులో తలొంచుకుని నడుస్తున్నాడు కోటి. జేబుల్లో చేతులు.

కోటి.

కోటి.

అతడు బస్సులో క్రిక్కిరిసిన గుంపును చీల్చుకొంటూ ఫుట్‌బోర్డుమీదకు వచ్చాడు. బస్సు స్పీడుగా పోతోంది. ఒక్కక్షణం సందిగ్ధం. బహుశా ఇప్పుడు కలవకపోతే కోటి ఇక కన్పించడు.

చివరి మెట్టుమీదకు దిగాడు.

"ఏయ్ ఫూల్" ఎవడో మందలిస్తున్నాడు.

"షటప్'' అనబోతుండగా బస్సుకేదో అడ్డం రావటం. కీచుమని బ్రేకు పడి ఆగేంతలో ముందుకు దూకటం అంతా క్షణంలో జరిగింది.

ఐదారుగజాలు పరిగెత్తి కాళ్లమీద నిలదొక్కుకున్నాడు. అప్పటికే కోటి కన్పించిన రోడ్డుమలుపు చాలా వెనక్కి వెళ్ళిపోయింది రోడ్డు క్రాస్‌చేసి ఆ పక్కన ఫుట్‌పాత్‌మీదకు చేరి వేగంగా నడవటం... కాదు పరిగెత్తటం అయ్యాక ఆ మలుపులో కోటి లేడు. ఒక్క క్షణం ఆలోచించి అతడెటువైపుగా తిర్గగబోయాడో గుర్తు తెచ్చుకుని ఆ సందులోకి దూసుకుపోయాడు.

రెండొందలగజాలవతల ఓ ఇంటిముందు వర్నో విచారిస్తున్న కోటి- తనక్కావల్సిన అడ్రసుకోసం తిరుగుతూ కన్పించేడు.

"శరత్' అన్నాడు ఆశ్చర్యంగా.

హ్యాండ్‌షేక్ చేయబోతున్న శరత్‌ని దగ్గరకు లాక్కున్నాడు. స్నేహపూర్వకంగా కౌగిలింత.

"ఇదెప్పట్నుంచీ... ఉర్దూ పద్ధతిలో నవ్వాడు శరత్. కళ్లల్లో అలుక్కుపోయిన ఆర్ద్రత. మెరుస్తున్నాయి ఇద్దరి కళ్లూ.

"పద. టీ కొట్టిస్తావా?"

"ఊహూఁ"

"అదేంటి. పర్సు నిల్లా

"పర్సు సంగతి కాదు. టీ కొట్టించలేను''

"ఓహో! అదా. పోనీ తాపించు''

"నిన్ను కప్పుదాకా తీసుకెళ్లగలను. కానీ తాగించలేను. నువ్వే తాగాలి''

ఇద్దరూ నవ్వుకొంటూ కన్పించిన ఇరానీ హొటల్‌లో కూర్చున్నారు. పరస్పర క్షేమసమాచారాలు అయ్యాక ప్రశ్నలవర్షం గుప్పించాడు శరత్.

ఓర్పుగా చెప్తున్నాడు కోటి.

"రాధాకృష్ణకి లెక్చరర్‌గా జాబొచ్చింది. బయట. రికగ్నైజ్‌డ్ కాలేజిలో. ఫర్లేదు. పర్మినెంటయితే బానే వస్తుంది. ఇంగ్లీష్ లెక్చరర్‌గా. మన సాహిత్యాన్నీ యూరోపియన్ లిటరేచర్‌నీ బాగా అవుపోసన పడుతు

న్నాడు. పావని రీసెర్చిసైడ్‌లో ఉంది. బాలయ్య ఖాళీ. చూస్తున్నాడు వేకెన్సీలకోసం. ఈమధ్య హ్యూమన్ రిలేషన్స్‌మీద బాగా స్టడీచేసి కొన్ని ఆర్టికల్స్ రాశాడు. సిరీస్‌గా వస్తున్నాయి. మాధవి హైకోర్టులో జూనియర్‌గా చేస్తోంది. తెలుసా నీకిది..."

"రాధాకృష్ణ మాధవీ పెళ్లి చేసుకున్నారు"

"అ(రే తెలీదు..." కీచుమని అరిచాడు శరత్ ఆశ్చర్యంగా.

"మాకూ తెలీదులే. అంటే మనం పెళ్లి అనుకునే పద్ధతిని వాళ్లు ఎడంకాలితో తన్ని 'ఇంకానా ఈ బూజు' అంటూ ఓ శుభముహుర్తాన కలిసి ఉండటం మొదలెట్టారు. మనవాళ్లు తర్వాతరోజు వెళ్లి కంగ్రాట్స్ చెప్పివచ్చారు. మరీ అంత షాకెందుకు బాబూ మాక్కూడా అనంటే రాధాకృష్ణ నవ్వేశాడు. అఫ్‌కోర్స్... తనంతే మొదటినుండీ. మనం కూడా చాలా వెనకబడి వున్నామన్న ఒపీనియన్‌తోనే ఉంటాడు. ఆశ్చర్యమేమంటే మాధవి అందుకు సిద్ధపడటం. ఆ అమ్మాయి రాధాకృష్ణ మాటల్లో మనకంటే కూడా 'వెనకబడిన' అమ్మాయి. చాలా స్థయిర్యం కల్గించాడు. అటు తనవాళ్లూ, ఇటు చుట్టూ సమాజం తిట్లదండకం అందుకున్నా గట్టిగా నిలబడింది. ప్రస్తుతం ఇద్దరూ సంసారజీవులు. సారీ... సహచరులు..."

కొద్దిసేపటికి ఆశ్చర్యంలోంచి బయటపడి.

"మరి... రాజు" అడిగాడు తెలిసే.

కోటి భుజాలెగరేశాడు.

"తెలీదు. అయినా ఎక్కడున్నాడో తెలుసుకొని లాభమేముంది? ఉన్నాడు అన్నదే ముఖ్యం"

కోటికి తెలిసినా చెప్పడు. కనుక మనసుని బలవంతంగా మళ్లించుకొని టీ తాగుతూ గడిపాడు కాసేపు.

"నువ్వెక్కడా ఉండటం?"

ప్రస్తుతం ఉద్యోగవేట. ఓ మిత్రుడి దగ్గర ఉంటున్నాను. నీ పరిస్థితేంటీ?" కోటి అడిగాడు.

శరత్ చెప్పాడు.

"నీ కభ్యంతరం లేకపోతే నాతో ఉండు. ఆ హాస్టల్‌లో ఎక్కువరోజులుండటం వీలుకాదు. లేదా వేరే ఎక్కడయినా రూం దొరికితే ఓ.కే. బానే ఉంటుంది"

"అదే చూస్తున్నా నేనూ. ఎక్కడుండాలా అని. నువ్వే సాల్వ్ చేశావు" సంతోషించాడు శరత్.

"మరి దాసు" అడిగాడు తనే.

"చెప్తాగా. ఇంక కలిసి ఉండబోతున్నాం. తొందరేలా? అసలు నీ సంగతే అడగలేదు. ముందు మనం రూంలోకి చేరాక మాట్లాడుకుందాం. నీ లగేజి ఎక్కడా? యూనివర్సిటీలోనే ఉందా. తెచ్చుకుందాం పద"

ఇద్దరూ బస్సులో హాస్టల్‌కిపోయి ఓంప్రకాష్‌కి చెప్పి లగేజీ తీసుకొని ఆటోలో వచ్చారు. హిమాయత్‌నగర్ చివర ఓ పెద్ద కాంపౌండ్‌లో ఇంకా మిగిలిన స్థలం ఊరికే పోనీయటం ఇష్టంలేక ఆ యజమాని కట్టించిన రేకుల షెడ్‌లో ఒక రూం పక్క రూంలో ఎవరో పెయింటింగ్ పనివాళ్లు ఉంటున్నారు. కామన్ బాత్‌రూం.

రూంలోకి చేరాక తెచ్చినవి సర్దుతుంటే.

"ఇంకా సబ్జెక్టు వదల్లేదన్నమాట" అన్నాడు కోటి లావాటి బైండు పుస్తకాలు తన ఇంజనీరింగ్ డిగ్రీవి చూసి.

నవ్వాడు శరత్.

"అదేకదా మనకిప్పుడు జీవనాధారం"

"ఓ... ఇందాక నీ పరిస్థితి అడగలేదు. ఊc! ఇప్పుడు చెప్పు" అన్నాడు గుమ్మంలో కూర్చుని సిగరెట్ ఒకటి వెల్గించి. పొగ రింగులుగా సాగి బయటకు పోతోంది. దాన్నే చూస్తున్నాడు.

"నీకు కొంత ఇదివరకే తెలుసుకదా కోటీ"




"ఊ! మీ నాన్న, అమ్మ, తమ్ముడు... ఆయన టీచర్ అనుకొంటాను... రాజు చెప్పాడు. మీ ఇద్దరూ ఒకసారి వెళ్లారుకదా! మీ ఊరికి''

"అట్లా చెప్పాడా?"

'రాజు... రాజు... ఎక్కడున్నావ్ రాజూ...

తల్చుకొంటే దుఃఖం పొంగేట్లుంది. అలా చెప్పాడన్న మాట. తనని యూనివర్సిటీలో దోషిలాగా చూస్తారని... హేళన చేస్తారని... తను బాధపడతాడని... పోనీ కోటికయినా ఎందుకు చెప్పలేదూ? బహుశా అప్పటికి కోటి కూడా అర్థం చేసుకొని మామూలుగా ఆదరించగలిగేంత ఎదిగి ఉండడు. మరింకా ఎవరికయినా చెప్పి ఉండడా? రాజుకి సన్నిహితంగా మెసలేవాళ్లు పావనీ, బాలయ్యా, దాసూ...

పావని... పావని...

పావనికి చెప్పి ఉంటాడు. అందుకనే కాబోలు తనని సానుభూతితో ఆదరించింది. ముఖ్యంగా రాజు వెళ్లిపోయాక.

పావనీ నన్ను క్షమించు... నీ సహనానికీ మానవతకీ... ప్రతిఫలంగా ఏమివ్వగలను? నీకు... ఈ రిక్తహస్తాలతో ఈ మహానగరాన ఒంటరి అనాథనై తిరుగాడే నేను'...

కొద్దిసేపటికి తేరుకున్నాడు శరత్. కోటి ఇంకా సిగరెట్ పొగలనే చూస్తున్నాడు దీర్ఘంగా.

"నీ కభ్యంతరం ఉంటే వద్దులే'

"అదేం కాదు... రాజు గురించి ఆలోచిస్తూ... ఏం చెప్పాడన్నావ్. మా నాన్న... టీచర్ అని... ఊఁహూఁ కాదు. ఆయన ఓ వ్యాపారి. ఆంధ్రలో పెట్రోలుకి సంబంధించిన డీలర్‌షిప్ మొత్తం చూస్తుంటాడు. మా అమ్మని చేసుకున్నప్పుడు చిల్లు కానీలేదు. బికారిలా తిరిగే క్రమంలో ఇంకో స్త్రీకి చేరువై మెల్లగా ఆమె తండ్రి ప్రాపకం సంపాదించి ఆ ఇంటి అల్లుడయి అట్లా ఎదిగాడు. అమ్మ మోసపోయింది. ప్రస్తుతం అమ్మ పేరున ఉన్న కొద్ది భూమీ, ఇంకా మామయ్య ఒకరూ ఆదుకోవటం వలన గడిచిపోతోంది. తమ్ముడు ఇంటర్ అయి డిగ్రీలోకొచ్చాడు'' క్లుప్తంగా చెప్పాడు.

"మరి ఇంటికెళ్లి ఇంతకాలం ఉన్నావే''

"అదే అసలు విషయం నేను చెప్పబోతున్నది. అమ్మ మొన్న బాగా ఆరోగ్యం చెడి సీరియస్ కండిషన్‌లోకి వెళ్లింది. రెండ్నెల్లు రెస్టు. ఇంటి దగ్గర తమ్ముడి పరిస్థితీ బాలేదు. కొంతవరకూ చెడిపోయినట్లు అమ్మ కంప్లయింటు. వంటరితనం, బాధలూ, ఆర్థిక ఇబ్బందులూ వీటితో అమ్మ బాగా మొరటుగా తయారయి వాడిని హెరాజ్ చేస్తుందని పిస్తోంది. అప్పుడు రాజూ నేనూ వెళ్లింది ఆ గొడవకే. వాడింట్లోంచి పారిపోయాడు. ఇప్పుడింకో సమస్య ఏమంటే మామయ్యతో... ఆయనకి ఇద్దరాడపిల్లలు. ఆ ఇద్దర్నీ మా ఇద్దరికీ కట్టబెడదామన్న ఆలోచన ఉన్నట్లుంది. మొన్న వెళ్లాక అదే గొడవ. అమ్మ పరిస్థితి చూసి ఆగాడు''

"మరేం చేద్దామని నీ ఆలోచన"

"ముందు ఏదోఒక ఉద్యోగం వెతుక్కోవటం. వాళ్లొస్తే తీసుకు రావటం, లేదూ డబ్బు పంపుతుంటే వాడి డిగ్రీ అయిపోతుంది. అసలు సమస్య మామయ్య. ఈసారి వదలడు''

"సో ఉద్యోగాన్వేషణలో ఇద్దరం ఒకే పడవలో ప్రయాణిస్తున్నామన్నమాట. చూద్దాం ఏమవుతుందో''

ఆరోజునుంచీ ఇద్దరూ ఆ రూంలో ఉంటున్నారు. రూం యజమాని పేరు శేషగిరి. దగ్గర్లో ఒక ప్రెస్‌లో వర్కర్. కోటికి పరిచయం కాబోలు. అతను ఎక్కువగా రాత్రిళ్లు ప్రెస్‌లోనే ఉండిపోతాడు. పగళ్లు నిద్రలు. ఏ పదింటికో వస్తాడు... అప్పటికింకా కోటి, శరత్‌లు నిద్రలోనే ఉంటారు.

"ధన్‌ధన్' మని శబ్దం.

'బంతి కాబోలు... ఊహు!... శబ్దం డోర్ మీద నుంచి' అనుకొని లేచి తూగుతూ తలుపు తీశాడు శరత్.

శేషగిరి... మొహంలో అలసట. ఇంకు మరకలతో నిండిన ఖాకీ షర్టు.

"ఏంటి సాబ్. ఈ దొర నిద్రలేవలే..." నవ్వాడతడు.

కొంచెం గిల్టీగా అన్పించి సబ్బూ, పేస్టూ అందుకొని బాత్‌రూంకి నడిచాడు శరత్.

పది నిముషాలు..

ఫ్యాంటు తగిలించుకొని కోటిని లేపుతుండగా గుర్తొచ్చింది. ఈ రోజు కన్పించమని ఓ ఫ్యాక్టరీ మేనేజర్ అపాయింట్‌మెంట్ ఇచ్చిన విషయం. మధ్యాహ్నాం రెండింటికి పోవాలి. కొంత ప్రిపేరయి వెళ్తే బాగుంటుంది. ముందు గొంతులో టీ పడితే...

"నేనూ వస్తున్నా'' కేకపెట్టాడు కోటి బయటనుండి.

ఇద్దరూ పది నిముషాల్లో నగరం రోడ్డుమీదకొచ్చారు. అప్పటిదాకా తాము ఉన్న షెడ్ చుట్టూ కొంత ఖాళీ స్థలం ఉండటం వలన లభించిన ప్రశాంతత ఒక్కసారిగా చెదిరిపోయింది. రోడ్లనిండా జన ప్రవాహం. టీస్టాల్స్‌లో తేనీటి ప్రవాహం... వెరసి గందరగోళం.

ఇద్దరూ ఓ చాయ్‌ఖానాలోకి నడిచారు.

కోటి లుక్మీ, టీతో సరిపెట్టుకుంటానన్నాడు. సమోసా ఆర్డరిచ్చి బల్లలమీద పడి ఉన్న పేపర్లన్నీ పోగేసుకొచ్చాడు శరత్. ఇంగ్లీష్, తెలుగు దినపత్రికలు.

కూలంకషంగా చదివేసరికి గంట సమయం గడిచిపోయింది. ఒకటి, రెండు సిగరెట్లు ఊది, ఇంకో చాయ్ పీల్చి శరత్‌ని అనుసరించాడు కోటి. రూంకొచ్చేసరికి శేషగిరి దుప్పటి ముసుగు పెట్టి నిద్రలో ఉన్నాడు.

★ ★ ★

ఎక్స్‌పీరియన్స్ ఉందా?" అడిగాడు జి.యమ్.

తలూపాడు శరత్... అడ్డంగా.

"మరి ఏం చేద్దామని? ఓకే ట్రెయినీగా చేరు స్టైఫండ్ ఇస్తాం. సక్సెస్‌ఫుల్‌గా పూర్తి చేస్తే పర్మినెంట్ అవుతుంది''

సందిగ్ధంలో ఉన్నాడు అతడు.

"ఆలోచించుకో... ఒన్ ఇయర్ ట్రెయినింగ్'

ఓ ఏడాది గడిచాక తనని పీకేసి ఇంకోడ్ని తీసుకుంటారు. ట్రెయినీగా అదే చాకిరీ తనకంటే బాగా చేయగలడు కనుక.. వాడింకో ఏడాది ఉంటాడు.

ఈ తంతు అన్నిచోట్లా ఉన్నదే. పెద్దపెద్ద కంపెనీలు మినహాయింపు దీనికి.

"ఆలోచించి కలువుమళ్లీ. టేక్ యువర్ ఓన్ టైం"

★ ★ ★

ఉదయం ఆరింటికే లేచిపోయాడు కోటి ఆ రేకుల గదిలో

నాలుగు రోజుల్నించీ వాయిదా వేసిన పని... శరత్ కారణంగా... ఇప్పటికయినా పట్టించుకొని పూర్తి చేస్తే అవతలివాళ్లకు ఇబ్బంది ఉండదు. ముఖ్యంగా తను ఎటు వైపు అన్నది నిర్ణయించుకోవాల్సిన సమయం వచ్చేసింది. ఓ టర్నింగ్‌పాయింట్. ఇకపై తన జీవన గమనాన్ని నిర్దేశించే ఆ నిర్ణయంకోసం కొంత స్థయిర్యం అవసరం. గైడెన్స్ అవసరం. ఆ పని కోసరమే...

గబగబా పనులు ముగించుకొని బట్టలు తగిలించుకొన్నాడు. కొద్దిగా మాసిన షర్టూ... నలిగిన ఫ్యాంటూ. జేబులు తడిమితే కొంత చిల్లర ఉంది... సరిపోకపోవచ్చు.

గోడకు కొట్టిన మేకులకు కొన్ని షర్టులు వేలాడుతున్నాయి.

అతడు శేషగిరిది ఎంచుకొని జేబులు




తడిమాడు. డబ్బులేమీలేవు. నలిగిపోయిన రెండు సిగరెట్లు దొరికాయి. ఆ మాత్రానికే సంతోషించి ఒకదాన్ని వెలిగించి దీర్ఘంగా పొగవదిలాడు. మరీ ఇంత పొద్దున్నే కడుపులో ఏమీ పడకుండా తాగటం అంత బాలేదు. కానీ... తాగకపోతే అసలు బాగోదు.

శరత్‌ను లేపుదామని చాప దగ్గరకు వెళ్లాడు.

అతడు పసిపిల్లాడిలా ముడుచుకొని గాఢ నిద్రలో ఉన్నాడు. తల క్రింద పెద్ద పుస్తకం ఒకటి. కప్పుకున్న దుప్పటికింద దీర్ఘశ్వాసలో అతడి అలసిన శరీరం. పాపం ఉద్యోగ వేటలో... సిటీ అంతా చుట్టుముట్టి గాలిస్తున్నాడు కాబోలు.

లేపే ప్రయత్నం విరమించుకొని శరత్ షర్టులో దొరికిన చిల్లర జేబులో వేసుకొని రోడ్డుమీదకొచ్చాడు. కొంత నడకా, మరి రెండు బస్సులు మారి ఒక కాలనీలో దిగి తనింతకుముందే గుర్తుంచుకున్న ఒక నంబరును మననం చేసుకొని ఆ క్వార్టరు కోసం వెతకసాగేడు. ఒకరిద్దర్ని అడిగి వరుసలు వరుసలుగా ఒకే మాదిరి బొమ్మరిళ్లలా ఉన్న నివాసాలు దాటి ఒక చివరగా ఉన్న ఆ ఇంటిలోకి ప్రవేశించాడు... బెల్లుమోగించి.

తలుపు తీసింది ఒక యువతి, బహుశా యింటి ఇల్లాలు కాబోలు. వంట పనిలోంచి రావటంవల్ల మసాలా వాసనలు మోసుకొచ్చింది. లోపల ఉడుకుతున్నది మాంసం అని తెలిసిపోతోంది.

ప్రశ్నార్థకంగా చూసింది, నుదురు తుడుచుకుంటూ.

ఏమని అడగాలి? ఈమెని అడగొచ్చోలేదో? అసలు తనక్కావలిసిన వ్యక్తి ఇక్కడెందుకున్నాడు? ఏమవుతాడో ఈమెకి?

అతడి సంశయాన్ని గమనించి... తనూ సంశయంగానే అడిగింది.

"ఎవరు కావాలి''

"జగదీష్‌గారి కోసం వచ్చాను''

"కుర్చోండి'' అనేసి లోపలకు వెళ్లి మంచి నీళ్లు తెచ్చింది.

"బయటినుండి రావాలా?" తాగుతూ అడిగాడు.

తల ఊపింది... అడ్డంగా కాక అటూఇటూగా.. కోటికేమీ అర్థం కాలేదు. ఆమె వంటగదిలోకి వెళ్లిపోయింది. అసలా మనిషి ఉన్నాడనో, వస్తాడనో, లేడనో చెప్పకుండా ఇలా కూర్చోబెట్టిందేమిటా అని ఇబ్బంది పడుతూనే కూర్చున్నాడు. ఆ గదిలో చిన్న అలమరా, కొన్ని షోకేస్‌లో ఉంచాల్సిన పీసెస్, పాత పుస్తకాలు కొన్ని... మధ్యతరగతి నివాసంలానే ఉంది.

అరగంట నిరీక్షణ తర్వాత బయట అలికిడయింది. ఓ నడివయస్కుడు లోపలికి వచ్చాడు. చేతిలో పచారీ సరుకులు. కోటిని చూసి ప్రశ్నార్థకంగా లోపలికి వెళ్లాడు. కాసేపటికి బయటికొచ్చాడు.

"జగదీష్?" అడిగాడు కోటి. ఇతనేనేమో అన్న ఆలోచనతో.

"వస్తున్నాడు'' అతడు మళ్లీ బయటకు పోయాడు.

తలొంచుకుని పాత పేపర్నోదాన్ని ఏమీ అర్థం కాకపోయినా చదివే ప్రయత్నం చేస్తూ ఇంకో అరగంట గడిపాక.

"హాయ్! కోటీ!!" వినిపించింది. ఆ గొంతు... ఆ సుపరిచితమయిన గొంతు. జరజర శరీరంలో ప్రవహించే రక్తమంతా మొహంలోకి ఎగదన్ని, చర్మం ఎరుపెక్కి, చెంపలు పొంగుతూండగా సంభ్రమాశ్చర్యాలతో లేచి నుంచొన్నాడు కోటి... అటు నుంచీ వస్తూన్న ఆకారాన్ని చూసి

"రా...జూ'' అరవబోయాడు.

చేతులు కలిశాయి, దృఢంగా రాజు అతడిని దగ్గరకు లాక్కుని వీపు చరిచాడు. గళ్లషర్టూ, లుంగీలోనే ఉన్నాడు రాజు అప్పటి ఎర్రటి గుండ్రటి దేహం చిక్కి నల్లబ

డింది. కొంత కరుగ్గా కన్పించే చూపులు ప్రస్తుతానికి మాత్రం మృదువుగా కోటిని తడుముతున్నాయి.

రెండు నిముషాలు మౌనంగా గడిచాయి.

కోటి ఏదో అర్థమయినట్లు నవ్వాడు.

"జగదీష్... బావుంది కొత్తపేరు... ఎందుకలా?"

జవాబుగా నవ్విన రాజు "ఏమన్నాడు నిన్ను కలిసిన వ్యక్తి?" అనడిగాడు.

"ఏమో... ఏం చెప్పాలా. 'ఈ రోజూ, నాల్రోజుల క్రితం ఒక రోజూ జగదీష్ అనే అతను నీకోసం చూస్తుంటాడిక్కడ' అని మాత్రం చెప్పాడు. మొన్నేదో పనిపడి ఆగాల్సి వచ్చింది. ఇవ్వాళ..."

"ఊc... ఎట్లుంది జీవితం"

"దుర్భరం"

"ఎందుకూ?"

"నిరీక్షణ... నువ్వుండు చూద్దాం. ఎవర్ని కలవాలో, ఎప్పుడు కలవాలో తెలీకుండా ఎదురు చూడ్డం కొన్ని నెలల పాటు?"

"తప్పలేదబ్బా... అప్పట్నించీ ప్రయత్నిస్తే ఇప్పుడు వీలయింది. అదీ ఓ వారం క్రితం... మూడు జిల్లాలుదాటి... నీ కోసం వచ్చాను. అంటే నీ ఒక్కడికోసం కాదనుకో..."

"నీతో చాలా మాట్లాడాలి"

"ఊc! అదే... దానికి ప్రిపేరయ్యేందుకే ఇంతలేటు. ఇవ్వాళంతా నేను నీతోనే ఉంటాను సరేనా. ముందు నేను స్నానం ముగించొస్తే మనం వేరేచోట కూర్చోవచ్చు. ఓపిక పట్టు కొంచెం" అతడు లోపలికి పోయాడు.

కాసేపటికి ఇద్దరూ రోడ్డు మీదకొచ్చారు. కోటి పొట్ట తడుముకొంటూ నడుస్తున్నాడు. లోపల కోడి కదలాడుతున్నట్లే ఉంది. ఆ భావం ఏం చేస్తే పోతుందో? ఓ పాన్‌షాపు దగ్గర రాజు వక్కపొడి కొన్నాడు. కోటి రెండు సిగరెట్లు తీసుకున్నాడు.

"పర్లేదు... ఇది మాత్రం ఎవరూ చెప్పకుండానే..." భుజం చరిచాడు రాజు.

ఇద్దరూ ఆ కాలనీ చివరిదాకా నడిచాక రాజు ఓ ఇంట్లోకి దారి తీశాడు. ఆ ఇల్లు ఖాళీగా ఉంది. తలుపులు దగ్గరకు వేసి ఉన్నాయి.

"మన గెస్ట్‌హౌస్"

లోపల చాపలు రెండూ... కొన్ని పేపర్లూ, మంచినీళ్ల కుండా గోడకు ఆనుకుని కూర్చున్నాడు రాజు. ఎదురుగా చాపమీద కోటి.

"ఇంక చెప్పు"

"ఏం చెప్పటం... ఇలా ఒకేసారడిగితే"

"ఓకే నో ప్రాబ్లం... నీ ఇష్టమొచ్చిన టాపిక్ మొదలెట్టు అదెటూ మనక్కావల్సిందే అవుతుంది"

కోటి సిగరెట్ అంటించి పొగవదిలాడు. రింగులు... వాటినే దీర్ఘంగా చూస్తూ అన్నాడు.

"ఎక్కడ మొదలెట్టాలో అర్థం కావట్లేదు. సరే ఎక్కడోచోట దిగి పోతాను విషయంలోకి. రెండ్నెల్ల నుండీ నేను శేషగిరి రూంలో ఉంటున్నా. అంతకుముందు ఏదో టెంపరరీ జాబ్. యూనివర్సిటీలో మన జీవితం చాలా ఫాస్ట్‌గా గడిచిపోయినట్లుంది నాకు. మనం అక్కడున్నంతకాలం చదువుతున్నాం అన్న ఒక భావం మనని... పోనీ నన్ను రక్షించింది. నా ఉద్దేశ్యం... కనీసం జీవిత విధానాన్ని ఎంచుకొనేందుకు తగిన వ్యవధినిచ్చింది. నా ఆలోచనలూ, భావాలూ, ప్రవర్తనా అన్ని తీర్చిదిద్దుకునేందుకు మీరంతా సాయపడ్డారు. చదువయిపోయి యూనివర్సిటీ గేటు దాటి బయటపడ్డాను. బయట ఒక మహా జన ప్రవాహం. మనం గడిపిన జీవితానికీ, దీనికీ పొంతనలేదు. ఈ జనం ఉన్నారే... వాళ్లెందుకు ప్రవహిస్తున్నారో, ఎటు పోతున్నారో నాకు అర్థం కాలా. అసలు వాళ్లకయినా తెలిస్తేగా? గమ్మత్తేమిటంటే నిలబడి ఆలోచించే తీరికే లేదు ఎవరికీ. నిలబడి




ఆలోచిస్తున్నామనుకొనేవాళ్లు నిజానికి చిన్న చిన్న ప్రవాహాల్లో కొట్టుకు పోతుంటారు ఏదో ఒకవైపుకి.

ఇంతకూ ఈ జన ప్రవాహం నన్ను ఖంగారు పెడుతోంది చాలా. లక్ష్యం, దిశా లేని ఈ జనం ఎందుకు జీవిస్తున్నట్టు. ఈ సమాజంలో నేనెవర్ని? నా స్థానం ఏమిటి? యూనివర్సిటీలో మనందరికీ, విద్యార్థులకీ ఏదొక రిలేషన్ ఉండేది. ఆ రిలేషన్ నాకర్థమవుతూనే ఉండేది. అందుకని అది తెల్సిన దారి. భయంలేదు. ఈ జనారణ్యం నాకు తెలీనిది. భయంకరంగా ఉంది. అసలు నేనేం చేయాలి? ఏం చేస్తే నాకూ సమాజానికీ ఉపయోగం? అసలేమయినా చేయగలమా? ఈ ప్రశ్నలు సీరియస్‌గాన్నే అడుగుతున్నా. నన్ను కలిచివేసే సందేహాలు. ఒకడికీ ఇంకొకడికీ ఏమాత్రం సంబంధంలేని ఈ జనాన్ని, ఈ సమాజాన్ని మార్చటం అసలు జరిగేనా? ఏ ప్రవక్తయినా సమస్త జనావళీ అర్థం చేసుకునే ఓ మార్గాన్ని బోధించాడా? నీకు నవ్వు రావటంలేదు కదా ఈ వెర్రి ప్రశ్నలకు? ఒకోసారి అన్పిస్తుంది... ఈ జీవితం ఎందుకు? అసలు మనమెందుకు బతుకుతున్నట్టు? ఏదయినా రహస్యం దాగి ఉందా? మనం ఈ భూమ్మీద ఇలా చరించటానికి. నాకు దేవుడిమీది నమ్మకం లేదనుకో. అయినా సరే ఇలాంటప్పుడే భక్తి కలుగుతుందనిపిస్తుంది. ఇంతకాలం ఈ విషయాలు తెలీనే తెలీదా అంటే.. కొన్ని ఊహించాను. కొన్ని రాజీపడ్డాను. కొన్ని తెల్సుకుని సంతృప్తిపడ్డాను. అయినా కొన్ని కొత్త ప్రశ్నలు. కొత్త జవాబులు వెతుక్కోవాల్సిందే. పాత ప్రశ్నలకూ కొత్తగా సమాధానం కావాల్సిందే..."

కోటి సిగరెట్టు నలిపేశాడు నేలకేసి. అతడిలో అశాంతి. క్రమంగా మామూలు స్థితికొచ్చాడు.

"నవ్వు రావటం లేదుకదా?" అడిగాడు సందేహంగా.

"లేదు... నీ ప్రశ్నలు అర్థమయినయ్. చెప్తాను... ఎట్లా చెప్పాలా అనేది నాకూ అంతగా అర్థంకాని విషయం. కానీ ప్రయత్నిస్తాను. అయితే ముందొకటి నీకు తెలియాలి. నా జ్ఞానం కూడా అసంపూర్ణమయినదే. కనుక నేను చెప్పేది అల్టిమేట్ కాదు. ఒక ఆలోచన... ఒక మార్గం... ఇందుల్లో తప్పులు ఖచ్చితంగా ఉంటాయి. కానీ మనం సాగిపోతుండాలి... మనల్ని మనం దిద్దుకుంటూ... మార్గాన్ని సుగమం చేసుకుంటూ.

మనిషి జీవితానికర్థం గురించే ప్రపంచంలో తత్వవేత్తలందరూ ప్రయత్నించారు. వేరువేరు నిర్వచనాలూ... ధోరణులూ... ఉన్నాయి. జీవితానికి వేరే అర్థం లేదు. జీవితం జీవించటానికే. మనిషి అనే ప్రాణి అవతరించటం... ఆ మాటకొస్తే ఈ చరాచర జగత్తూ... ఈ సృష్టి వెనుక మహత్తర కారణమేమీ లేదు. కేవలం యాధృచ్ఛికం... పోనీ.. ఒక పరిణామ క్రమం అనుకో. ఆ క్రమంలో మనిషి ఉనికి ఇందాకే అన్నట్టు ఒక దశ. లేదూ ఒక స్థితి. ఈ రకంగా ఆవిర్భవించిన మనిషి తనలాగేపుట్టిన ఇతర జంతువులూ, రాళ్లూ, చెట్లూకంటే ఏ రకంగానూ ఉన్నతుడు కాదు... ఇది ఆవిర్భావం గురించి.

ఒక్కసారి మానవుడు అవతరించాక ఇతర మానవులతో సామాజిక సంబంధాలేర్పడటంతో ఒక నూతన జీవితం ప్రారంభమయింది. ఈ జీవితాన్ని ఒక్కొక్కరు ఒక్కోతీరుగా అర్థం చేసుకుంటారు. కొందరికిది శిక్ష. ఆత్మహత్య ఎందుకు చేసుకోకూడదు మనిషి? అని... ఎందుకంటే ఈ సమాజం మనిషి జీవితానికి ఏ సార్థకతా ఇవ్వదు. ఒక నిద్రా, ఒక మైధునం, ఒక పగలూ ఇవి తప్ప మనిషికి ఏమీ లభించటంలేదు. యివయినా కొద్దిమందికే సరిగ్గా అందుతున్నాయనేది ఒక విషాదం, అయినా వాస్తవం. అర్థం లేని బతుకులు కనుక ఈ జీవితం ఒక శిక్ష. లక్ష్యంలేదు... గమ్యంలేదు... అని కొందరి భావన. గతకాలమే మేలు అని బ్యాక్టుది నేచర్ అన్నాడు రూసో. అక్కడయినా ఆదిమ సమాజంలో సుఖపడతామని.

మొత్తానికి సామాజిక జీవనం క్లిష్టంగానే ఉంది చాలామందికి. తత్వవేత్తలందరూ నిర్వచించారు. కానీ చేయాల్సింది దీనిని మార్చటం. మార్చాలి. అందుకు ప్రయత్నించాలి అనేది ఒప్పుకోక తప్పని సత్యం. ఒక మహోన్నత మానవ జీవితం సాధించాలి. ఒక నూతన మానవుడిని ఆవిష్కరించాలి.

మనం సాధించగలమని నమ్ముతాం. పోరాడతాం. ఈ మేడిపండు సమాజానికి తొక్క వలిచి, పొట్ట విప్పి, పురుగులేరి, శుద్ధి చేసేందుకు ఒక బ్రహ్మాండమయిన ఉద్యమం అవసరం. అందుకే మన ప్రయత్నం. ఈ సమాజంలో ఉండే అత్యంత అమానుషమయిన అసమానతలూ, అన్యాయాలూ వీటిపాలబడే మెజారిటీ జనం... సామాన్యులూ... వీళ్లందరి తరపునా వీళ్లని కదిలించే బాధ్యత తీసుకుంటాం. ఒక నూతన సమాజాన్ని నిర్మించేందుకు అంతా వదులుకొంటాం.

అయితే సామాజిక జీవితంలో ఎప్పటికయినా ఆ నూతన వ్యవస్థలో అయినా మనిషి సుఖంగా ఉంటాడా? అందరూ సమానం అని... మనం మనిషిని ఎకనమిక్ బీయింగ్గా... ఆర్థిక దృష్టితో చూస్తున్నామని ఒక ఆరోపణ. మంచి జీవితం కల్పించినా మనిషికి సుఖం ఉండదనీ, మనిషిక్కావలసింది తిండి మాత్రమే కాదనీ ఆ ఆరోపణల సారాంశం.

ఇది క్లిష్టమయిన అంశం. మనిషికి మంచి భౌతిక జీవితమే కాక ఇంకా చాలా కావాలి. ఆ ఇంకేదో అనేదేంటనే విషయం ప్రస్తుతం చెప్పలేం. అదప్పటి మనిషి అవసరం కనుక అతను తేల్చుకోవాల్సిందే. ప్రాథమికంగా మనిషికి అన్నివిధాలా మంచి భౌతిక పరిస్థి




తులుండాలి. అప్పుడే ఏ వికాసమయినా సాధ్యపడుతుంది. కనుక ఈ మానవీయమయిన డిమాండ్‌కోసం నిలబడి పోరాడటం అనేది మనిషిగా పుట్టినవాడి బాధ్యత. ఈ పని చేస్తేనే నీకూ నీ జీవితానికీ సార్థకత. అదే ఈ సమాజానికి ఉపయోగం.

నేనేం చెయ్యాలి అన్నావు.

ముందే చెప్పినట్టు సంఘర్షణ... కొనసాగించటమే 'ఎవరయినా చేయగలిగేది. నీకు వీలయిన పద్ధతిలో నీ పరిమితులకు లోబడి... అసలు పరిమితులు లేవు అనుకుంటే ఇంకా మంచిది'' చాలా సేపు మాట్లాడాడు రాజు.

మధ్యాహ్నం అవుతుండగా బయటకు పోయి టీ తాగి వచ్చారు. సిగరెట్ పొగని పరిశీలిస్తున్న కోటిలో వేయి ఆలోచనలు.

ఓ గంట నిద్రపోయారు.

సాయంత్రం రాజు ముందుగా లేచి కూర్చున్నాడు. కోటిని లేపాడు. ఈసారి ఆచరణా, అందులో వచ్చే కష్టనష్టాలూ... ముఖ్యంగా గ్రామ ప్రాంతాల్లో రాజు అనుభవాలు కొన్ని చర్చలోకి వచ్చాయి. రాత్రి ఏడింటికి కాలనీ చివరిదాకా తోడువచ్చాడు రాజు.

చివరిసారిగా అన్నాడు.

"నిర్ణయించుకోవల్సింది నువ్వు. ఎందుకంటే నిలబడాల్సింది నువ్వు. నీకు అదే ఇష్టమనుకుంటే వచ్చేయ్. లేదూ ఇక్కడే చేతనయిన పనులు చేస్తుంటానంటే పర్లేదు. ఎలా అయినా నీ ఇష్టం"

కోటి తల ఊపాడు.

"నీక్కావలసినంత సమయం తీసుకో. ఏ విషయం తెలియజేస్తే నిన్ను నాదగ్గరకు రప్పించే ఏర్పాట్లు చూస్తాను. ఉంటానుమరి రాత్రికి వెళ్లిపోవాలి''

ఇద్దరూ కరచాలనం చేసుకున్నాక కోటి వెనక్కి తిరిగాడు. పదడుగులు నడిచాక గుర్తొచ్చింది. కదలబోతున్నాడు రాజు. తనే వెళ్లాడు.

"అన్నట్టు... శరత్ మా రూంలోనే ఉన్నాడు''

"శరత్...!?" ఆశ్చర్యం.

"ఊc! ఈమధ్యనే ఇంటినుంచి వచ్చాడు''

"ఏం చేస్తున్నాడు?"

"ఉద్యోగాన్వేషణ"

కొంత నిశ్శబ్దం.

"ఆలోచిస్తున్నాడా?"

"ఊc... పాజిటివ్‌గానే ఉంటాడు. ప్రస్తుతం కుటుంబ సమస్యలు. నీకు తెల్సుకదా! తండ్రి మోసం. కొంతకాలం ఏదయినా జాబ్ చేస్తే వాళ్లని నిలబెట్టొచ్చని తన ఊహ. అయినా తనేమిటో అర్థంకాడు నాకు. నా లోపం కావచ్చు''

"తనొచ్చిన సామాజిక జీవితం, కుటుంబ సంబంధాలూ, పెరిగిన స్థితిగతులూ వేరు. అంతగా మనకి అర్థంకాడు. అంటే మనకులా, స్పష్టంగా తిన్నగా ఉండదు తన ప్రయాణం. పడుతూ, లేస్తూ... మొత్తానికి ఆగడనే నా నమ్మకం"

★ ★ ★

లైబ్రరీ చీకటి సందుల్లో పుస్తకాల రాక్‌ల మధ్యనుంచీ కొంచెం దుమ్మూ, ఇంకొంచెం బూజూ దులుపుకొని ఎంతోకొంత జ్ఞానాన్ని ఎక్కించుకున్న సంతోషంతో తలను సవరించుకుంటూ గేటుదాటి చిక్కడపల్లి సందులోంచి మెయిన్ రోడ్డెక్కాడు శరత్.

రోడ్డంతా జన సమ్మర్దం. బస్సులు కిటకిటలాడుతూ తిరుగుతున్నాయి. ముందున్న వెహికిల్స్‌మధ్య ఏమాత్రం సందున్నా దూరిపోదామన్న తహతహతో ఉన్న డ్రైవర్ల చేతిలో కళ్లాలు విడిచిన గుర్రాల్లా పరిగెత్తుతున్నాయి ఆటోలు.

శరత్ ఒక్కసారిగా ఆగిపోయాడు. ఎదురుగా క్రిస్టల్ కాఫీ బార్ పక్కన ఏదో బార్ అండ్ రెస్టారెంట్ కనబడుతోంది.

"నామీద ఒట్టు. నువ్వు మళ్లీ తాగితే'' అని తన మృదువైన చేతులమధ్య బండబారిన నల్లని తన చేతిని నొక్కుతూ ఒట్టు వేయించుకున్న మాధురి.

"ఇంకొంచెం పట్టుదలగా చదివితే ఫస్ట్ రాంక్ నీదే'' అని ఎంకరేజ్ చేసే ఎడ్మయిరింగ్ చూపుల మాధురి.

"చదువులోనూ పాటల్లోనూ ఎలా... ఎలా సాధిస్తున్నారు ఇంత పర్‌ఫెక్షనెస్?" అని ఆశ్చర్యపోయి చిన్నపిల్లలా పొంగిపోయిన మాధురి. అప్పట్లో తనకు పాటలు వచ్చేవి ఆమెదగ్గర మాత్రమే.

మాధురి...

ఎక్కడుంది?

జేబులోంచి కొన్ని కాగితాలూ ఇంకొన్ని పాత బస్‌టిక్కెట్లూ బయటకు లాగాడు. జాగ్రత్తగా ఒక్కొక్కటీ శల్యపరీక్ష చేసి నాలుగు మడతలున్న ఓ పెద్ద కాగితాన్ని విప్పి చూస్తే కన్పించింది ఒకపక్కగా చిన్న బాక్సులో... మాధురి చిరునామా. కాచిగూడా అవతల రైల్వేక్వార్టర్సు దాటిపోవాలి. ఇంతకీ వెళ్లటమా మానటమా, వెళ్తే ఇప్పుడా తర్వాతా...? ఇప్పుడిప్పుడే చీకటి పడబోతోంది. కనుక రేపెప్పుడయినా ఓ ఉదయాన లేక పగలు ఏదొక సమయంలో... వెళ్లొచ్చు.

ఊపిరి పీల్చుకుని నడిచాడు రూం వైపుగా.

దారిలో మెస్ కనపడుతోంది. ఆకలి గుర్తొచ్చింది. కానీ అంతకుముందే చిల్లులతో నిండిపోయిన మెస్ టికెట్ గుర్తొచ్చింది. పక్కనే ఇరానీ హోటల్‌లో మంచినీళ్లు తాగి రోడ్డెక్కి నడిచిపోబోతుండగా తెలిసొచ్చింది కడుపులో కరకరమనే శబ్దం... ఆకలి శబ్దం.

చటుక్కున వెనుదిగిరి నడవటం ప్రారంభించాడు.

గంటన్నర నడక. రైల్వే క్వార్టర్సు దాటుతుండగా క్రమంగా అందాకా పేరుకుపోయిన దిగులూ, ఒంటరితనం స్థానే ఒకలాంటి ఉద్విగ్నత. ఈ హైదరాబాద్ మహానగరాన ఒక మూలగా చిన్న అద్దెరూంలో అనిశ్చితంగా దేనికోసమో ఎదురు చూస్తూ రోజురోజూ గండంలా ఎదురొస్తుంటే ఇవ్వాళ్టి ఈ ఆకలీ దాహం నిండిన శరీరం... మనసూ ఒకింత ఓదార్పుకోసం అలమటించి, క్షణక్షణానికీ పెరిగి ఈ మాధురి ఇంటిదిశగా నడిపించాయి.

ఏం ఆశించి ఇంతదూరం నడిచి రావటం?

మాధురీ! మాధురీ! నీ మహాద్భుతమైన ఆ చల్లని చిరునవ్వునివ్వు. ఒక్కసారి చూసి కళ్లు నింపుకొని, మనసు నింపుకొని ఈ నరకంలోంచి నడిచెళ్లిపోయేందుకు శక్తిని పొందుతాను. నీ ప్రియమైన, అపురూపమైన నయనాలతో ఒకే ఒకసారి కరుణగా దయగా నన్ను దీవించు. జీవితపు ఎడారినుంచి ఆ దరిచేరే స్థైర్యాన్ని సంపాదిస్తాను. అంతే.

ఒకటిరెండుచోట్ల విచారించి తనక్కావలసిన ఆ ఇల్లు పట్టుకోగలిగాడు. ఇల్లు అంటే రెండంతస్థుల బిల్డింగది. క్రీమ్ కలర్ వాష్‌తో లైటు వెలుగులో గోడలు మత్తుగా మూలుగుతున్నట్టున్నాయి. నల్లని ఇనుపగేటు దాటి మెట్లెక్కి కాలింగ్‌బెల్ నొక్కాడు.

లోపల అడుగుల చప్పుడు. మెత్తని చప్పుడు.

సంచలనం... ఉద్విగ్నత.

ఇప్పటికయినా మించిపోయింది లేదు. వెనుదిరిగి ఐదడుగులు వేస్తే... గేటు దాటితే... ఆలోచన కొలిక్కి రాలేదు.

"ఎవరూ?"

నల్లని మెరిసే ఉడెన్ డోర్ క్లిక్‌మంటూ తెరుచుకుంది.

దబ్బపండు ఛాయ, ఖరీదయిన చీర, నిండుతనం, మెరిసే మొహం, కళ గలిగిన ఆకారం.

"మాధురీ... నేను'' ఒకడుగు ముందుకు వేశాడు శరత్.

మాధురి మొహంలో ఆనందం... కాదు...




ఆశ్చర్యం.

"రా... శరత్' లోపలకు నడిచింది.

ముందు గదిలో కుందేలు చర్మం పరిచారా అన్నంత తెల్లని మెత్తని సోఫామీద అంటీఅంటనట్లు జాగ్రత్తగా కూర్చొని 'దాహం' అని అడిగేంతలోనే అందమైన ట్రేలో, మరింత అందమైన గ్లాసులో కూలింగ్ వాటర్ తెచ్చింది ఆమె.

గ్లాసు చల్లదనంతో చెమర్చుతోంది. ఎందుకో తనకీ, ఆ గ్లాసుకీ సాపత్యం గోచరించింది. చెమటలు తుడుచుకున్నాడతడు.

"చెప్పు శరత్... చాలా మారిపోయావు'' సానుభూతిగా అంది.

"నువ్వు మాత్రం" అన్నాడు.

అవును. మాధురి కూడా మారింది. చర్మం ఎరుపెక్కింది. బుగ్గలు లావెక్కాయి. శరీరం బొద్దయింది. నగలు ఖరీదయినవి మెడెక్కాయి. ధరించిన చీర యెరుపెక్కింది. అన్నీ ఎక్కువే.

తనో? అన్ని రకాలుగా చిక్కాడు.

కానీ... ఆమె కళగానే ఉన్నది- కానీ, ఏదో లోపం. ఆ కళలో కొంచెం ప్రేతకళ ఉందా అని ఒక అనుమానం. చర్మం దబ్బపండు ఛాయే కానీ అది పాలిపోయిన, వాడిపోయిన దబ్బపండు. వొళ్ళొచ్చింది. కానీ దాంతో పాటే తలలోకి కొన్ని తెల్లవెంట్రుకలు వచ్చాయి. బహుశా విపరీతమయిన ఆలోచనలు ఆమెని బాధిస్తుండాలి. కానీ ఇల్లు చూస్తే ఇంట్లో సామాగ్రి చూస్తే ఈ పరిసరాల్లో బాధనేది ఉండే అవకాశం లేదే.

"ఏం చేస్తున్నావు?"

"ప్రస్తుతానికి నిరుద్యోగం" కొంచెం సిగ్గుగా జవాబిచ్చాడు.

"ఊం! ఇంకేంటి?"

"మొన్నామధ్య మీ ఫ్రెండు రాధ కాబోలు లైబ్రరీలో కనపడి నీ అడ్రసు ఇచ్చింది. మీ...మీ...శ్రీ...వారు రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తారటకదా! ఒకసారి కలుద్దామని ఇటుగా వెళ్తూ..."

"రాధా? అదేం చేస్తోంది?"

చెప్పాడు.

ఇంకొందరి స్నేహితుల వివరాలు అడిగింది. పావుగంట సంభాషణ. కొంచెం బిడియం పోయి...

"నువ్వు... నువ్వెలా ఉన్నావు మాధురీ'' వణికే గొంతుతో అడిగాడు.

ఒకే ఒక్కక్షణం ఆమె మొహంలో ఒక అస్పష్టమయిన భావం.

"చూస్తున్నావుగా''

కొంత నిశ్శబ్దం. ఆమె లోనికెళ్ళి వచ్చింది. తనెందుకొచ్చాడో, ఏం మాట్లాడుతున్నాడో, ఏం చేస్తున్నాడో అర్థంకాని అయోమయం ఒక్కసారి అర్థమయ్యి.

"వస్తా... మాధురీ'' అని లేచాడు.

"ఉండు. భోజనం చేద్దువు'' వారించింది.

"ఎందుకూ... ఇబ్బంది''

"ఇబ్బందేముంది? కుక్కర్ పెట్టేశాను''

మళ్ళీ సోఫాకి చేరగిలబడి చూపుల్నెటు తిప్పాలో అర్థంకాక షెల్ఫ్‌లోని పుస్తకాలనూ, షోకేస్‌లోని ఆర్ట్ పీసెస్‌నూ, అప్పుడప్పుడు మాధురినీ చూస్తున్నాడు. లీలగా స్టీమ్ వస్తున్న శబ్దం. ఆమె వేళ్ళనీ, గోళ్ళనీ నెయిల్ పాలిష్‌నూ పరిశీలిస్తోంది తలొంచుకుని.

ఆకలి.

ఇందాక గ్లాసులో మిగిలిన నీళ్లను గొంతులో ఒంపుకున్నాడు. కుక్కర్ విజిల్ వేసింది. లేచి నడవబోయిన మాధురి ఆగింది.

బయట 'డగ్‌డగ్' మని బైక్ ఆగిన శబ్దం.

త్వరగా నడిచి డోర్ తెరిచింది. బయట స్టాండ్ వేసేందుకు ప్రయత్నిస్తున్న ఆకారం- ఏదో గొణుక్కుంటూ తిడుతున్నట్టుంది.

సహాయం కోసం శరత్ వచ్చాడు.

"నేను స్టాండ్ వేస్తాను. మీరు పదండి''

గప్పుమన్న స్కాచ్ విస్కీ వాసనలోంచి తలతిప్పి.

"థాంక్‌యూ... కమ్ మధూ..." అని మాధురి భుజాలపై బరువుమోపి కష్టమ్మీద సోఫాలోకి చేరి వాలిపోయిన ఆ మనిషి అప్పుడే లోనికి వచ్చిన శరత్‌ను గుడ్లు మిటకరించి చూశాడు- గుడ్డుపై మత్తుగా వాలిన కనె్రప్పల్ని విడదీసే యత్నం చేస్తూ... ఒక్క కన్నే అందుకు సహకరిస్తోంది.

"శరత్ అనీ... నా క్లాస్‌మేట్" చెప్పింది మాధురి.

"ఓ ఫ్రెండ్... ఐమీన్ బాయ్‌ఫ్రెండ్' గొణిగాడు.

ఆమె మొహం పాలిపోయింది.

"ఓ.కే. కారీ ఆన్' లేచి నడవబోయి సోఫాలో కూలిపోయాడు.

"కొంచెం సాయం చెయ్యి''

ఇద్దరూ కలిసి అతన్ని బెడ్‌రూంలోకి మోసుకెళ్ళారు. ఫ్యానువేసి దుప్పటికప్పి లైటార్పింది. మళ్ళీ ముందు గదిలోకి నడిచాక...

"వస్తాను'' అన్నాడు.

"అన్నం... తినెళ్ళు''

"వద్దు''

చెప్పుల్లో కాళ్ళు దూర్చాడు.

"ఆయన... ఆయన... మంచి వారే... ఇలాంటప్పుడే... తాగితే కొంచెం తెలీదు. లేకుంటే నన్ను బాగా చూసుకుంటారు'' చిన్నగా అంది.

"కాదన్లేదే నేను''

ఆమె మొహం మ్లానమయ్యింది.

అతడు పరిశీలనగా చూశాడు.

మాధురీ... ఎక్కడ నీ మహాద్భుతమయిన చిరునవ్వు? ఎక్కడ నీ దయగల, కరుణ నిండిన నయనాలు?

★ ★ ★

ఆ రాత్రి మాధురి ఇంటినుంచి వచ్చాక...

"ఏంటోయ్? అదోలా ఉన్నావు'' అడిగాడు కోటి.

కొంత జీరబోయిన గొంతుతో చెప్పాడు మాధురి ఇంటికి వెళ్ళివచ్చిన విషయం.

ఓ నిట్టూర్పు వదిలి.

"బహుశా ఏ యువతీ తప్పించుకోలేని పరిస్థితి అది. అతడు తాగుతాడు. కనుక మాధురి జీవితం దుఃఖభాజనం అయిపోయిందనుకొంటున్నావా? ఆమె భర్త తాగుతాడేమో. కానీ... నేను ఘంటాపథంగా చెప్పగలను... కాలేజ్ చదువు ముగించి పెళ్ళిచేసుకున్న ఏ అమ్మాయినయినా ఏ రెండు మూడేళ్ళ తరువాతో... పరిశీలించు... ఆ భర్త మంచివాడే... బుద్ధిమంతుడే... చెప్పాలంటే ఏ అలవాటూ లేని... మా మంచి బాలుడే అనుకో... అయినా సరే... ప్రతి అమ్మాయీ ఓ మాధురే. అసంతృప్తి... ఆవేదన..." అన్నాడు కోటి.

"ఎందుకనీ?"

"డ్రైనెస్... లాక్ ఆఫ్ హ్యూమన్ టచ్. మానవ స్పర్శ కోల్పోయి మొద్దుబారిపోయి... అందులోనూ ఇవాల్టి వేగవంతమయిన సమాజంలో స్టార్... జీ టివిలు రోజు మొత్తాన్ని హరాయించి... భార్యాభర్తలు కూడా... బహుశా ఆ రెండూ నిముషాలూ తప్ప... ఒకరి నొకరు తెలుసుకొనే సమయం లేక... అప్పుడు కూడా ఏం తెలుసుకొంటార్లే... భారం దించుకొందామన్న ఆతృత తప్ప..."

కోటినుంచీ ఆ రకమయిన విశ్లేషణ ఎన్నడూ విని ఉండకపోవటంతో శరత్ దాదాపు దిగ్భ్రాంతి చెందాడు.

"ఎలా చెప్పగలుగుతున్నావు?"

"అనుభవం. మా... కుటుంబాల్లో చూస్తూనే ఉన్నాగా..."

"సరే... మరి ప్రతి... అమ్మాయీ





అన్నావు..."

"ఆహాం! మినహాయింపు దాదాపుగా లేదు. మాధురి అయినా... మాధవి అయినా..."

"అదేంటి" కీచుమన్నాడు శరత్.

"అది అంతే... అన్నట్టు ఇందాక లైంలేక... మానవ స్పర్శ కోల్పోయి అన్నాను కదూ! అది మాత్రమే కాదు నా ఉద్దేశ్యం. వేగవంతమవటం ఓ కారణమే... కానీ అసలు కారణం... హెజ్ మనీ... ఆధిపత్య ధోరణి. మగాడు దాన్నించి విముక్తి... అంటే వదిలించుకోనంత కాలం... స్త్రీకి విముక్తి లేదు. అందుకే మాధురీ మాధవీ ఒకటే అన్నాను"

"మరి రాధాకృష్ణా..."

"ఆహాం! అతను అయినాసరే... అఫ్‌కోర్స్ వాళ్ల సహజీవనం ఇవాల్టి సమాజస్థాయికంటే ఖచ్చితంగా మెరుగే అయితే. స్టిల్ అసమానత... ఓ గమ్మత్తు సంగతి చెప్పనా... మగాడికి సహజంగా ఇవ్వాళ ప్రివిలేజెస్ ఉంటాయి. అతని జెండర్ కారణంగా అతడి ప్రపంచం చాలా పెద్దది. మాధవి ప్రపంచం... మాధురి కంటే పెద్దదే అయినా అదెన్నటికీ ఈ సొసైటీలో ఓ మగాడికి లభించినంత ఉండదు. అంటే అర్థమయిందా? రాధాకృష్ణ ఎన్నుకొనే స్థానంలో ఉన్నాడు. మాధవి... విను... ఆమెకి ఎన్నుకొనే స్వేచ్ఛ ఉన్నట్టే కన్పించినా... ఆ ప్రివిలేజెస్ లేకపోవటంవలన ఎన్నుకోబడే స్థానంలో ఉంటుంది. మొత్తం వ్యవస్థ మారనంతవరకూ రాధాకృష్ణ మాధవీల సంబంధంలోని అసమానత అలాగే ఉంటుంది"

"అబ్బ... అయితే ఇది వాళ్లకి తెలుసా?" కోటి భుజాలెగరేశాడు.

"తెలుసుకొనే ఉంటారు. తెలీకపోయినా వాళ్ల డిమాండు అదే ఇప్పుడు. పురుషాధిపత్య వ్యతిరేక పోరాటం..."

"అదేంటి?"

"అదే ప్రస్తుతం ఆ పోరాటం మన మీదే మొదలు పెట్టారు"

"మరి నువ్వేమంటావు"

"ఇందాక అన్నానే ఆయా ప్రివిలెజెస్... భౌతిక పరిస్థితులు మారకుండా సమానత అనేది రాదని... కాబట్టి వ్యవస్థ మారటం జరగాలి"

"వాళ్లేమో తెలీకపోయినా డిమాండ్ చేస్తున్నారంటున్నావ్... నువ్వేమో తెలిసినా ఒప్పుకోనంటున్నావ్... అంతా గజిబిజి" తల పట్టుకొన్నాడు శరత్.

"అప్పుడే ఏమయింది దాసు సంగతి అడిగావే మొన్న..." నవ్వాడు.

"ఆం! అవును"

"దాసు ఈమధ్య మన యూనివర్సిటీలోనే రీసెర్చిలో చేరాడు. అక్కడినుంచీ మన మీద బాణం వదిలాడు"

"ఏమనీ..."

"కులాధిపత్యం గురించి... అగ్రకుల ఆధిపత్యంలోనే ఉన్నామన్నాడు"

శరత్‌కి మొదటిసారిగా సందేహం వచ్చింది. నాలుగేళ్ల హాస్టల్ జీవితం... స్నేహం తర్వాత.

"ఏదే కులం... ఆహాం! నా ఉద్దేశ్యం..."

"అర్థమయింది. ఖంగారుపడకు... అగ్రకులం అయితే కాదు"

"మరి..."

"అయినాసరే అగ్రకుల భావజాలంలోనే ఉన్నామన్నాడు"

శరత్‌కి మళ్లీ తల తిరిగింది.

"నీది అగ్రకులం కాదంటున్నావ్... దాసుకి తెలుసంటున్నావ్... అయినా నీది అగ్రకుల భావజాలం అన్నాడా?"

"అన్నాడు..."

"కోటీ..." నీరసం.

"భయపడకు... నీకు కొత్తకదా! హేమరేజి

వస్తుంది. వాళ్లన్నదీ, నేనన్నదీ నీకు అర్థం కావాలంటే టైం పడుతుంది. ముఖ్యంగా ఆ ప్రయత్నం నీలో ఉండాలి''

"సరే... ట్రై చేస్తా. అవునూ మరి దాసూ, మాధవీవాళ్లూ పరస్పరం ఎలా ఉంటారు?"

"అంటే?"

"వాళ్ల వాదాలున్నాయి కదా! ఒకరినొకరు అర్థం చేసుకుంటారా?"

"నాకు తెలిసి.. అర్థం చేసుకొంటారు''

"అయితే కల్సిపోయారు.. మనమే''

"ఆగు.. అర్థం చేసుకుంటారుగానీ... సమర్థించరు. వాళ్లు కలవరు''

"ఇదేంటిమళ్లీ''

జుట్టు దగ్గరకు పోతున్న శరత్ చేతుల్ని లాగేశాడు కోటి.

"ఈ జుట్టు నీదికాదు నాది''

"సారీ... నా జుట్టనుకున్నా''

"మొత్తానికి భయపడ్డావు. అట్లాకాదు... మనం తెలుసుకోవలసింది చాలా ఉంది. మనమూ వాళ్లూ కూడా. ఇప్పుడే కదా మొదలు... ముందుంది అవునూ... దిగులుగా వచ్చావేంటి, మాధురి దగ్గర్నించి''

శరత్‌కు మళ్లీ దిగులు వేసింది.

"ఏంటో.. మాధురి... నిజంగా ఇప్పుడాలోచిస్తున్నా, అప్పుడు నేను ప్రేమించింది మాధురినేనా? అసలు అది ప్రేమేనా? ఆమె మాధురేనా? అని. అందుకే దిగులు''

అర్థం కానట్టు చూశాడు కోటి.

"నాకూ అర్థం కాలేదులే. భయపడకు'' అన్నాడు శరత్.

ఇద్దరూ మౌనంగా పడుకున్నారు.

తెల్లారి శరత్‌ను లేపాడు కోటి. చేతిలో బ్యాగ్ ఉంది. మత్తొదిలిపోయి లేచికూచున్నాడు శరత్.

"ఎక్కడికీ?"

"మా ఊరుపోయివస్తా. కొంతటైం పడుతుందే''

"మరి జాబ్ ప్రయత్నాలు''

"నాకు ఇంట్రస్ట్ లేదు లేబ్బా... నీ అంత. సరే నేను రావటం లేటయినా... నువ్వు పావనిని కలువు. అడ్రస్ ఇదిగో. మర్చిపోకు... నువ్వెక్కడుందీ తెలీక... మిస్సవుతాం. ఉంటామరి... రాత్రి అన్నది మర్చిపోకు. ప్రయత్నం ఆపొద్దు''

కరచాలనం చేశాడు బలంగా.

★ ★ ★

దొరికిందాంట్లో దూరిపోవటమా? మంచిదొచ్చేవరకూ కాచుకుని ఉండటమా? ఏ కలుగయితేనేం అనుకొంటే పర్లేదు దూరిపోవచ్చు మంచి కన్నం... తన కోసం కాచుకొని ఉందా? చీమలు పెట్టిన పుట్టలు.

వెళ్లిన మూడు ఇంటర్వ్యూలలో రెండింటికి సెలెక్టయి కేవలం వాళ్లడిగిన రెండు సంవత్సరాల బాండూ ఇవ్వలేక... వాళ్లిచ్చే అతి తక్కువ జీతం... బాండయ్యాక రెండు రెట్లవుతుందని వాగ్దానాలు చేస్తున్నా... ఇంజనీరు అంటే ఒకప్పటి భావన... రాజమకుటం... స్వప్నకిరీటం... బెదిరిపోయి బంగారప్పూత ఊడిపోయి లోపల రాగి, ఇత్తడి బయటపడి...

మామూలు బి.ఏ, బికాం డిగ్రీలలాగే ఇంజనీరింగ్ డిగ్రీ అయిపోయే రోజు అతి దగ్గరలో ఉందని అర్థమయ్యి.

ఏదొక దాంట్లో చేరిపోయి లాగించేద్దామా? లేక కొంతకాలం పోటీ పరీక్షలు రాసి ఏ ఐఏఎస్సో, గ్రూప్ ఒన్నో కొట్టేద్దామా?

దొరికిన కన్నంలో దూరటమా? కన్నం దొరికేవరకూ ఆగటమా? అన్న సందిగ్ధంలో ఆ రేకులషెడ్లో కూచుని ఉన్నాడు శరత్.

తెచ్చుకున్న డబ్బు అయిపోవచ్చింది. మెస్ టికెట్ ఇంకా కొన్లేదు. ఏ రోజు పేమెంట్ ఆ రోజే ఇస్తున్నాడు. కాబట్టి మరింత వేగంగా ఆ డబ్బు అయిపోతోంది. ఇంకో రెండు రోజులకి? ఏమవుతుంది?




ఇప్పటికే లైబ్రరీకి తప్ప మరెక్కడికీ వెళ్లటం లేదు. బయట తిరిగితే ఖర్చులబాధ. తిరక్కపోతే మానసిక బాధ. ఈ రేకుల షెడ్లో కూచుని ఉన్న పుస్తకాలు తిరగేస్తూ... శేషగిరి రాకపోకలు గమనిస్తూ... అతడి పుస్తకాలు చదివేస్తూ... బయటకు పోలేక..

ఇక్కడ కూర్చోలేక...

పొద్దున్నా మధ్యాహ్నమూ టీలు తాగే నిమిత్తం ఇరానీ హొటల్లో పేపర్ పఠనాలు.. గంటలు గంటలు నీళ్లుతాగుతూ అప్పుడప్పుడో చాయ్ తాగుతూ తీసుకెళ్లిన పుస్తకాన్ని హొటల్లోనే నమిలేస్తూ...

బహుశా ఎక్కువ భాగం రోజుని ఇరానీ హొటల్లోనే గడిపేస్తున్నాడు. ఆ హొటల్ రేకు షెడ్డుకి దగ్గర్లోనే కన్పిస్తూంటుంది. ఇటు వచ్చేపోయే వాళ్లూ కన్పిస్తారు.

అక్కడ కూర్చుని తనకోసం రాబోయే పోస్ట్‌మాన్ కోసం నిరీక్షణ. ఏ అపాయింట్మెంటో.. ఏ మనియార్డరో... రాకపోదా? ఎంత అమానుషం... పోస్ట్‌మాన్ ఆ సందులోకే రావటం లేదు. ఎందుకనీ...

తనకో శుభవార్త మోసుకొని... సువార్త మోసుకొని... రాడేం? పునరుద్ధానంలా తిరిగొస్తాడా చంకన ఉత్తరాల సంచితో? అప్పుడెప్పుడో రమణ రాసిన ఉత్తరం అందింది. అంతే... అన్నట్టు రమణ తన భౌతిక కాయాన్ని వాళ్ల ఊర్లో అప్పుడే వెలిసిన ఓ కంపెనీలోకి చేర్చాడట. ఆ మాత్రం ధైర్యం తనకు లేకపోయింది. కానీ అలా చేరిస్తే తర్వాత ఏ మంచి జాబ్ ఆఫర్ వచ్చినా భౌతిక కాయాన్ని పీక్కోలేక లాక్కోలేక చావాలి... బాండ్ బోనులోంచి.

ఇంతకీ అసలేదయినా మంచి ఆఫరే వస్తుందంటావా? ఎప్పటికయినా?

వెయిట్ అండ్ సీ.

ఏడీ పోస్ట్‌మాన్.

ఎవైటింగ్ గోడో.

రెండు రోజులు పూర్తిగా బయటకు కదలకుండా ఉండిపోయాడు. ఆ రేకులూ... ఆ గదీ... ఆ పుస్తకాలూ...

అదో నరకం.

ఆత్మ నరకం...

ఎట్టకేలకు ఓ శుభ సమయాన పోస్ట్‌మాన్ కేకపెట్టాడు బయటినుంచీ. సర్వశక్తినీ కళ్లలోనే పెట్టి అతడిచ్చిన రీడైరెక్టు ఉత్తరాన్ని అందుకున్నాడు... వణికే చేతులతో...

ఇంటికెళ్లి తిరిగొచ్చిందా కవర్. చించి చదివాడు.

జూనియర్ రీసెర్చి ఫెలోగా... టెంపరరీ జాబ్.

యూనివర్సిటీలో... అదే డిపార్ట్మెంట్‌లో.

మిస్టర్ శరత్... యూ ఆర్ అప్పాయింటెడ్ యాజ్... తన కళ్లను తనే నమ్మలేక... టెంపరరీ అయినాసరే... ఈ ఆత్మనరకం నుంచీ విముక్తి కావాలన్న... చిరకాల వాంఛ నెరవేరిన ఈ క్షణంలో...

కోటీ... నువ్వెక్కడున్నావ్. నీతో ఈ ఆనందాన్ని పంచుకొంటే మళ్లీ నేను యూనివర్సిటీలోకి అడుగుపెట్టే ఈ మహాద్భుత క్షణాన... హాపీడేస్... ఎగైన్... మళ్లీ ఆ మంచి రోజులు ఆ చైతన్యవంతమయిన రోజులు వచ్చేశాయ్.

దూకేస్తున్నాను.

ఆ జీవజల సజీవ చైతన్య ప్రవాహంలోకి.

ఆ యూనివర్సిటీ జీవితంలోకి

రిటర్న్ ఆఫ్ ది డ్రాగన్

 

ఇంకా వదలని చలి. రాత్రల్లా వణుకుతూ కూచున్న చెట్లు, ఇప్పుడిప్పుడే... రాబోయే నులివెచ్చని ఉదయానికి స్వాగతం చెప్పేందుకు ఆకులు విదుల్చుకొని గాలికి కదులుతున్నాయి. చల్లని చలిగాలి. మరి కాసేపట్లో ఎటూ నులివెచ్చని ఎండ అనంత గగనవీ

మనుంచి నేలకు దిగుతుంది. ఈ నేలా ఈ చెట్లూ, ఈ తోటలూ, ఈ మహా ప్రాసాదాలూ అన్నీ ఆ వెచ్చదనంలో మునిగిపోక తప్పదు. లోలోపలి చైతన్యాన్ని దాచుకుందామన్నా సాధ్యంకాక ప్రపంచానికి ప్రదర్శించకా తప్పదు.

ఇంకా చిరుచీకటి... గమ్మత్తుగా నేలమీద పరుచుకునే ఉండగా... నేలకు సమాంతరంగా సుదూరంలో ఆకాశం వంగుతున్న చోట నల్లటి మబ్బుల వెనుక ఏదో మహాద్భుతం జరగబోతున్నట్టు... ఒక కాంతిరేఖ స్కేలు బద్దలా మబ్బుల్ని తొలుచుకుని ఏటవాలుగా పైకి పోతూంది. అక్కడ అడ్డంగా నిలిచి ఉన్న పెద్దదూది కొండలాంటి మబ్బుని స్పర్శించి ఇంక దారిలేక పరావర్తనం చెంది ఇంకా మిగిలిన అతికొద్ది వెలుతురుని భూమిమీదకు ఒంపుతోంది. ఆ వెలుతురులో తడిసి స్నానం చేస్తోన్న గుట్టలూ, చెట్లూ... సన్నని కాలిబాటలూ... నున్నని తారురోడ్డూ.

రోడ్డు పక్కగా పొగడ చెట్టుకింద బెంచీ మీద... ఒక కాలువేసి మరో కాలుమీద మోచేయి, దానిపైన రెండుచేతుల మధ్యా దాచుకున్న మొహం... వేళ్ల సందుల్లోంచి కనిపిస్తున్న ఆ సంధ్యా సమయాన్ని గమనిస్తున్నాడతడు. ఇంకా నిద్రలో మునిగి ఉన్న హాస్టల్ భవనాలు. అక్కడొకటీ ఇక్కడొకటీ వాహనాల చప్పుళ్లూ. ఇంకా ఆరిపోని హెడ్‌లైట్లూ. పసుప్పచ్చని కాంతిరేఖలూ.

ఎదురుగా గుట్టలు. వాటిమీదుగా చిట్టడివిలా విస్తరించిన చెట్లూ, తీగలూ. ఆ సాంద్రతరమయిన దృశ్యంలోని నిశ్శబ్దంలో విలీనమవుతూన్న అతడు.

మరి కాసేపటికి సూర్యుడు తొంగి చూడటం... నిత్యకర్మల కోసం పరుగెత్తబోయే జనం... అతడిని హెచ్చరించటంతో లేచి రోడ్డుమీదుగా ఇంకో సన్నని కాలిబాట మీదకు చేరి నడుస్తున్నాడు... న్యూ హాస్టల్ బిల్డింగ్స్ వైపుగా.

అతడు... శరత్ జూనియర్ రీసెర్చి ఫెలో

పద్దెనిమిదో నెంబర్ రూం తలుపు తోసుకుని తన బెడ్‌మీద కూర్చున్నాడు. కాలెత్తిపట్టి లేసులు పీకి, స్పోర్ట్స్ షూని మంచం కిందకు నెట్టి టవల్ కోసం అటు తిరిగాడు. రెండో మంచం మీద వేణుగోపాలరావు ముసుగుతన్ని పడుకొని ఉన్నాడు. అతడు ఎమ్‌టెక్ పవర్ సిస్టమ్స్‌లో ఫస్ట్ సెమిస్టర్‌లో ఉన్నాడు. అతడు శరత్ అలికిడికి లేచాడు.

ఆవులింత... ఉబ్బిన కళ్లు. ఎర్ర చారలు నల్లగుడ్డు చుట్టూ.

"గుడ్‌మార్నింగ్... టైమెంతా? ఇంకా... అబ్బ నిద్ర" మళ్లీ వాలిపోయాడు.

"సరేగానీ నిన్న నా పేస్టు... ఎక్కడుంది'' అతడి టేబుల్‌మీద వెతికాడు శరత్. గమ్‌బాటిల్ వెనకగా కన్పించింది. దానికిందేవో లెటర్‌లు.

డోర్‌లాగి వరండాలోంచి కుడివైపు చివరగా మరి నాలుగు రూంలు దాటిపోతే సింకులున్నాయి. తెల్లగా... చల్లగా నీళ్లుమొహం మీద జల్లుకొని ఇంత పొద్దున్నే పోటీ ఉండని కారణంగా మెల్లగా సింకు పక్కన కిటికీలో కూర్చుని ప్రశాంతంగా బ్రష్ చేసుకొంటూ బయటకు చూశాడు. రెండో అంతస్థులో కూర్చొని చూస్తే నేల చాలా క్రిందుగా కన్పిస్తోంది. ఎత్తయిన చెట్లు తలలూపి అతడికి అభివాదం చేస్తున్నట్టున్నాయి. పొద్దెక్కింది.

సింకులో ఊయటానికి మనసొప్పక వంగి తల దూరంగా పెట్టి దూరంగా ఊశాడు. నురగ గాలికి తేలుతూ చెట్లమీద పడింది. వెనుక అలికిడి కావటంతో కిటికీ దిగి సింకులో నీళ్లు వదిలి మొహం కడుక్కుంటున్నాడు తీరిగ్గా.

అద్దంలో మొహం... మొదటిసారి యూనివర్సిటీలో అడుగు పెట్టినప్పటి దృశ్యం గుర్తొచ్చింది. ఈ ఐదేళ్లలోనే చాలా మార్పు. మీసాలు, గడ్డం,, బండబారుతున్న మొహం.





కళ్లక్రింద ఎత్తవుతున్న దవడ ఎముకలు, బిగిసిపోతున్న శరీరం.

వానర పరిణామం.

'ఏంటిరా నీ ఆస్తి' అంటే 'చూసుకోనా శరీర సౌష్టవం' అంటాడు శంకరం. కొత్త మిత్రుడు. మెలి తిరిగిన పహిల్వాన్ శరీరం అతడిది.

తనకి మామూలు శరీర నిర్మాణమే సరిగ్గా లేదు.

ఈ ఐదేళ్లలో ఇంకా చిక్కాడు. విచిత్రంగా ఈ చిక్కటానికి వ్యతిరేకంగా తన వయసు అడ్డుపడి శరీరానికి ఎదుగుదల నిచ్చింది. చిక్కటం, ఎదగటం, రెండూ జరిగి బ్యాలెన్స్ నిల్ అయింది. అదే ఇంకో ఐదారేళ్లకయితేనా దిక్కుమాలిన రోగాలు దాడి చేస్తాయి.

మొహం అద్దుకుంటూ రూంలోకి ప్రవేశిస్తుండగా ఎదురు రూం తలుపు తీసుకొని కేయస్సార్కే ప్రసాద్‌బకెట్టులో వేణ్ణీళ్లు మోసుకొచ్చాడు. పొగలు... నీళ్లమీద అలల్లానే. ఇమ్మర్షన్ వాటర్ హీటర్‌లొచ్చి బ్రహ్మచారుల్ని బతికించాయి. హాస్టల్, ఇళ్ల యజమానుల్ని శిక్షించాయి.

అతడు వెళ్తుంటే రూంలోంచి కేకలు. అతడి రూంమేట్ శాస్త్రి అరుస్తున్నాడు. డోర్ బార్లా తీసి ఉంది. మూయమని కాబోలు నాలుగడుగులు వేసి ఆ రూంలోకి ఎంటరయ్యాడు శరత్. శాస్త్రి మంచం మీద ఉన్నాడు ఎప్పటిలానె.

"ఎనీ ప్రోబ్లం"

శాస్త్రి నొచ్చుకున్నాడు.

"ఈ ప్రసాద్‌గాడు... మేనర్స్‌లేవు వెధవకి. తలుపు దగ్గరకి వేయటం ఇన్నేళ్లకీ నేర్పలేకపోయాను''

వాళ్లిద్దరూ ఎస్వీయూ తిరుపతిలో కూడా రూంమేట్స్.

తలుపు గాలికి మూసుకుపోయింది. అందాకా కన్పించని పోస్టర్లు... తలుపు వెనుక అంటించినవి కనపడ్డాయి.

అప్రయత్నంగా పరిశీలించాడు. ఈమధ్య కాలంలో ఇంగ్లీష్ మాగజైన్స్ సెంటర్ స్ప్రెడ్ల్లో వస్తున్న అర్ధనగ్న శరీరాలు 'అర్ధ' అనుకోవాల్సిందే.

టాప్‌లెస్ రబ్బరు దేహాలు. గులాబీ, నేరేడు రంగుల కలబోత. చేతులో వెల్వెట్ క్లాతో, రుద్రాక్షమాలలో అడ్డుపడుతున్న స్థన సౌందర్యం... ఇంకా అమెరికనైజ్ కానందున అక్కడితోనే ఆపి పాఠకుల్ని అసంతృప్తికి గురిచేస్తున్న సంపాదక మహాశయుల చిలిపి నవ్వులు... ఆ పేజీల వెనుక దాగినట్టు గాలికి ఊగుతున్నాయవి.

ఒక బురద గుంటలోంచి లేచిన పద్దెనిమిదేళ్ల పడతి ఇంకో పోస్టర్‌లో ఉంది. ఆమె వంటిపై బురద తప్ప మరేమీ లేదనేది స్పష్టం, చేతిలో తాను రికమండ్ చేయదల్చుకున్న ఎనామిల్ పెయింట్ డబ్బా తప్ప.

"ఫైరింజన్ తీసుకొచ్చి... అన్పిస్తోందా'' అన్నాడు శాస్త్రి మంచంమీదనుండి.

"ఫైరింజనెందుకు ఓ బకెట్టు నీళ్లు చాలు. కానీ నా కన్పిస్తుందది కాదు'' నవ్వాడు శరత్.

"మరేంటో..."

"నిన్నా మంచం మీద నుంచి దింపటం... కాలేజికి పోయేప్పుడు తప్ప నిన్నింతవరకూ కూర్చుని ఉండగా చూళ్లేదు''

కిసుక్కున నవ్వాడు శాస్త్రి.

"ఎందుకు బాసూ వదిలేయ్. లైఫ్ హాయిగా నడిచిపోతుందిగా పోనీ. ఎందుకీ అనవసరపు హైరానా?"

"హాస్టల్ మొత్తానికీ తప్పుబట్టావయ్యా శాస్త్రీ"

"పోన్లే బాసూ. నన్నిట్టా వదిలెయ్''

"మరి వస్తా''

వెనక్కి తిరుగుతుంటే తలుపు వెనక పోస్టర్లు.

"ఇళ్ళ దగ్గర్నించి ఎవరన్నా వస్తే? ఏం

చేస్తావు వీటిని'' అడిగాడు శరత్.

"రారు... వచ్చినా వీటిని చూసి ఏమీ అనుకోరు. మా వాళ్ళంత 'వెనకబడి' లేరులే. ఇంక ప్రసాద్ సంగతి చెప్పలేదు. వాడయితే ఏ దేవుడి పటమో అంటిచేస్తాడు టెంపరరీగా''

"పైన భక్తి..."

"మరి భక్తిసారం అదేను. మోక్షం, విముక్తి అది ఇట్లా అయినా వస్తుంది. ఓషో అన్నాడుగా''

"ఏమిటన్నాడు''

"ఆ సమయంలో ఐహికబంధాన్నించి విముక్తి జరుగుతుందని'' శరత్ పడీపడీ నవ్వాడు.

"సో... ఓషో అన్నాడో లేదో గానీ శాస్త్రి అన్నాడు. ఇంక నేను నీ ఫాలోయర్నే''

"ప్రాబ్లం లేదు బాసూ. తీసుకురా ఎవడ్నయినా. మోక్షానికి దగ్గర దారి చూపిస్తా''

"మోక్షం గురించి కాకపోయినా నీ మార్గం గురించి బాగా వస్తారు శిష్యులు''

"ది మోడరన్ బాబా ఆఫ్ నైంటీస్. అనుకో''

"సరే పోతున్నా. నీ తలుపువేసి''

బయటకొచ్చాడు శరత్.

ఒక్క పోస్టర్ అనే విషయం పరిశీలించినా తన యూనివర్సిటీ జీవితంలో వచ్చిన మార్పు తెలుస్తూనే ఉంది. అప్పట్లో జయబాధురి, హేమమాలిని, రేఖ, శ్రీదేవి పోస్టర్లుండేవి. కొంతమంది హెలెన్, డింపుల్‌ల అర్ధనగ్న సౌందర్యాన్ని గోడలమీద అప్పుడప్పుడు అంటించి పీకేస్తుండే వాళ్ళు. ఎక్కువగా చీరా, జాకెట్టూ ధరించిన బిగి శరీరాలు ఉండేవి.

ఇప్పుడు బాలీవుడ్ నుంచి హాలీవుడ్‌కి మారింది.

డ్రీమ్ గర్ల్స్ కాలం పోయింది. పూజాబేడీ, భట్, మమతాలు హాలీవుడ్‌ని అనుకరించక తప్పట్లేదు. అక్కడనుంచి దిగుమతి పత్రికలూ అంతే. ప్లేబాయ్‌లను భారతీయం చేసినట్లు... అర్ధనగ్నపోయి పూర్తి నగ్నప్రదర్శనలు, మా పత్రికలో మీ ఫోటో పడితే ఇక చూస్కోండి అని యంగ్ గాళ్స్‌ని ఆకర్షిస్తున్న పత్రికారంగం. అన్ని కొలతలతో ఫోటోలతో సంప్రదించండి. మాడల్ రంగంలోకి, యాడ్ వరల్డ్‌లోకిది అడ్డదారి.

విచిత్రమేమంటే ఇప్పుడీ పత్రికలూ, పోస్టర్లూ ఇదివరకు రహస్యంగా చూసేవాళ్ళు, చదివేవాళ్ళు. ఇప్పుడు తెలుగు పత్రికలు గేట్లు తెరిచేశాక బూతు పత్రికలు మూతపడినట్టు. ఇంకవసరంలేదుగా అని పాఠకుడు నిర్ణయించుకోటంతో... ఇలాంటి వాటిని మరీ అంత క్యూరియాసిటీతో చూడటం లేదు. గుప్పెట తెరిస్తే హుష్ కాకి. అట్లనే ఒక్కసారిగా ఈ విజృంభణ జరగటంతో ఈ రకం విషయాలు మామూలే అయిపోయాయి. వాటికే ఎగబడి జీవితాల్ని 'అర్పించే' కాలం చెల్లింది. రోడ్డుంట కాఫీ తాగి ఆనందించినట్టు ఓ లుక్కేసి, ఓ కల కనేసి తన పనిలో తను మునిగిపోయే ఆధునిక పాఠకుడు.

రూంలో బట్టలు మార్చుకొని స్నానం చేసి బయల్దేరాడు.

"ఎక్కడిదాకా?" అడిగాడు వేణు.

మెస్‌లోంచి డిపార్ట్‌మెంట్ దాకా. బయటకు వెళ్ళేకి శాస్త్రికిచ్చేళ్లు లేపోతే పైన పెట్టు''

బుక్స్ తీసుకుని కదిలాడు.

"మెస్‌లో బుచ్చిరెడ్డి ఏమన్నా కనిపిస్తే... రమ్మన్నానని చెప్పు''

"సరే''

"మర్చిపోకు''

ఎదురు రూంలోంచి కేఎస్సార్కే వచ్చాడు అలంకరించుకొని. షూస్, బ్యాగీ ఫ్యాంట్, స్టోన్‌వాష్ లాంటి షర్టూ ధరించాడు.

"హలో''

"కళ్లతో పలకరించుకొని హాస్టల్‌బయట రోడ్డుమీదదాకా కలిసి నడిచారు. అక్కడ





కేయస్సార్కే ఎడంవైపు కాలిబాటలోకి తిరిగాడు. అటు నాన్‌వెజ్ మెస్‌లున్నాయి. అతను మాంసం తప్ప మరోటి ముట్టడు. రోజూ కోడి కాలు ఉండాల్సిందే. శనివారం రాత్రి మాత్రం హాస్టల్స్‌లో నాన్‌వెజ్ ఉండదు. ఆ రోజు తిట్టుకుంటూ సిటీలో ఏదోక రెస్టారెంట్‌కు వెళ్తాడు.

శరత్ కుడివైపుకి తిరిగి నడక ప్రారంభించాడు.

★ ★ ★

యూనివర్సిటీ రెండవ గేటు దగ్గర సిటీ బస్సు దిగి నిలబడింది పద్మజ. కూడా దిగిన విద్యార్థినీ విద్యార్థులు గలగల మాట్లాడుకుంటూ వెళ్ళిపోయిందాకా నిలుచుండిపోయింది. మొరాయిస్తున్న కాళ్ళను కూడదీసుకుని గేటుదాటి ఎడ్మినిస్ట్రేషన్ భవనంవైపు నడవటం మొదలుపెట్టింది.

ఇవాళయినా పని జరుగుతుందా? ఆ క్లర్క్ బండమొహం... గుంటలుపడిన చెంపలూ... చీదరింపు గొంతూ... స్కానింగ్ చేసే కళ్లూ... గుర్తొచ్చి అయిష్టంగా నడుస్తోంది. దారిలో అప్పుడే వెలుస్తున్న ఫార్మసీ భవంతులు ఎర్ర ఇటుక రంగుతో అదోలా మెరుస్తున్నాయి. తను పరీక్షలు రాసిన నాటికి ఇక్కడంతా చెట్లూ, పెనవేసుకుపోయిన తీగలూ... ఆకులూ, అడవిలా ఉండేది. అప్పుడే నెలలోనే అంతా గోడలు లేపటం వరకూ అయిపోయినట్టుంది.

యూనివర్సిటీని చూస్తే దిగులు ముంచుకొచ్చింది. తన కర్థంకాని మార్పులు... అర్థంకాని మనుష్యులు... అంతకన్నా అర్థంకాని జీవితవిధానాలు. చక్కగా ఎర్రమట్టితో అలికి ముగ్గులు పెట్టిన, తాటాకు కప్పిన ఇల్లు. ఏ తొందరా, రద్దీలేని పల్లెటూరు జీవితం. ముఖ్యంగా ఆడపిల్లలకి ఏ ఆర్థిక బాధలూ, బాధ్యతలూ పడకుండా వీలయినంత ప్రయత్నించే మధ్యతరగతి రైతు తండ్రీ. అణుకువగా మాలక్ష్మిలా పేరొందిన తల్లీ... స్కూలు కెళ్ళే చిన్ని తమ్ముడూ, అందర్నీ వదిలి మొదటిసారిగా కాలేజి చదువులు... వందలాది విద్యార్థినీ విద్యార్థుల మధ్య బిక్కుబిక్కుమంటూ తన ఇంటినీ తల్లిదండ్రుల్నీ గుర్తుతెచ్చుకోని క్షణంలేదు. డిగ్రీకొచ్చేసరికే తనలో సన్నసన్నగా పెరిగిన ఆ భయం యూనివర్సిటీలో ఎమ్‌ఏ కొచ్చేసరికి విశ్వరూపం దాల్చింది. చదువులో ఎప్పుడూ ఫస్టే. కానీ తనతోటి అమ్మాయిల జీవిత విధానం, ఆ వేగం, ఆ నడవడిక వీటితో పోలిస్తే ఎప్పుడూ చివరే. ఆ వెనకబాటుతనం ఘోరమయిన ఆత్మన్యూనత కల్గించి చదువు పైదెబ్బకొట్టింది. ఏఏ పరిస్థితులు, ఏఏ ఇబ్బందులు తనని కుంగదీశాయో అవే పరిస్థితులు అవే ఇబ్బందులు కొంతమంది వరప్రసాదాలుగా ఉండటం ఆశ్చర్యాన్ని కల్గించింది. ప్రతిరోజూ తనకు క్లాసుకెళ్ళి అందరి మధ్యా కూర్చోటం అగ్నిపరీక్షగా ఉండేది. కానీ అదే క్లాసునీ, అదే విద్యార్థుల్నీ ఊపిరి స్థంభింపచేసే డ్రస్సులతో కొంతమంది అమ్మాయిలు చివరకు లెక్చరర్స్‌ని సైతం ఆకట్టుకొని అందరి కళ్ళముందు తారల్లా మెరిసే వాళ్ళు. నిజానికా అమ్మాయిల్లో చాలామంది చదువులో బిలో ఏవరేజి మార్కులూ, తెలివితేటలూ, సబ్జెక్టులో పట్టూ అన్నింటిలో తనకన్నా కనీసం పది మెట్లు దిగువన ఉండేవాళ్ళు. అది మొదటేడాది సంగతి. క్రమంగా తను చదువులో పట్టుజారిపోవటం... వెర్రిగా వాళ్ళని అనుకరించబోవటం... అనుకరణలో విఫలమయి మరింత క్రుంగిపోవటం ఇదంతా ఒక విషవలయం. ఫైనలియరు కొచ్చేసరికి సెకెండ్ క్లాసులో అత్తెసరు మార్కులు వచ్చాయి. భవిష్యత్తులో ఏ మంచి ఉద్యోగమూ రాదనీ, వచ్చినా ఏ ఉద్యోగంలో అయినా తనలోని వెనకబాటు ప్రవర్తన వలన ముందుకు పోలేననీ ఎప్పుడో నిర్ణయించుకుంది. కలెక్టరు కాకపోయినా తన చిట్టితల్లి ఏ కాలేజి లెక్చరరో అవుతుందనీ, తన వంశంలో కొత్త మార్పు జరుగుతుందనీ, ఇకపై తన బిడ్డలూ, వాళ్ళ వారసులూ

మట్టినీ, పేడనీ అంటరాదనీ వెయ్యి ఆశలతో తనపై కొండంత నమ్మకంతో ఎదురుచూస్తున్న నాన్నకి ఎడారిగా నిల్చిన తన భావిజీవితం సంగతి ఎలా తెలియటం? 'తమ్ముడ్ని నువ్వే చదివించాలి తల్లీ' అని ఆశపడే తల్లికి ఏమని చెప్పటం?

"హాయ్ పద్మా'' పిలిచారెవరో.

ఉలిక్కిపడి చేతిలో బిగించిన కర్చీఫ్‌తో మొహం తుడుచుకొని తలతిప్పింది. కర్చీఫ్ చెమటతో ముద్దయి ఉంది అప్పటికే.

అవతలగా చెట్టుకింద ఎవరో అమ్మాయితో నిలబడి ఉన్న అపర్ణ. ఇద్దరి చేతుల్లో క్లాస్‌బుక్స్ ఉన్నాయి. ఏడాదిక్రితం పరిచయం. అప్పుడే ఫస్టియర్‌లోకి అడుగుపెట్టింది కాబోలు పాత ప్రశ్నాపత్రాలూ, ఇంకా కొంచెం మెటీరియల్ గురించీ తన దగ్గరకొచ్చింది. జూనియర్స్ అనేక సహాయాలకోసం సీనియర్స్ నర్థించటం మమూలే. ఏ బుక్స్ చదవాలి ఏ టాపిక్కే జర్నల్‌లో ఉంది ఏ ప్రొఫెసర్ నెలా పట్టాలి వగైరా విషయాల గురించి... ఆ రకంగానే పరిచయం... ఆప్పుడప్పుడు విష్ చేసుకోవటం... అంతే.

నవ్వు తెచ్చుకుంది పద్మజ.

"బావున్నారా'' అని ఓ వెర్రి ప్రశ్న.

"ఏదో లెండి... మాదేముంది. బాగున్నా లేకున్నా క్లాసులెలానూ జరిగిపోతుంటాయి. పరీక్షలెలానూ వస్తుంటాయి. ఏదోకటి రాస్తుంటాం. కానీ మీరేమిటి డల్‌గా ఉన్నారు. స్టడీస్‌నుండి విముక్తులయ్యారు కదా? మంచి జాబ్ వచ్చే ఉంటుందెటూ. పార్టీ ఏమయినా?

"లేదు... లేదు... ఇంకా ఉద్యోగం అయితే ఇంతవరకూ ఏదీ రాలేదు''

"అదేమిటి? మీరు క్లాస్ ఫస్ట్. మీకు ఏదీ రాకపోవటమేమిటి? నందితకి కపాడియా ఇన్‌స్టిట్యూట్‌లో రీసెర్చి స్కాలర్‌గా వచ్చిందట. నల్లగా కాదు గానీ అలాగే కన్పించేది. పేరేమిటో... ఆమెకి ఏబీసీలో పర్సనల్ మేనేజరుగా అప్పాయింట్‌మెంట్ ఇచ్చారట. వాళ్ళిద్దరూ మీకంటే వెనకబడే ఉండేవాళ్ళు కదా?" ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

ఆc! అదే ఒకటి రెండు ఇంటర్‌వ్యూల కెళ్ళివచ్చాను. ఈ మంత్‌లో రావాలి అప్పాయింటుమెంటు. అదే చూస్తున్నాను. వస్తానూ. ఇంకా పీసీ తీసుకోలేదు. అదుంటేగానీ ఇవ్వరనుకుంటాను'' కదిలింది పద్మజ.

అపర్ణ ఒకింత ఆశ్చర్యంగా చూసి అటు తిరిగింది.

ఎడ్మినిస్ట్రేషన్ గేటుదాటింది పద్మజ.

ఐదంతస్థుల ఆ మహాభవనం బండరాయి కంటే కఠినంగా తననే చూస్తున్నట్లనిపించింది. గ్రౌండ్ ఫ్లోర్‌లో కిటకిటలాడే విద్యార్థినీ విద్యార్థులు. వరుసగా చెక్కబోర్డులపై హెూదాలు రాసి ఉన్న గదులు. గదుల్లోకి ప్రవేశం లేదు. బిల్డింగ్ వెనకవైపుకు నడిచి ఆ గదులకి ఉన్న కిటికీల వరసని చూసుకుంటూ ఓ చివరకు చేరింది.

పీజీ కోర్సులకి అక్కడే ఇస్తారు పీ.సీలు ప్రొవిజనల్ పాస్ సర్టిఫికెట్లు. చిన్న క్యూ ఉంది.

అవతలా ఇవతలా ఇంకొందరు మగపిల్లలు.

అంపశయ్యపై నిలబడినదానిలా ఉంది ఆమెకి నేల.

పావుగంట గడిచాక 'ఏం కావాలి' అన్నట్లు చూశాడు క్లర్కు బండమొహం. గుంటలు పడిన చెంపలూ, చీదరింపు గొంతూ, స్కానింగ్ చేసే కళ్లూ గల ఆ క్లర్కు.

చెప్పింది వణికే గొంతుతో.

అర్థం కాలేదు.

"ఏం కావాలి?" గద్దించాడు.

ఉలిక్కిపడింది.

"నువ్వే కావాలి'' అని గర్జించిన పులిని చూసిన మేకలా.





ఇంతలో క్లర్కురూంలోకి ఎవరో వచ్చాడు. వెలిగిపోతున్న మొహంతో వాళ్లతో పదిని మిషాలు మాట్లాడాడు. వచ్చినవాళ్లు క్లర్కుకి వేలు విడిచిన మేనత్త కూతురి, రెండోమామ గారి, మూడోకూతురి, నాలుగో బావగారూ, ఇదో మరిదిగారూ.

క్లర్కు అందరి క్షేమసమాచారాలు అడిగే లోపు వెనక ఉన్నవాళ్లు విసుక్కొని నెట్టబోవటంతో "ఏమండీ'' పీలగా పిలిచింది పద్మజ, వీలయినంత వినపడకుండా.

క్లర్కు తలతిప్పేడు.

"హుఁ!" హుంకరించాడు.

"హుఁ! క్షణంసేపు ఆగలేదు. వీళ్లమ్మ మొగుడి సొమ్ము తినేస్తున్నట్టు. ఏం కావాలి నీకు'' మండిపడ్డాడు.

తను ఇంకా బతికే ఉన్నందుకు ఆశ్చర్యపడుతూ, సిగ్గుపడుతూ చెప్పింది ఆమె.

ఎదురుగా ఉన్న పుస్తకం ఠపీమని మూసి మరో పుస్తకం పర్రన తెరిచి... నెల్రోజుల క్రితం తేదీతీసి పద్మజ పేరు చూసి.

"ఇంకా నలభైరూపాయలు రావాలి. తే... డీ.డీ.తే' అని అటు తిరిగి తన వేలువిడిచిన బావమరిదిగార్లతో వెలిగే మొహంతో మధుర మయిన స్వరంతో మాట్లాడసాగేడు.

నలభై ఎందుకో? డీ.డీ. ఎందుకో? అదెక్కడ తేవాలో? అదిస్తే ఎప్పుడు తీసుకుంటారో? తీసుకొని ఎప్పుడు ఇస్తామంటారో? తనెప్పుడు రావాలో? వచ్చి ఎవర్నడగాలో?

అయోమయంగా పక్కకు జరిగింది- అంతకుముందు అక్కడే అనేకవందల, వేల మంది విద్యార్థినీ విద్యార్థులకి జరిగినట్లుగానే..

పర్సుతీసి చూసుకొంది. తన ఛార్జీలకు మాత్రం సరిపడా ఉన్నాయి. పదిహేనురూపాయలు. చిల్లరంతా కలిపి మరో మూడు రూపాయలు. ఇప్పుడు ఎవరు ఇస్తారు అప్పుగా అయినా పైగా క్లాస్‌మేట్స్ ఎవరూ ఇప్పుడు ఉండరు. అందరూ తెలీనివాళ్లే తెల్సినవాళ్లనే అడగలేదు. ఇంక ఎవర్నడుగుతుంది?

కిటికీనుండి పదడుగులు వేసిందేమో...

"పద్మజగారూ'' పిలిచాడు. అందాకా అక్కడక్కడే తచ్చాడి అప్పుడే పీజీ కౌంటర్‌లో క్లర్క్‌ను విచారించి పేరు తెలుసుకున్న సుబ్బారావు.

సుబ్బారావు...

సుబ్బారావు...

పదేళ్లుగా యూనివర్సిటీలో ఇకనామిక్స్ తీసుకుని ఎలాగో ఫైనల్ సెమికొచ్చిన సుబ్బారావ్.

తరచూ వీ.సీ.తో కార్లో ఎక్కి ముఖ్యంగా విద్యార్థులు మరీ ముఖ్యంగా విద్యార్థినులు నిలబడినచోట్ల కారాపించి దిగే సుబ్బారావ్.

"ఏండే... దండం" అని తనకి పదేళ్ల జూనియర్స్‌ని కూడా హోటల్‌కు నడిపించగల సుబ్బారావ్.

సుబ్బారావు...

సుబ్బారావు... కేవలం కాకా ప్రియుడే కాదు. కామప్రియుడు కూడా మాత్రమే కాదు. హాస్యప్రియుడు కూడా.

నాలుగేళ్ల క్రితం యూనివర్సిటీ పేలిపోయే జోకుని సృష్టించిన సుబ్బారావు ఈ సుబ్బారావే. ఆ జోకు ఈ రోజుకీ అనేకమంది హృదయాలను రంజిల్లచేస్తోంది. ఇకపై కూడా చేస్తుంది.

ఓ ఉదయాన్నే "దండాలండయ్యా'' అని వంగిపోయిన సుబ్బారావును లేవనెత్తుతూ "సుబ్రావ్ రేపు ఎనిమిదింటికి న్యూ ఎకనమిక్ పాలసీమీద నా రేడియో టాక్ ఉందోయ్. విని నీ ఓపీనియన్ చెప్పు సుమా'' అని చెప్పిన లెక్చరర్ గంగారాంకి మరో దండం పెట్టి తప్పక వింటానేని హామీ ఇచ్చిన సుబ్బారావు.

రెండోరోజు ఉదయాన్నే స్టాఫ్‌రూంలో తన రీడర్‌తో, మరో ఇద్దరు లెక్చరర్లతో, నలుగురు స్టూడెంట్లతో బాతాఖానీ కొడుతున్న

గంగారాంని చేరుకుని షేక్‌హాండ్ ఇచ్చి చెయ్యి తిరిగేట్లు ఊపేస్తూ "కంగ్రాట్స్! మార్వలెస్. ఎక్స్‌లెంట్! ఇన్ఫర్మేటివ్! విజ్ఞానదాయకం! అమోఘం! అనితరసాధ్యం! మీరిలాగే మరిన్నిసార్లు రేడియోలో ప్రసంగించి జనాన్ని చైతన్యవంతుల్ని చేయాలి సార్. మీకు నిజంగా నా దండం" అని ఒంగిపోతున్న సుబ్బారావ్‌ని అయోమయంగా, ఆశ్చర్యంగా చూసి...

"అవునుగానీ సుబ్రావ్ నా రేడియో టాక్ ఇవ్వాళ రాత్రి ఎనిమిదింటికి కదయ్యా నువ్వెప్పుడు విన్నావ్. పదిగంటల ముందుగా ఎలా వినగలిగేవ్'' అని హెూరున ఆశ్చర్యపోయి, క్రమంగా అర్థమయి ఆగ్రహపడి చెంప పగలగొట్టిన గంగారాం...

"ఈ తొత్తుకొడుకు పొద్దున ఎనిమిదింటికి నా టాక్ అని భ్రమపడి వచ్చేముందు గుర్తొచ్చి ఇలా వాగుతున్నాడు. వీడితో బీకేర్‌ఫుల్' అనటమేకాక అన్ని డిపార్ట్‌మెంట్లకూ తిరిగి స్వయంగా ప్రచారం చేయటంతో ఆ జోక్ యూనివర్సిటీ మొత్తాన్ని పేల్చింది. సుబ్బారావుతో పరిచయమున్న అన్ని డిపార్ట్‌మెంట్ల విద్యార్థులూ.

"హాయ్... కంగ్రాట్స్ సుబ్బారావ్' అని కేరింతలు కొట్టి మెస్‌లో, కేంటీన్‌లో, ఆఫీస్‌లో హేళన చేసినా...

"దండాలండయ్యా'' అని వినమ్రంగా కృతజ్ఞతలు చెప్పగలిగిన సుబ్బారావ్...

ఇప్పుడు...

"పద్మజగారూ'' అనే పిల్చాడు.

ఆమె మరింత అయోమయంగా చూసింది.

"మీరు పద్మజకదూ... నేను నందినికి వరసవుతాను. అవునూ మీరు... ఇక్కడ?" అన్నాడు ప్రశ్నార్థకంగా.

చెప్పింది.

"ఓరి గాడిదలు. తెల్సినవాళ్లు లేకపోతే ఆడిస్తారు. మీరు మరీ డీలాపడిపోయారేంటి నేనున్నాగా ఆగండి'' అని కౌంటర్ దగ్గరకు వెళ్లి కిటికీలో తలదూర్చి కాసేపటికి వచ్చాడు నవ్వు మొహంతో.

బలహీనంగా నవ్వింది పద్మజ బదులుగా.

"ఆ నలభయ్యా లేట్ ఫీ అనుకుంటాను. మీరు కాన్వొకేషన్‌కి వెళ్లలేదుగా. తర్వాతీసుకునే అందరూ ఎడిషనల్‌గా కట్టాలట. పదండి. ఎస్.బీ.ఐలో తీసుకుందాం"

నాలుగడుగులు వేసి ఆగిపోయాడు ఆమె కదలకపోవటంతో.

"ఏనీ ప్రాబ్లెం?"

"డబ్బు.. చాలేట్లు లేదు'' మొహమాటంగా చెప్పింది.

లోపల కొంచెం విసుక్కుని పల్లెటూరి గబ్బిలాయిలూ, వాళ్ల తల్లిదండ్రులూ అంతే! ఎక్కువిచ్చి చావరని కోపగించుకుని వాళ్లలా ఉండటం ఎంతో కొంత తనకి లాభమేనని గుర్తొచ్చి చల్లబడి.

"ఓ... దానికే ఇంత సిగ్గా. కమాన్. రండి. మీకు నందిని ఎంత క్లోజో నేనూ అంతే అనుకోండి. రండి. నా దగ్గర తీసుకోండి. అఫ్‌కోర్స్ అప్పుగానే. మామూలుగా మీరు తీసుకోరని నాకు తెల్సు'' అన్నాడు.

నెమ్మదిగా నడిచింది పద్మజ అతడినను సరిస్తూ.

అక్కడినుంచి ఒకమైలుదూరం చెట్లమధ్య సన్నని కాలిబాట. జనసంచారం తక్కువ. బ్యాంకుకు వెళ్లొచ్చే ఒకరూ అరాతప్ప. బ్యాంకుకు చేరేలోపు కొంత బిడియం పోగొట్టగలిగాడు ఛలోక్తులతో.

అక్కడ చాంతాడు క్యూ ఉంది.

"ఛలాను కావాలి'' అంటే వెనగ్గా నిలబడమని సలహాలిచ్చిన చాంతాడు చివరి మనిషిని కొరకొర చూస్తూ, "నో ప్రాబ్లెం ఆడాళ్లకిక్కడ సెపరేట్ క్యూ లేదు గనుక నేన్నిలబడతా'' అని గంటన్నర నిలబడి చలాను ఫారం తెచ్చిచ్చిన సుబ్బారావుని కృతజ్ఞతగా చూ






సింది పద్మజ.

'ప్లీజ్ డోంట్ మెన్షన్ ఇట్ తరహాగా మొహంపెట్టి మళ్లీ ఎడ్మినిస్ట్రేషన్ కాలిబాటలో సరదాగా ఆమె బ్యాగ్ లాగి జిప్‌తెరిచి చూసేడు. ఒక పౌడరుపొట్లం, సింగార్ తిలకం, చిన్న దువ్వెనా, కొన్ని కాగితాలూ, నలిగిన రూపాయి నోట్లూ.

"శుభం. వీటి ఖర్చు గిట్టింది'' అన్నాడు పైకే.

అర్థం కానట్టు చూసింది.

"ఏంలేదు. టైం అయిపోతోంది. మీరు రావటమే లేటుగా వచ్చారు. బ్యాంకుపని రెండు గంటలు. నాలుగవుతోంది. ఈసరికి మూసేసినా ఆశ్చర్యం లేదు. అసలీ క్లర్కులు...'' అని త్వరగా నడిపించేడు.

అక్కడ కౌంటర్ మూసేసి ఉంది.

పద్మజ గుండెల్లో భూకంపం. ఇవ్వాళ గనక ఈ సర్టిఫికెట్టు రాకపోయిందా? రేపు, ఎల్లుండి శలవులు. ఆవలి ఎల్లుండి తమ లగేజీ పట్టుకుని బయల్దేరాలి. విజయవాడ దగ్గర ఒక ప్రైవేట్ కాలేజీలో ఇంటర్‌వ్యూ అన్ని సర్టిఫికెట్లతో రావలెను. టైమ్ చూసుకొని, లగేజి తీసుకొని వచ్చేయండి. రెండ్రోజుల్లో జాయినయి పోయేందుకు వీలుగా అని తాఖీదులో ఉంది. ఆ ప్రాంతంలో, అంత పోటీలేని వాతావరణంలో తప్పక తనకు జాబ్ రావాలి. అక్కడగానీ రాకపోయిందా ఇక జీవితం ముగిసినట్లే.

జుట్టు పీక్కుని బట్టలు చింపుకొని పరిగెత్తాలన్పించింది.

"మీరుండండి. అక్కడే'' అని సుబ్బారావు లోపలివైపు గదుల్లోకి మాయమయ్యాడు. పావుగంటకి ఆ బండమొహం క్లర్కుతో బయటకు వచ్చేడు.

పద్మజని స్కానింగ్ చేసిన కళ్లతో ప్రశ్నార్థ కంగా చూసేడు క్లర్కు.

"కొంచెం చూడు గురూ! అర్జెంటు. పాపకి ఇంటర్వ్యూట. ఇవాళగానీ నువ్వు దయదల్చ కపోతే ఇక అంతే'' ప్రార్థించాడు సుబ్బారావు.

కనీసం తనకు గొంతు పెగలటంలేదు. తనపై తనకే కోపం, సుబ్బారావుపై గౌరవాభి మానాలు కలిగేయి.

"కుదర్దు సుబ్రావ్. ఇవాళ సూపరిండెంటు గాడు ఫైళ్లన్నీ ఆధీనంలో ఉంచుకుని చకింగ్ లు మొదలెట్టేడు. కనీసం మీరు ఛలాను సబ్మిట్ చేసినా ఇవాళ పీ.సీ. వచ్చేందుకు కనీసం పదిరోజులు పడుతుంది''

"గురూ... గురూ''

"సారీ సుబ్బారావ్''

సుబ్బారావే క్లర్కుని దయనీయంగా పద్మ జకేకాక అక్కడ నిలబడిన స్టూడెంట్లు గుండె లు కరిగి నీరయ్యేలా బతిమాల్తూ కూడా లోనికి వెళ్లేడు.

కాస్సేపటికి వచ్చి పద్మజ చేయిపట్టి దాదాపు లాక్కెళ్తూ యూనివర్సిటీ సెకెండు గేటవతల ఎస్.డీ.ఎల్సీ ఈ బిల్డింగు కివతల నిర్మానుష్యంగా ఉన్న ఓ ప్రాంతంలో కూచో పెట్టి...

"అమ్మాయీ! ఎవరికీ కనపడకుండా కూచో ఇక్కడే. నేను పోయి క్లర్కుని బతి మాలి సూపరిండెంటుకి ఓ రెండొందలు కొట్టి ఎలాగైనా పని చేసుకువస్తాను. ఇవాళ ఇన్స్పె క్షన్‌ట. పని రహస్యంగా జరిగిపోవాలి. నీకు సర్టిఫికెట్లు రెండ్రోజుల తరువాత డేటుతో ఇస్తారు. ఇవాళ తీసుకున్నానని గానీ నువ్వు చెప్పేవా? కొంప కొల్లేరవుద్ది. గుర్తుంచుకో''

అని వడివడిగా వెళ్ళాడు.

భయభక్తులతో సుబ్రావుని తలచుకుంటూ రాత్రి ఏడింటివరకూ అక్కడే చెట్లచాటున కూచున్న పద్మజ చీకట్లు ముసురుకోటం కూడా గమనించలేదు. ఆ ప్రాంతంలోకి ఎవ రూ రాలేదు... ఆ సమయానికి పద్మజ అదృష్టంకొద్దీ కాదు సుబ్బారావు అదృష్టంకొ ద్దీ.

ఎందుకోగానీ మధ్యాహ్నమే తను ఇంటికి వెళ్ళిపోయి ఉంటే బాగుండేదనిపించింది ఆమెకి. తన చేతుల్లోంచి ఒక్కొక్కటి అధీనం తప్పిపోతున్నట్లు ఇబ్బందిగా ఉంది ఎంచేతో

మరి కాసేపటికి చీకట్లో చప్పుడయింది.

ఆమె ఊపిరి బిగబట్టి కూచుంది.

హాస్టల్ రూంలో బట్టలు మార్చుకుని ఆ పక్క రూం స్టూడెంటుని కెమే సబ్బు అప్ప డిగి స్నానం చేసి, ఈ పక్కరూంలో పౌడర్ కొట్టుకుని ఐదేళ్ళక్రితం కొన్న 'పొటెన్సీ' పర్ఫ్యూమ్‌ని బట్టలకిందనుంచి భద్రంగా తీసి వళ్లంతా కొట్టుకుని సుగంధం చిమ్ముతూ, తాజాగా, కులాసాగా నడిచి వచ్చిన సు బ్బారావు విజయవంతంగా నవ్వాడు.

చీకట్లో అతను ఎంచేత అలా నవ్వాడో అర్థం కానప్పటికీ 'తన పని అయిపోయింద న్న' నమ్మకంతో ఆనందంగా లేచి నుంచొంది పద్మజ.

"కూచో మరీ. ఇదుగో నీ పీ.సీ. అబ్బ తిరిగి తిరిగి చచ్చేను." ఆమెకో కవరు అందించి ఆమె పక్కనే కూలబడ్డాడు.

"ఎంత ఖర్చయిందండీ. ఇంటికి వెళ్లాక పోస్ట్ చేసేస్తాను లేదా..."

ఆ ఎంత ఐదొందలు'' అని వెల్లకిలా పడుకుని వళ్ళు విరుచుకున్నాడు సు బ్బారావు. చీకట్లో అతడు ధరించిన తెల్లని బట్టలు చల్లగా, తెల్లగా మెరుస్తున్నాయి. వాటి లోపల అతడి శరీరం నల్లగా, వేడిగా పొగలు చిమ్ముతోంది.

"ఐదు... వందలు'' ఐదు టన్నుల జిలె టిన్ గుండెల్లో కూర్చి పేల్చిన భయో త్పాతం. దిగువ మధ్యతరతి... మరీ ము ఖ్యంగా రైతు కుటుంబాల్లో ఐదొందలంటే సంవత్సరం సాగుచేస్తే అరెకరంలో వచ్చే





ఆదాయం ఆయా ప్రాంతాన్నిబట్టి.

సుబ్బారావు ఆమె చెయ్యిపట్టి కిందకు లాగాడు.

ఆమె విభ్రాంతితో 'ఛీ దుర్మార్గుడా నిన్ను నమ్మి వస్తే ఇంత ఘాతుకానికి ఒడిగడతావా' అన్లేదు. ఇలాంటిదేదో జరుగుతుందని తెలుస్తూనే ఉంది. అందుకు సిద్ధపడిందని చెప్పలేం కానీ యదార్థాన్ని అంగికరించేక మనసు మొద్దుబారింది.

చుట్టూ ఉన్న చింతచెట్లమధ్య తుమ్మ మొద్దులా పడి ఉన్న ఆమె శరీరాన్ని వణికే చేతులతోనూ, అదిరే శరీరంతోనూ పక్కకు జరుపుకున్నాడు సుబ్బారావు. చీకట్లో ఆమె మొహంలో ఏఏ భావాలు ప్రతిఫలించేయో, ఏఏ కార్చిచ్చులు దహనం అయ్యాయో, ఏఏ లావాలు పొంగాయో ప్రపంచంతోపాటు సుబ్బారావుకీ తెలీదు. తెలుసుకునే వ్యవధీ లేదు.

ఆమె శరీరాన్ని నిలువునా భక్షించి నాలుక్కాళ్ల జంతువులా లేచిన సుబ్బారావుకి అవతలెవతలో సంకేతంగా శబ్దం వినవచ్చింది. అతడు పరిశీలనగా చూసి పద్మజని కాలితో కదిపాడు.

ఆమె స్పృహలో లేనట్లే ఉంది.

అతడవతలకు వెళ్ళి హైనాలా చీకట్లో పొంచి నిలుచున్న క్లర్కుని కలిశాడు. క్లర్కు కదిలాడు పద్మజవైపు.

మరికొంతసేపటికి ఆమెని లేపబోగా... మగతగా పడిఉన్న ఆమె శరీరం... ఎంత ప్రయత్నించినా కదలకపోయే సరికి... ఏం చెయ్యాలో తోచక ఎవరయినా తమనక్కడ చూస్తే ప్రమాదం అని గుర్తుకొచ్చి... మరో మార్గంలేక ఏదోక టైంలో లేచి పోతుందన్న ఊహతో... ఆమెని వదిలి ఇద్దరూ వెళ్ళిపోయారు.

★ ★ ★

ఆ రోజేమనుకున్నాను?

పోస్ట్‌మాన్ అప్పాయింట్‌మెంట్ ఆర్డరు తెచ్చినప్పుడు.

దూకేస్తున్నానొక సజీవ చైతన్య ప్రవాహంలోకి. దూకేస్తున్నా. హాపీడేస్... గోల్డెన్ డేస్... హావ్ కమ్ ఎగైన్. యూనివర్సిటీ... నీలోకి దూకేస్తున్నా.

దూకి కొన్ని నెలలయింది.

అనుకున్నట్టుగా ఇక్కడ జీవ జలప్రవాహాలు అట్లుంచి... పిల్ల కాలవలూ, సెలయేర్లూ కూడా లేవు. దూకేశాక మోకాలిచిప్పలు పగిలాయి. అడుగున పొడుచుకొచ్చిన బండరాళ్ళమీద పడి. బండ రాళ్ళు కావవి పలుగు రాళ్లు.

అవును.

ఇప్పుడు క్యాంపస్ ఎండిపోయిన చవిటి పఱ్ఱ. కరి మింగిన వెలగపండు. రివ్వున వడగాలులు ఈడ్చి ఈడ్చి కొట్టే వేసవి కాలపు ఎడారి నేల.

ఇప్పుడిక్కడ ఏ కదలికా లేదు. మరే చైతన్యమూలేదు. ఏ ఉద్యమం లేదు. ఏ ఆలోచనా లేదు. మరే స్పందనా లేదు.

ఓ వారం క్రితం ఉదయన్నే పరిగెత్తుతూ, ఉదయపు చల్లగాలులు పీలుస్తూ ఇంకాసేపట్లో తొంగిచూడబోతున్న బాలసూర్యుడి ఉద్భవాన్ని ఆహ్వానిస్తూ... తార్రోడ్డుమీదనుండి సెకెండు గేటు కవతల ఎస్‌డీఎల్సీ ఈ బిల్డింగుకివతల చిన్న కల్వర్టుమీద నిలబడి విశ్రాంతిగా కళ్ళు ముసుకోబోతున్న క్షణాన... వినపడిన అలికిడి.

మనిషి మూల్గినట్టు... అలలు అలలుగా... తుప్పల చాటునుండి.

పద్మజ... అస్తవ్యస్తంగా పడి ఉన్న శరీరం... తొలిగిపోయిన బట్టలు. రాత్రంతా ఆ చలిలో... ఆ మంచులో ముద్దముద్దయి... పక్కనే తడిసిపోయిన హాండ్‌బ్యాగ్... చిన్న ఫైలు.

పద్మజ... తనకి పేరు తెలీదు. కానీ ఫైనలియర్‌లో ఉండగా ఒకసారెప్పుడో చూశా

డు. నందిత పక్కన క్లాస్‌రూమ్స్ దగ్గర. వేలగా... బెరుకుగా ఒకప్పటి తనలాగా... అందులోను నందిత లాంటి ఫాస్ట్ గర్ల్‌పక్కన చూసేసరికి కొంచెం గుర్తుంది. ఆమె చదువ యిపోయి ఉండాలి. కానీ ఇక్కడీ తుప్పల్లో

గబగబా ఆమెని మంచు అంతగా పడని పొడి ప్రదేశంలోకి చేర్చాను. ఒక అమ్మాయి ఆ పరిస్థితిలో.

మరేం చెయ్యాలో తోచక ఊపిరితిత్తులు పగిలిపోయేట్లు పరిగెత్తి లేడీస్ హాస్టల్‌దగ్గర రాజేశ్వరిని కలిసి... మరో ఇద్దరు అమ్మా యిల సాయంతో ఆటోలో పద్మజని దగ్గర లోని హాస్పిటల్‌లో చేర్పించాను. రాజేశ్వరి తోడుగా అక్కడే ఉండిపోయింది.

అక్కడే శంకర్నారాయణ ఇంకొందరితో ఏం చెయ్యాలనేది చర్చ పెట్టాను. స్టూ డెంట్స్‌ని కదిలించి సుబ్బారావ్‌గాడ్నీ, క్లర్క్‌నీ శిక్షించాలన్న డిమాండుతో... ఊరేగింపూ, విజ్ఞప్తీ, పద్మజతో పోలీస్‌స్టేషన్‌లో రిపోర్టు ఇప్పించటం... ఇంకా వుమెన్స్ కాలేజ్ వాళ్ళ ని కదలించటం.

"ప్చ్" పెదవి విరిచింది రాజేశ్వరి.

"ప్రయత్నిద్దాం" అన్నాడు శంకరనారా యణ.

మేము యూనివర్సిటీ కొచ్చే సరికి ఎలాగో వార్త పాకి క్యాంపస్‌లో చర్చించుకుంటున్న విద్యార్థులు కనపడ్డారు. ఆగ్రహంతో కాదు ఆసక్తితో. సుబ్బారావుపైన ద్వేషంతో దూకు తారేమో అనుకున్నాను. కానీ...

ఒక్కడు...

ఒక్కడు కదల్లేదు. ఒక్కడు కలిసి రాలేదు "మనకెందుకు" అనేవాళ్లే అంతా.

నా అనుమానం ఏమంటే కొందరు స్టూ డెంట్స్‌కు సుబ్బారావు ఆదర్శపురుషుడయి నా ఆశ్చర్యంలేదు. చివరికి అమ్మాయిలు కూడా. ఎవరి గొడవలో వాళ్ళు ఎవరి వ్యాప కాల్లో వాళ్ళు.

ఘోరంగా దెబ్బతిని ఇది యూనివర్సిటీ యా? కాదా? అన్న సందేహంలో పడిన నాతో రాజేశ్వరి ఓదార్పుగా చెప్పింది.

"క్యాంపస్ మారిపోయింది. ఇదివరకులా కాదు. ఇప్పుడు విద్యార్థికి సమాజం గురించీ, అందులో మనుషుల గురించీ అక్కర్లేదు. తన సంగతి తనకి ముఖ్యం. సామాజిక బాధ్యత... న్యాయంకోసం పోరాటం అంటే జోక్ చేసినట్టునవ్వుతారు వాళ్ళు. మొత్తంగా ఒక కొత్త తరం వచ్చింది. ఈ తొంభయిల్లో మరీ వేగవంతంగా మారిపోయిన సమాజాని కి తగినట్టే"

అప్పట్నించి క్యాంపస్‌లోని మార్పు ఈ నాలుగైదేళ్లకే ఎంత వచ్చిందో చూస్తూనే ఉన్నాగానీ- ఆ మార్పుని పరిశీలించటం పెరిగింది. ఒక కొత్తతరం క్యాంపస్‌ని ఆక్ర మించిందని అర్థమయింది.

ఈ తరానికి ఏం కావాలి? వాళ్ల అన్వేషణ ఏమిటి? వాళ్ళ పయనమెటు? వీళ్ల ఆదర్శాలు ఏమిటి?

ఇవే నన్ను పరిశీలనకు ప్రోత్సహించిన ప్రశ్నలు.

ఆర్ట్స్‌కాలేజ్‌కు మళ్ళీ తరచుగా వెళ్లటం... అక్కడి కొత్త విద్యార్థులతో పరిచయాలు ఏర్పరుచుకోవటం... వాళ్లద్వారా సిటీలోని డిగ్రీ విద్యార్థులనూ కలవటం... కొన్ని రోజు లు వాళ్ళతోనే తిరిగే అవకాశాన్ని సంపా దించటం ఇదీ నా వారం రోజుల కార్యక్రమం.

★ ★ ★

రాజేశ్వరితో తిలక్ రోడ్డులోంచి మాట్లాడు తూ మెయిన్ రోడ్డెక్కి "మరి నా బస్‌స్టాపు అటు. నెక్స్ట్ సండే కలుద్దాం. నువ్వే రారా దూ" అంటోంది పావని.

"అబ్బ మీ యూనివర్సిటీ ఆ చివర. అడవిలోకెవరు వస్తారు. నువ్వే ఈ సిటీలోకి రా" అన్నది రాజేశ్వరి.

ఇద్దరూ చేతులు కలిపి జీపీఓ దగ్గర విడిపోయారు.

పది నిముషాల తర్వాత ఖాళీ బస్సు




వచ్చింది.

చల్లగాలికి చిన్నగా వణుకుపుట్టి చెవుల చుట్టూ చీర మడత తిప్పి చూస్తోంది పావని... కిటికీలోంచి.

ఆ యూనివర్సిటీలోంచి ఈ యూనివర్సిటీలోకి గెంతాక... రీసెర్చిలో అంతగా మునగకపోయినా... మనస్థత్వాలు తెలుస్తూనే ఉన్నాయి. సైకాలజీలో పరిశోధన ఎన్నేళ్లకయ్యేను. ఎరిక్‌ఫ్రాం.. బెర్నే.. ఫ్రాయిడ్... మెస్మరిజం... ప్రొజెక్షన్... సప్రెషన్... డ్యూయల్‌రోల్... ఎడిసస్.

ఒక అగాధం...

సమాజానికీ మనిషికీ ఉండే ఆ చిత్రమయిన లింక్ గురించి తను కాక ఇంకెవరయినా పరిశోధిస్తే... మనిషినర్థం చేసుకొనే టూల్ ఒకటి ప్రపంచానికందినట్లే... పాపం రాజు... పాపమెందుకు?

తన నిరంతరాన్వేషణలో.... సర్వస్వం త్యాగం చేసి... నెలనెలా చేతికందే గానుగెద్దు జీవితాల నాలుగు రాళ్లూ... మామూలు బతుకు కోసం పెనుగులాడే అశేష జనవాహిని... జనం శిరస్సుల్ని తొక్కిపట్టి పట్టాభిషేకం చేయించుకొంటున్న మహా నాయకులు...

తలెత్తావా తెగిపోతుంది. చూడకు... వంచెయ్... ఏమీ తెలీనట్టు నీ దారిన నువ్వు... నీ బతుకు నువ్వు... నడిచెయ్... బతికెయ్... కానీ... నోరు విప్పకు. తలలు రాలిపోయాయి... వాలిపోయాయా?

తెగి పడిన శిరస్సుల్ని మూటగట్టి భుజాన వేసుకొని పర్వతారణ్యాలలోకి పరిగెత్తిపోయిన... రాజూ..

ఇప్పచెట్ల కింద, తుమ్మ చెట్లకిందా పుల్లలేరుకుని... పువ్వులేరుకొని... కొండవాగుల్లో ఒండ్రుమట్టితో పుల్లమీద పుల్ల మట్టితో సిమ్మెంటు చేసి నువ్వు కట్టాలనుకొన్న మహా సౌధం..

చూస్తామంటావా... మన చూపు పడిపోయేలోగా...

జనజీవన సంక్షోభం రోజురోజుకీ సుడులు తిరిగి వ్యక్తుల్ని... సమూహాల్నీ.. సంస్థల్నీ దేశాల్నీ జాతుల్నీ ఈడ్చి ఈడ్చి కొట్టి ఒకానొక టర్బ్యులెంట్ ఫ్లోలో ఒక్కొక్కవైపుకి విసిరికొడుతుందని కన్పిస్తోందిగా.

అంత స్పష్టంగా, అంత తిన్నగా, అంత అరటి పండు వలిచి చేతిలో పెట్టినట్లుగా లేదు... సంఘర్షణ.

నువ్వు గీసిన గీతకటూ ఇటూ మొహరించి కూర్చోవటం లేదుకదా ఆ రెండూ... కూర్చొనీ కూర్చొనీ విసుగెత్తిందా ఏమిటి? ఇటువాళ్లూ అటు వాళ్లూ గెంతి గెంతి ఎటు గెంతుతున్నారో అర్థం కానంత గందరగోళం...

నేనటూ కాదు ఇటూ కాదు అని గీత మీద ఒంటికాలితో నిలబడి ఎక్కడ నెత్తురు కారినా పరిగెత్తి హృదయానికద్దుకుంటున్న బాలయ్య జాగ్రత్తగా తీగమీద సర్కస్ పిల్లలా పిక్కలు బిగబట్టి కళ్లు మూసుకొని కిందకు చూస్తే పడిపోతాడేమో అటో ఇటో అని... చుక్కల్లోకి చూపుల్ని తిప్పి... జాగ్రత్తగా గీతమీదే ముందుకూ... వెనక్కీ... రెండడుగులు ముందుకీ రెండడుగులు వెనక్కీ.. బాక్టుది పెవిలియన్... కాదు... మళ్లీ మొదటికే.

నీ రక్తంలో నీలికణాలు. ఎంత శుద్ధి చేసినా పోవు. నాదే అసలు సిసలు... అని నీ మీదకే బాణం తిప్పిన దాసు. ఇంకెంత మాత్రమూ ఎవరికీ దాసుణ్ని కాదంటున్నాడు. ఏడాదీ ఏడాదీ ఎన్ని వందల వేల సంవత్సరాలు ఇంకా సహించాలి... వాణ్ని... నిన్నూ అని.

నిన్నూ వాణ్ని ఒకేగాట కట్టి ముల్లుకర్రతో... నిన్ను పొడిచి పొడిచి కారిన రక్తాన్ని మైక్రోస్కోపులో పెట్టి కణ విభజన చేస్తున్న దాసు... కానా లెన్సుకి నీలి కణాలంటించారెవరో... నీ రక్తంలో లేకపోయినా... అతడెలాగూ లెక్కిస్తాడు... వాటిని.

కాబట్టి నువ్వు కాదు.. నేనే నిర్ణయిస్తా గమ్యం. ఇక్కడినుంచి చుక్కాని తిప్పుతా నంటున్నాడు... ఇంతకీ పడవని దాసు ఎటు తిప్పుతాడు... ఎదురు ప్రవాహమా?... వా లులో హాయిగా కన్పించే ఆ జలపాతంలోకి... ప్రయాణమా? కళ్లు మూసుకు దూకిస్తాడా ఏమిటి కొన్ని వేల సంవత్సరాల పీడన ఫలితంగా కొన్ని వేల మైళ్ల లోతులోకి... అంత మాత్రాన ఆ హక్కు... నెరవేరు తుందాని?

అనేకమందిని ముందుండి చేయి అందించి లాగుతున్నావని... నీకు తెలుసో లేదోగానీ... చాలామందికి తెలుసనే అచ్చు యంత్రం ఆఫ్‌సెట్‌లోకి మారే ఈ దశలో... పుస్తకాల్లో... మేధావులూ ప్రకటిస్తున్నారు. అందరిలోకి ముందున్న నీకన్నా ఇంకా ముందు మేమే ఉన్నామని ప్రకటించేశారు రాధాకృష్ణా, మాధవీ.

రాజూ ఎంతయినా నీ శరీరంలో ఎక్కడో చోట పురుషాధిపత్యపు చిహ్నాలు... నువ్వు బట్టల్తో కప్పేసుకున్నా... ఉన్నాయి. ప్రపంచా నికి మినహాయింపులేదు. నువ్వు రాజువేకానీ. రాజివో రాజ్ఞివో కాదు. కాలేవెన్నటికీ...

అవి శరాఘాతాలు...

మాధవి విల్లు సాగదీయలేకపోతే... ఓ చెయ్యి అందిస్తున్న రాధాకృష్ణ... చిత్రంగా ఆ విల్లుని నువ్వే ఒకప్పుడు తయారుచేసి నారి సంధించి వదిలి ఝుంకారధ్వనితో... వాళ్లని తట్టిలేపింది. గురినేర్పింది నువ్వే... నీవు నేర్పిన విద్యయే.

అనుభవించు.. అంటే.. శిక్షా?

కాదు.. అది శిక్షకానే కాదు...

ఒక్కొక్కరూ వేస్తున్న ప్రశ్నలు..

నువ్వొక భోజరాజువి కాదుగానీ సింహా సనం కోసం మెట్లెక్కుతుంటావు. మామూలు రాజువి. మెట్లమీద సాలభంజికలు. కిందమె ట్టుమీద దాసు... పై మెట్టుమీద మాధవీ. ఇంకాపైన బాలయ్యా... ఇంకా... ఎందరో సాలభంజకలు.. వాళ్లడిగిన ప్రశ్నలు.

జవాబు చెప్పకుండా ఎక్కలేవు ఎన్నటికీ. ఆ సింహాసనం చేరుకోలేవు... ఎప్పటికీ.

అడిగేవాడిని కాదు. అడుగుతున్న ప్రశ్న చూడు. మురికిని జల్లించి ఆ సజీవ ప్రవాహా న్ని నీలోకి తిప్పుకుంటే అడ్డదారులూ... అగాధపు ప్రయాణాలూ వదిలి... నీలోకి మమేకమై ఇప్పటి సుడిగాలి... సుడులు సుడులుగా మహా ప్రభంజనమై ఈ మహా మాయని కూకటివేళ్లతో పెళ్లగించి ఒకానొక నూతన మానవుడు ఆవిష్కరించబడి.

బస్సాగిన కుదుపుకు వర్తమానంలోకి వచ్చింది పావని.

బ్యాగ్ భుజాన తగిలించుకొని దిగుతోంది నెమ్మదిగా.



బస్టాపులో దిగిన పావని తన డిపార్ట్ మెంట్‌వైపుకు నడవబోతోంది. ఆ పక్క అటు వెళ్లాల్సిన బస్సుకోసం ఆగిన జనసమూ హంలో తలొంచుకుని ఆలోచనలో నిమగ్ను డయిన శరత్...

ఎవరికోసం వచ్చి ఉంటాడు? అతడేమిట నేది తనకింకా అర్థం కాలేదు.

పిలుద్దామా వద్దా అన్న ఆలోచన వదిలి అటుగా కదిలింది. ఎందుకో తలెత్తిన శరత్... కళ్లు మెరిసాయి.

గబగబా ముందుకొచ్చాడు.




"పావనీ'' అతడి గొంతులో ఆనందమో? మరే భావమో?

"ఏంటిలా? కొన్నాళ్లు కాదు. కొన్నేళ్ల తర్వాత?" నవ్వింది.

"కొన్నేళ్లే? ఎక్కడా... కొన్ని నెలలు'' అన్నాడతను.

"సరేలే. ఇప్పటికయినా వచ్చావు. మీ యూనివర్సిటీనుంచి మా యూనివర్సిటీకి. ఏంటి విషయం... పద" అంది.

"అదా..." అంది.

ఇద్దరూ కలిసి రోడ్డువెంట నడుస్తున్నారు.

"ఇప్పుడే... రాజేశ్వరిని కలిసి ఇటు వస్తున్నా... నువ్విక్కడ?"

"నీ కోసం వచ్చి లేవని చెప్తే... మళ్ళీ వెనక్కి..."

"కొంచెంలో తప్పిపోయేవాళ్లం"

"నిజంగానే మనం చాలా తప్పిపోయినట్లనిపిస్తోంది. వారంక్రితం పద్మజ అంది''

"తెలుసు... రాజేశ్వరి చెప్పింది''

"ఆ తర్వాత తప్పిపోయిందేమిటో తెలుసుకొందామని క్యాంపస్‌ని పరిశీలించాను. అంటే ఇదివరకు తెలీదని కాదు. ఆ ఇన్సిడెంట్‌తో, ఓ కొత్త ఆసక్తితో'

"ఊఁ! మొత్తానికి చాలానే కనుక్కొని ఉంటావు''

"అదే, నీ దగ్గరకొచ్చింది అందుకే..."

"చెప్పు నీ నోట వింటే ఏం చెప్తావో అని నాకూ ఇంట్రెస్ట్‌గా ఉంది. అన్నట్టు ఏమయినా తిన్నావా? ఆ హొటల్‌కి పద" వాడిపోయిన అతడిని పరిశీలిస్తూ అంది.

ఇద్దరూ హొటల్‌లో ఓ పక్కగా కూర్చున్నారు.

"పావనీ... రాజూ, మీరూ వెళ్లిపోయాక క్యాంపస్ మెల్లగా గడ్డ కట్టిపోయింది. నేను లాస్టియర్ చూశాను. కోటీవాళ్లు ఏదో ట్రై చేసి ఫెయిలయి... విసిగిపోయి... ఊరుకున్నారు.

సరే... ఇందాక నేను కాంపస్ లైఫ్ పరిశీలించాను అన్నాను. అంటే అవన్నీ నాకూ, నా పరిధిలోకి వచ్చినవే. కొత్త విద్యార్థులని కలిసి కొంత అబ్జర్వ్ చేశాను. వాళ్లతో తిరిగాను.

నా కర్థమయిందేమంటే...

ఓ కొత్తతరం క్యాంపస్‌ని ఆక్యుపై చేసింది. ఈ నాలుగైదేళ్లకే మనకర్థంకాని జనరేషన్. కాలేజీకి వచ్చే విద్యార్థులు కన్నుమూసి తెరిచినంతలో ఇంత మార్పుకి ఎలా గురయ్యారో ఆశ్చర్యంగా ఉంది.

మీరున్నప్పటిలా కాదు. అప్పటి ఆదర్శాలూ లేవు. ఇప్పుడు సమాజం గురించి ఆలోచించటమంటే, సమస్యలమీద కదలటమంటే నిన్ను పిచ్చివాడిలా చూస్తారు. వ్యవస్థ సరే... పక్కవాడి గురించే పట్టించుకోనంత మార్పు. తన చదువో, తన సరదాలో తప్ప మరే విషయమూ అనవసరం. నువ్వేదయినా చెప్పుబోయావా? వీడెవడో బోరెత్తిస్తున్నాడు అని అంటారు.

'ప్రాక్టికాలిటీ' అనే అంశం ఆదర్శం అనేదాన్ని తోసేసినట్లుంది. విద్యార్థుల్లో రెండు ధోరణులు వచ్చాయి ప్రధానంగా.

ఒకటి. తన కెరీర్ గురించి తప్ప ప్రపంచాన్ని పట్టించుకోని రకం.

రెండు. జీటీవీ, ఎమ్‌టీవీలకు అంకితమయ్యి దేన్నీ పట్టించుకోని రకం. ఈ ఇద్దరూ నిజానికి రెండు భిన్నధృవాలు కదా! వింత ఏమంటే ఈ ఇద్దరూ ఒక విషయం దగ్గర కలుస్తారు. ఒకేరకంగా ఆలోచిస్తారు. అది సామాజిక బాధ్యతని కల్పించుకోవటం అన్నదొకటే కాదు. ఎంటర్‌టెయిన్‌మెంట్.

సరదాగా ఎంజాయ్ చేసుకోవటం. ఏ డిస్కో క్లబ్‌లోనో, ఏ పబ్‌లోనో కలుస్తారు. ఓ గంట రెండు గంటలు సిటీవరకూ ఇలా జరుగుతోంది కాబోలు. బయట నాకూ తెలీదు.

ఇంకా ఆశ్చర్యమేమిటంటే కాంపస్‌లో అటెండెన్స్ ఘోరంగా పడిపోయింది. ఇదివ

రకు ఎన్ని ఉద్యమాలూ, బంద్‌లూ జరిగినా క్లాసులకి మాత్రం బాగా వచ్చేవాళ్లుకదా. ఇప్పుడలా కాదు. ఏ క్లాసూ... మా ఇంజనీరింగ్‌లాంటి ప్రొఫెషనల్ కోర్సులు తప్ప... నిండటంలేదు. ఏ పదిమందో వచ్చి లెక్చరర్ చెప్పే నోట్సు రాసుకొనిపోతారు. మిగిలినవాళ్లు ఆ నోట్సుని కాపీ చేసుకొంటారు. క్లాసులకి రావటం చేతగాని వాళ్ల లక్షణం అని నమ్ముతున్నట్లుంది. మరి మిగిలిన టైంలో ఏం చేస్తున్నారా అని చూస్తే...

మామూలు డిగ్రీలు పనికిరానివని వీళ్లు మనకన్నాముందే తెలుసుకున్నట్టుంది. ఏ కంప్యూటర్ కోర్సులో, ఏ డిప్లమానో... ఏ ఫ్యాషన్ టెక్నాలజీనో ఇలాంటి కోర్సులకి పోతున్నారు. పొద్దున పీజీ డిప్లమా ఇన్ కంప్యూటర్ అప్లికేషన్స్. మధ్యాహ్నం డిప్లమో ఇన్ పబ్లిక్ రిలేషన్స్, సాయంత్రం ఏ టోఫెల్ క్లాస్‌లకోపోయేవాళ్లూ ఉన్నారు. అలా కేరీర్ వేటలో దేన్నీ పట్టించుకోని రకం.

వీళ్లకి తోడు ఎలక్ట్రానిక్ మీడియాకి అంకితమయిన రెండో రకం.

ఆదర్శవాదాలు కుప్పకూలిపోయాయి. ఇదివరకు నేను 'మంచివాడిలా' బతకాలనుకునేవాడిని. అంటే అది సాధ్యమా కాదా అనేది అట్లా ఉంచి ముందు జీవితంమీద ఒక అంచనా, ఒక ఆదర్శం ఉండేది. ఇప్పుడు స్కూలువయసుకే మంచి జీవితం అంటే సాఫిస్టికేటెడ్ లైఫ్ కోసం ఏ దారితొక్కినా పర్లేదు. నీకు లాభం కల్గించేదేదయినా, ఏ పద్ధతిలో అయినా స్వంతం చేసుకోవటం. ఇదే ముఖ్యం. ఇవాళ క్యాంపస్‌లో 'ఐడియల్ హీ' ఎవరంటే హర్షద్‌మెహతా. సమాజం మార్చే తలనొప్పి మనకెందుకు? దాన్ని తెలివిగా వాడుకొని పైకిపోవటం ముఖ్యం అన్న అభిప్రాయం మెజారిటీకి ఉంది.

లెదర్ గూడ్సూ, పర్‌ఫ్యూమ్‌లూ, అలంక




రణ, కాస్ట్లీ వస్తువులూ లాంటివి ఎజెండాలోకి వచ్చేశాయి. వాటి గురించి ఆలోచనలూ, కలలూ ఇవే మామూలుగా రోజూ మాట్లాడుకునే అంశాలు.

క్యాంపస్‌ని ఊపివేసిన రాజకీయాలూ, ఉద్యమాలూ, ఇప్పుడు టెలిస్కోప్‌లో చూడాల్సిందే. కొన్నివేల మైళ్లదూరంలో అవి రాజకీయాలయినా సరే. మనం సరే జ్ఞానేశ్వర్ లాంటివాళ్లు కూడా ఒడ్డున పడిన చేపల్లా గిలగిల కొట్టుకొంటున్నారు. ఏ విషయం మీదా కదలని పట్టించుకోని... అది జడత్వమేనా? నువ్వేపిలుపయినా ఇవ్వు అభాసుపాలవ్వాల్సిందే. లీడర్‌షిప్ అనేది ఇవాళ శూన్యం. ఆ క్వాలిటీస్ ఎవరికీ లేవు. ఉన్నా వాళ్లు జనంలేని, కాడర్‌లేని లీడర్లే. ఆమధ్యదాకా మతోన్మాదం పెరిగిపోయిందని ఆందోళన పడ్డాం. వ్యతిరేకంగా కదిలించాం. ఇవ్వాళ మతం పని కూడా అయిపోయింది. మహాఅయితే ఓ బొట్టు పెట్టుకొని ఏ శనివారమో గుడికి పోవటం గొప్ప. ఇంకా కొద్దిగా అక్కడక్కడా జ్ఞానేశ్వరం లాంటివాళ్లు కల్పిస్తున్నా వెనకటి మతపునరుజ్జీవన ఉద్యమాలు కాదు వాళ్లవి. ఏవో లోకల్‌గా కొంతమంది కలిసి ఒక బ్యాచ్‌గా తిరగటం రైవల్స్‌మీద దాడిచేయటంవరకే వాళ్లపని.

మా బ్యాచ్‌కీ ఇప్పటికీ తేడా చూస్తే షాక్ కలుగుతోంది.

అర్జున్ అని డ్రగ్స్ తీసుకొనేవాడు. శశి అనే అమ్మాయికోసం చదువు వదిలేసి చివరికి ఎటో మాయమయిపోయాడు. ఇప్పుడు డ్రగ్స్ పెద్దగా వాడటం లేదు.

అర్జున్‌లాంటి చేతగాని వాళ్ళు... ఇది కొత్త జనరేషన్ అభిప్రాయం... ఇక కాంపస్‌లో ఉండబోరు. నచ్చిన, ప్రేమించిన వాళ్ళకోసం త్యాగం అనేది ఓ పెద్ద హంబక్... అని నమ్ముతున్నారు. చేతనయితే..."

ఏదో సంకోచంతో ఆగాడు శరత్.

పావనికి అర్థమయ్యి "చెప్పు శరత్. ఇక్కడ మనిద్దరం ఒక రోగనిర్ధారణ కోసం కూర్చున్న డాక్టర్లలాంటి వాళ్ళం. ఇద్దరం ఏమిటన్నది మర్చిపో. నీకు తోచింది నువ్వు ఫ్రీగా మాట్లాడు'' అంది.

ఓ గ్లాసు నీళ్ళు తాగి ప్రారంభించాడు.

"చేతనయితే పక్కమీదకు తీసుకెళ్లు. ఎంజాయ్ చెయ్యి... అండ్ ఫర్ గెట్. వదిలే సెయ్. దాని గురించి ఆలోచనలు నిరీక్షణలూ వేస్ట్.

ఈ సెక్సువల్ రిలేషన్స్‌లో అనూహ్యమయిన మార్పు వచ్చింది.

ఇదివరకటి బెరుకూ, మొహమాటం, సందేహాలూ లేవు. ప్రీమారిటల్... వివాహానికి ముందే అనుభవం లేకపోతే నువ్వో చవటవి. నీకో గర్ల్ ఫ్రెండ్ లేకపోతే ... అంటే స్నేహం కాదు అక్కడ... డేటింగ్ వ్యవహారం... నువ్వు బీ.సి. కాలంలోనే ఉన్నట్టులెక్క. నీ హెూదాకీ, విలాసానికీ చిహ్నంగా నీకో బైక్ ఉండాలి. లేదా కారు అయిన సరే. ఆ వెహికిల్‌మీద నీ డేటింగ్ పార్టనర్ ఉండాలి.

మళ్లీ... డేట్ అంటే అదే పని అనుకునేవు వాళ్ళకి. అది కేవలం సాయంత్రాలూ, రాత్రులు, కొన్ని గంటలవరకే. తర్వాత ఎవరి పనిలో, ఎవరి కెరీర్ వేటలో వాళ్లు. డేటింగ్ వ్యవహారాలు చాలా గమ్మత్తుగా ఉంటాయి. ఓ జంట కలిసిన రెండు గంటల్లోనే చాలా దూరం వెళ్ళిపోయి, సాయంత్రానికి విముఖత ఏర్పడి, ఇంక జన్మలో ఒకరిమొహం ఒకరు చూడని పరిస్థితీ ఉంది. మ్యూజికల్ ఛెయిర్స్‌లాగా రోజుకో పార్టనర్‌ని మార్చినా ఆశ్చర్యంలేదు. స్కోప్ లెక్కపెట్టటం ఓ ప్రెస్టేజియస్ వ్యవహారం. ఎంత వేగంగా రిలేషన్ ఏర్పడుతుందో అంతకంటే వేగంగా ముగుస్తుంది.

శాశ్వత, సుదీర్ఘ సంబంధాలు దాదాపుగా శూన్యం. వెనకటి దేవదాసూ పార్వతీ వగైరాలు సినిమా తెరమీద కూడా చూసి నమ్మలేని కాలం ఇది.

అలా స్నేహం- ప్రేమ ఇవన్నీ అర్థాలు మారిపోయి నాలాంటి వాళ్ళకి అర్థంకాని, చెప్పాలంటే భయంగొలిపేట్లు తయారయ్యాయి. స్నేహం అంటే ఇంతవరకులా మనసు విప్పి... తోడొకరుండిన అదే భాగ్యమూ... అనుకొనే ఐడియల్ భావం ఆవిరయిపోయింది. నీ మిత్రులే నీకు పోటీదారులు. కాబట్టి ఎవర్నీ నమ్మకు. ఎంత వరకూ ఉండాలో, ఉంచాలో అంతవరకే. వీలయితే తొక్కి పారేయటానికి కూడా వెనుకాడరు.

ఓ స్వంత ప్రపంచాన్ని సృష్టించుకొని టైం దొరికినప్పుడు, అవసరమయినప్పుడు బయటకొచ్చి ప్రియురాలితోనో, స్నేహితుడితోనో కాసేపు గడిపి రిలాక్సయ్యి మళ్ళీ నీ గుహలోకి నువ్వు వెళ్ళిపో, అవతలివాళ్ళూ అంతేనను కో, ఇలా ఉన్నాయి ఇంటరాక్షన్స్.

మొన్న ఆర్ట్స్ కాలేజి ముందు నుంచున్నాను.

వానలకి కరిగిపోతున్న రెడాక్సైడ్ నినాదాలు... గోడలనిండా... ఒకప్పుడు కోటివాళ్ళు రాసినవీ. జ్ఞానేశ్వర్ వాళ్ళు రాసినవీ. చాలా సింబాలిక్‌గా అన్పించాయి. అవి కరిగిపోతున్నాయి. గోడలు కూలిపోతాయా అనుకున్నాను.

వాటిస్థానంలో ముఖ్యంగా మా ఇంజనీరింగ్ కాలేజీలో... కొత్త రాతలు చూస్తున్నాను. బల్లలమీదా, గోడలమీదా, టాయిలెట్స్‌మీదా అవి బూతులని ఒక్క మాటతో చెప్పటం కష్టం. నువ్వు సైకాలజీ స్టూడెంట్‌వి కనుక... నువ్వు అర్థం చేసుకొంటావేమో... ఏ ఫ్రాయిడ్ లెన్స్‌నో తగిలించుకొని.

గాంధీ అంటే... మనం ఆయన సిద్ధాంతాన్ని విమర్శనాత్మకంగా చూసే వాళ్ళం. ఇవ్వాళ మా... కాలేజ్‌లో...

యూరినల్స్‌లో ఆయనకి వాళ్ళిచ్చిన స్థానం చూస్తే కొంత ఏడుపూ, కొంత నవ్వూ ఒకేసారి కలగలిపి... షాక్ తగుల్తుంది.




ఏమని రాశారంటే...

ది ఫ్యూచర్ ఆఫ్ ఇండియా ఈస్ ఇన్ యువర్ హాండ్స్. భారతదేశ భవిష్యత్తు మీ చేతుల్లో ఉంది. కింద ఎమ్.కె.గాంధీ. ఇది రాజకీయాలమీద నేటి ఆధునిక యువత ఇచ్చిన తీర్పు అని నేను భావిస్తున్నాను. అవే రాజకీయాలయినా సరే. ఏ ఉద్యమం అయినా సరే.

ఇదింకా నయం. కొన్ని రాతలు... అవి...

నేను ఎప్పటికీ నీతో చెప్పలేనేమో. రాతలకు తోడు గీతలు. వాత్సాయనుడ్ని తలదన్నే... చిత్రాలు.

ఏం సంస్కృతి? ఎలాంటి క్యాంపస్ ఎలా అయింది. ఇంకా ఆ రోజులు కళ్ళముందే కదలాడుతున్నాయి. సమాంతర విశ్వవిద్యాలయం... నడిచిన కాంపస్... ఏ సమస్య వచ్చినా ముందుకు దూకి... సమాజంలో ఒక కొత్త ఆలోచనని ప్రవేశపెట్టి... అనేక రకాల ప్రయోగాలు చేసి ప్రపంచానికి ప్రదర్శించిన ఆ క్యాంపస్... ఇదేనా?

పద్మజ కేసుతో... నాకు భయోత్పాతం కలుగుతోంది. ఒక తోటి విద్యార్థిని అంతగా హెరాస్ చేయబడితే... దిక్కులేని పరిస్థితి ఇప్పుడుంది. ఇంక ముందు ముందు ఏం కానుంది? ఈ తరం ఎటుపోతుంది?

ఇదంతా చూస్తూ ఊరుకోవటం... నాకయితే దుర్భరంగా ఉంది. ఏదో చెయ్యాలి? ఏదో... సమ్‌థింగ్.

ఒక్కసారి ఇందాక అనుకున్నాను. ఇదంతా నా భ్రమేనేమో! ఇదంతా నేను అతిగా భావించి భయపడుతున్నానేమో అని. ఇదంతా మీలాంటి వాళ్ళకి తెలీకుండా ఉంటుందా? మీరేదో ఒకటి ఆలోచించి ఉండరా?

శోటి... నిన్ను కలవమని దాదాపు నాలుగైదు నెల్లక్రితం అడ్రస్ ఇచ్చాడు. ఎందుకో... వాయిదా వేసివేసి... ఇక ప్రేక్షకుడిలా చూడలేక... వచ్చాను. ఇదంతా విన్నాక మీకు... నీకు నవ్వు రాదుకదా?"

"లేదు... నవ్వెందుకు?" అంది పావని. సైకాలజీలో రీసెర్చి చేస్తున్న పావని.

కొంతసేపు ఆలోచనలో మునిగింది. శరత్ నిశ్శబ్దంగా టీ తాగుతున్నాడు. బల్లమీద గీస్తున్నాడు... నీటి చుక్కల్ని కలుపుతూ.

"ఓ ప్రశ్న అడగనా శరత్. అఫ్‌కోర్స్. నీ వ్యక్తిగత విషయం?"

అదేంటి... అడుగు పావనీ, నువ్వేమని... అడిగినా నేను ఏమీ ఇబ్బంది పడను ముఖ్యంగా ఇవ్వాళ"

"ఏం లేదు. నీకు రాజు వాళ్ళు పరిచయమయ్యి... కొన్ని ఏళ్లు. నీ కాలేజ్ జీవితం మొదలయినప్పుడు. ఇంతకాలం నువ్వు నోరు విప్పి... మనసు విప్పి మాట్లాడింది... నాకు తెలిసి లేదను కొంటున్నా. అంటే... నువ్వు పాజిటివ్‌గానే వుంటానని తెలుసు. కానీ ఏ కార్యక్రమం అయినా అది మంచిదని తెలిసినా... నువ్వు మాతో కలిసిన జ్ఞాపకం లేదు. సపోజ్... కోటిలాగా''

శరత్ తల ఊపాడు కొంత బిడియంగా...

"అంటే... మిస్ అండర్ స్టాండ్ చేసుకోవు కదా! ఉదాహరణకి అశ్లీల ప్రతిఘటన... బూతు సినిమాలు, సంస్కృతీ నువ్వూ వ్యతిరేకిస్తావుకదా! కానీ నువ్వు అందులో పార్టిసిపేట్ చేయలేదు. ఎందుకనీ..."

కొంతసేపు మౌనం.

"తెలీదు. ఎందుకో కార్యక్రమంలోకి దిగటం అంటే... బెరుకు. ఇది ఒక్కటే అనికాదు. ఇన్‌జనరల్. బహుశా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ నాలో ఉంది కాబోలు''

ఒప్పేసుకున్నట్టు అన్నాడు.

"ఊహు! ఇన్‌ఫీరియర్ కాదు. అదొక చిన్న కారణం మాత్రమే. కొంత జడత్వం. కొంత నీ భవిష్యత్తుకు సంబంధించిన సందేహం"

శరత్ మొహం నల్లబడింది.

"అలా అవుతున్నావేం? నిన్ను ఆక్షేపించటం లేదు నేను. నేనంటున్నది... ను

వ్వేం కావాలో.. నీకేం కావాలో... నీ మార్గం ఏమిటో నిర్ణయించుకోలేదని అవునా?"

తల ఊపాడు శరత్.

"అది నీ తప్పు కాదు. నువ్వు పెరిగిన, జీవించిన పరిస్థితులు, నీ స్నేహితులూ, నీ దృక్పథం... నీ ఎదుగుదలా... ఇవన్నీ నిర్ణయిస్తాయి నువ్వేమిటో... అవునా?"

"అవును'' అర్థమయినట్లు తలూపాడు.

"సరిగ్గా అదే నువ్వు చెప్తున్న క్యాంపస్ పరిస్థితి. నువ్వన్నట్టు మొత్తంగా విద్యార్థి జీవితం... గడ్డకట్టుకుపోతూవుంది. డ్రై అయిపోతోంది. కానీ... వాళ్లంతటవాళ్లే ఈ పరిస్థితికి కారణం కాదు. నువ్వు ఊహించినట్టు వాళ్లు విలన్స్ కాదు. ఈతరం ఇలా అయిందంటే... యాదృచ్ఛికం. కన్ను మూసి తెరిచేంతలో ఆ మార్పు రాలేదు. అయితే మనం కూడా ఈ వేగాన్ని పసికట్టలేకపోయాం అన్నది వాస్తవం.

ముఖ్యంగా గత ఐదారేళ్లూ ఇంకా ముందునుంచీ... సమాజంలో ఒక మార్పు వచ్చింది. అప్పటి ప్రధానమంత్రి ఆశించిన కంప్యూటర్ యుగం... ఎట్లున్నా ఆర్థిక రంగంలో పుట్టిన సంక్షోభం వేగవంతమయ్యి సుడులు తిరిగి వ్యక్తినుంచీ గుంపుదాకా అందర్నీ ఒక సంక్షోభంలోకి నెట్టింది. నాకు తెలిసినంతవరకూ సమాజ జీవితంలో వచ్చిన ఆ పరిణామాలు క్యాంపస్ బయటా, లోపలా అనూహ్యమయిన పరిస్థితుల్ని సృష్టించాయి.

నువ్వన్నావే కెరీరిజం... క్యాంపస్‌లో విలయతాండవం చేస్తుందని. అంటే విద్యార్థి రంగంలో ప్రధానంగా వ్యక్తివాదం. తనకుతనే ముఖ్యం. మరే ఇతర విషయాలూ అనవసరం. నా భవిష్యత్తుకి అడ్డొచ్చే ఏ ఇతర విషయాల్నీ పట్టించుకోను. సమాజం నాకనవసరం. ఈ ధోరణి... ఇది రావటం క్యాంపస్‌లోనే జరగలేదు. మొత్తం సమాజంలోనే ఉంది.

నువ్వు విద్యార్థిని అంతగా నిరసిస్తున్నావే. వాళ్లా పరిస్థితికి రావటం వెనుక తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల బాధ్యతా లేదూ? ఆమాటకొస్తే తల్లిదండ్రుల్లోనే ఓ కొత్తతరం ఆవిర్భవించింది. ఇదివరకులా కనీసం గాంధీ, నెహ్రూ లేకపోతే దేశభక్తి.. అవి... కనీసం రేఖామాత్రంగానయినా ఇవాల్టి తల్లిదండ్రులకు తెలీదు. అనేకం వీళ్లకు అనవసరం. దేశం సంగతి ఏట్లోకి పోనీ. నువ్వు మంచి స్థానంలోకి పో. ఇదేకదా పిల్లలకి నూరిపోస్తున్నది.

ఉపాధ్యాయుల్లోనూ ఓ కొత్తతరం వచ్చింది. యూనివర్సిటీ అంటే ఓ గొప్ప సంస్థ. విద్యా, సంస్కృతుల సంగమం అని ఎవడయినా నమ్ముతున్నాడా? నీకు తెలీదు కానీ మేము మొదటినుంచీ క్యాంప్‌లో లెక్చరర్లతో, ప్రొఫెసర్లతో అనేకసార్లు ఘర్షణపడ్డాం. కులరాజకీయాలతో కుమ్ములాడుకోని యూనివర్సిటీ మన రాష్ట్రంలో ఒక్కటయినా ఉందా? వీసీనుంచీ ఆఫీస్‌బాయ్‌దాకా? ఎవరి కులస్థులను వాళ్లూ, ఎవరి విద్యార్థులను వాళ్లూ చీల్చి కత్తులు దూసుకొని అసలు సమస్యల్ని పక్కదారి పట్టించటంలేదూ? ఆ క్రమంలో అపాయింట్‌మెంట్‌లనుంచీ ప్రమోషన్లదాకా ప్రతిదీ కులనేపథ్యంలోనే జరిగి... ఆ రకమయిన కెరీరిజంతో అధ్యాపకవర్గం తలమునకలుగా ఉన్నప్పుడు...

విద్యార్థినుంచి ఏ స్పందనని ఆశిస్తాం?

చిత్తు కాగితాలకన్నా హీనమయిన డిగ్రీలూ... చదువులూ... బయట సంక్షోభం... ఈ అనిశ్చిత పరిస్థితి చుట్టుముట్టి ఉండగా ఏదొక పద్ధతిలో ఎగబాకి పైకి పోవాలన్న తపనలో... సమాజం సంగతి పట్టించుకొనే తీరికేదీ? నువ్వన్నావే పొద్దుట్నించి రాత్రిదాకా అనేక డిప్లమాలు సాధించేతరం అని.

సరిగ్గా అదే.

ఇవాల్టి విద్యార్థిమీద పడిన ఆ బరువు అతడిని పాతాళానికి తొక్కేసి ఒక సెల్ఫ్ సెంటర్డ్ మనిషిని సృష్టిస్తున్నాయి. ఆ చుట్టు




ముట్టిన పరిస్థితులకు తోడు... సాంస్కృతిక పతనం... ఎలక్ట్రానిక్ మీడియంతో మరింత వేగవంతమయింది.

ఆరకంగా విలువల రాహిత్యం రాజ్యమేలుతున్న కాలంలో... అన్నింటిలోనూ ముందుండి... ఒకప్పుడు ఉద్యమాల్ని సృష్టించి ఇవాళ బయట సమాజాన్ని కుదుపుతున్న ఉద్యమాల్ని... సృష్టించిన క్యాంపస్... సహజంగా ఈ విషయంలోనూ ముందే ఉంది. క్యాంపస్‌లో ఆవిర్భవించిన ఉద్యమాలు క్యాంపస్‌నొదిలి... బయట రగులుకొంటున్నాయి. క్యాంపస్‌ని అవి వదిలేశాయి. కాదు... క్యాంపస్సే వాటిని వదిలించుకొంది.

అలానే మళ్లీ ఇవ్వాళ క్యాంపస్‌లో వచ్చిన ఈ మార్పు... రేపు సమాజం ఎటు తిరగబోతోందో స్పష్టంగా... సిగ్నల్ స్థంభంలా మనకి తెలుపుతోంది.

నువ్వు తెలిసో తెలీకనో వేసిన ప్రశ్న... మనమేం చెయ్యాలి అని... అది... బహుశా భోజరాజుని సాలభంజిక అడిగినట్టు... అది చెప్పకుండా దీన్ని తప్పించుకొని అయితే మనం ముందుకు పోలేం. ఇవ్వాళ ప్రశ్నలు పెరిగిపోయాయి.

క్యాంపస్‌లో కెరీరిజం ప్రశ్న నువ్వు వేసినట్టే... బయట దాసూ, మాధవీ వేస్తున్న ప్రశ్నలు. నీకు తెలుసో లేదో సమాజంలో వచ్చిన ఇంకో మార్పు కేటగిరిస్టు ఉద్యమాలు. కుల, జెండర్, జాతి, మత, ప్రాంతీయ సమస్యలపై ఉద్యమిస్తున్న కేటగిరీలు. ఏ కేటగిరీకదే విడివిడిగా తక్షణ పరిష్కారాల కోసం పెనుగులాడుతున్న దృశ్యాలు.

నువ్వొంటుంటే ఇందాక ఒక విషయం గమనించాను. క్యాంపస్‌లో విద్యార్థికి తన సమస్యే తనకి ప్రధానం అని. సరిగ్గా అదే పరిస్థితి బయట కూడా''

ఊపిరి పీల్చుకొంది పావని.

"మరి ఏం చేయలేమా?" సందేహంగా అన్నాడు శరత్.

"కొంతవరకూ... ముందు మనం క్యాంపస్‌లో మళ్లీ ఏదొకటి ప్రారంభించటంద్వారా చేయగలమనుకుంటాను. ప్రధానంగా వ్యక్తి సమస్యనుంచీ సమాజ స్థాయికి నడిపించటం అనే పర్పస్‌తో ఒక కదలికను తేవాలి. అంతేకాక కెరీరిజం వగైరాలన్నీ విద్యార్థి సమస్యలకి పరిష్కారాలు కావుకదా! కేవలం ఒక అడ్డదారిలో పడిపోతున్నారు. ఆ దారి గమ్యానికి చేర్చదనీ... చేర్చినా కొందరినే ఆదుకొంటుందనీ మనం తెలుసుకోవాలి ముందు. వాళ్ల ప్రయాణం వేగంగా కన్పిస్తున్నా అది తిన్నగా... ఏ గోతిలోకో పడేస్తుంది మన ప్రభుత్వ పథకాలలాగా. ఎలాగూ ఆ భ్రమలనుంచి వాళ్లు బయటపడక తప్పదు. దానికంటే ముందు సాంస్కృతిక పతనం, విలువల రాహిత్యంమీద మన పోరాటం ఉండాలి..." చెప్పుకుపోతోంది పావని.

"నిన్నో ప్రశ్న అడగొచ్చా?" హఠాత్తుగా అన్నాడు శరత్.

"అదేంటీ కొత్తగా... అడుగు'' అంది.

"నీకేం సమస్యలూ లేవా పావనీ? అందరి గురించీ అన్నీ పట్టించుకొని..."

"నేనయినా... నువ్వయినా... మానవాతీతులం కాదుకదా శరత్! సమస్యలూ వత్తిళ్లూ వస్తూనే ఉంటాయి. వాటిని ఎదుర్కొంటూ అధిగమించుతూ... ముందుకు పోవటమే... మన లక్ష్యంవైపు. ఎందుకలా అడిగేవు?"

"ఏం లేదు. నా లక్ష్యం ఏమిటా అన్న సందేహంలోంచి నా ప్రయాణం ఎలా ఉండబోతుందా అన్నదాంట్లోకి వచ్చాను. నీ ప్రయాణం గురించి తెలుసుకుంటే అడ్డదారులు తప్పించుకోవచ్చని..."

అర్థమయినట్లు నవ్వింది పావని.

"మరింక కదులుదాం" అని నిలబడింది వాచీ చూసుకొంటూ. ఇద్దరూ నడుస్తున్నారు పక్కపక్కనే యూనివర్సిటీ వైపుగా.



# చతుర కతలు

## ఒకటి కాదు మూడు

"ఏమండీ మా నాన్న టి.వి. కొంటానంటున్నారు మనకి. ఏ కంపెనీ టి.వి. తీసుకుందాం?" ఆనందంగా అడిగింది శ్రీలక్ష్మి భర్త రామకృష్ణని.

"సంతోషం. కాని ఇప్పుడు మనకి టి.వి. ఎందుకు చెప్పు. ప్రస్తుతం హాయిగానే ఉన్నాం. టి.వి. వద్దని మీ నాన్నకి చెప్పు"

"ఛీ! మీరెప్పుడూ ఇంతే. అమ్మ పెట్టదు, అడుక్కు తిననివ్వదన్నట్లు మీరు కొనరు, మా పుట్టింటివాళ్ళు కొంటానంటే వద్దంటారు. అసలేంటి మీ ఉద్దేశం" కోపంగా అడిగింది.

"అబ్బ అది కాదే. నాకు మాత్రం ఇంట్లోకి అన్నీ అమర్చుకోవాలని ఉండదా, ఏంటి?"

"మరైతే మావాళ్లు ఏమిస్తానన్నా పుచ్చుకోరేం? వాళ్ళదేమన్నా పాపం సొమ్మనుకుంటున్నారా? లేకపోతే దొంగతనం చేసి మనకు వస్తువులు అమర్చిపెడతారనుకున్నారా?" గారంగా అలిగింది శ్రీలక్ష్మి.

"ఒకవేళ బ్లాక్ అండ్ వైట్ టి.వి. కొంటామని బావగారు వద్దంటున్నారేమోనే! కలర్ టీవీయే కొంటామని చెప్పు" అన్నాడు అక్కడే ఉన్న రామకృష్ణ బావమరిది. రామకృష్ణ ఆ మాటలు విని ఆనందపడతాడనుకున్నారు అక్కాతమ్ముళ్లు. కాని అందుకు విరుద్ధంగా "ఏం నాయనా! నేనిలా సుఖంగా, ప్రశాంతంగా జీవించడం మీకిష్టంలేదా? కోరి నన్ను కష్టాలపాలు చేసేందుకు ప్రయత్నిస్తున్నారు" అని రామకృష్ణ చిరాకుపడ్డాడు.

అంతే- శ్రీలక్ష్మికి కోపం కట్టలు తెంచుకుంది. "ఏంటండి మీ కష్టాలు? అత్తవారు అల్లుడికి టి.వి. కొనివ్వాలనుకోవటం తప్పా! అసలేంటి మీ ఉద్దేశం, ఇంతకుముందొకసారి



స్కూటర్ కొనిస్తామంటే వద్దన్నారు. పోనీ టేపురికార్డర్ అంటే అదీ వద్దన్నారు. వాళ్ళే మిస్తానన్నా వద్దనడంలో మీ ఉద్దేశమేంటి? ముందు నాకు సమాధానం చెప్పండి'' అని ఆవేశంగా అడిగింది.

ఆమెకు కన్నీళ్లు ఉబికి వస్తున్నాయి. ఇంకో అల్లుడైతే అది కావాలని, ఇది కావాలని అత్తమామల్ని వేపుకుతింటారు. కాని ఈయ నేంటి ఇలా ఏదిచ్చినా వద్దంటాడు. తన భర్త స్కూటర్ డ్రైవ్ చేస్తుంటే వెనుక కూర్చుని అతని నడుంచుట్టూ చెయ్యివేసి షికారు వెళ్లా లని తనకెప్పటినుంచో కోరిక. కాని అది నెరవేరలేదు.

టి.వి. కొనుక్కుంటే ఇంట్లో కాలక్షేపంగా ఉంటుంది. అందులో కేబుల్ టి.వి. స్టార్ టి.వి. ప్రోగ్రామ్స్ ఎంతో బాగుంటున్నాయి. ఈయన ఆఫీసుకు వెళ్ళినా తను వాటితో కాలక్షేపం చెయ్యొచ్చు. కాని ఈ మొండిమొ గుడువల్ల అవేం జరగడంలేదే.

అందుకే ఇక తాడో పేడో తేల్చుకోవాలను కుని "ముందీ సంగతి చెప్పండి, మావాళ్లు ఏది కొనిస్తానన్నా ఎందుకు వద్దంటున్నారో చెప్పండి. లేకపోతే నేను ఉరేసుకుచస్తాను'' అని ఆఖరిమార్గంగా బెదిరించింది.

అతని బావమరిది కూడా కల్పించుకుని "అదేంటి బావా, మేం సంతోషంగా ఏది ఇస్తామన్నా వద్దంటావు. అసలు నీ ఉద్దేశ మేంటి చెప్పు'' అనడిగాడు.

"మీరిచ్చేవి తీసుకోవాలని నాకు మాత్రం సరదాగా ఉండదా, ఏమిటి?" అన్నాడు రామ కృష్ణ.

"మరైతే ఇంకేం రేపే టి.వి. కొనిస్తాం" అన్నాడు బావమరిది సంతోషంగా.

"అలాగే కొనివ్వండి. అయితే ఒకటి కాదు మూడు కొనివ్వండి'' అన్నాడు రామకృష్ణ.

"ఏంటి మూడా? ఎందుకు?" ఆశ్చర్యపో యాడు బావమరిది. ఈ మనిషికిగాని పిచ్చె క్కలేదుకదా అనుకుంది భార్యామణి.

"ఎందుకంటావేంటి! మీరు ఆనందంగా టి.వి. కొనిచ్చిపోతారు. ఆ తర్వాత నా కష్టాలు మొదలవుతాయి. మా సంసార బా ధ్యత అంతా నాదేనని తెలుసుగా. ఈ టి.వి. సంగతి మా అక్క మొగుడికి, చెల్లి భర్తకి తెలుస్తుంది. దాంతో వాళ్లు నువ్వు మీ అత్త వారి దగ్గరనుంచి టి.వి. సంపాదించావుకదా! మరి మాకెప్పుడు కొనిస్తావని నా పీకమీద కూర్చుంటారు. ఏదో వచ్చిన జీతంరాళ్ళతో సంసారాన్ని సాఫీగా లాక్కుపోతున్నాను. ఇక ఇటువంటి బహుమతులు వాళ్ళిద్దరికీ నేనె క్కడ కొనివ్వగలను? అందుకే టి.వి.గాని, మరోటిగాని మీరిస్తానన్నా మా బావల భయంతోనే వద్దంటున్నాను.

మీకిప్పటికీ నాకు టి.వి. ఇవ్వాలనిపిస్తే- టీవీయే కాదు నాకేది ఇవ్వాలనుకున్నా ఒకటి కాదు మూడివ్వండి'' అని చెప్పాడు రామకృ ష్ణ.

ఆ మాటలు వినడంతో అక్కాతమ్ముళ్లు "ఆc" అంటూ నోరెళ్లబెట్టారు.

-తురాగో

---

## కునుకు

సిటీబస్సుల్లో నిద్రపోయేవారంటే యాదగిరి కి మహా చిరాకు.

"హ్యాపీగా బస్సులో కూర్చుని, దారమ్మ టపోయే జనాల్ని చూసుకుంటూ ఆనందించక, కుంభకర్ణుడిలా నిద్రపోతారే మిటి?" అని మనసులో చాలాసార్లు అనుకు న్నాడు యాదగిరి.

అతను వుండేది వనస్థలిపురంలో. అక్కడ నుంచి సిటీలోకి రావాలంటే బస్సులు విపరీ తమైన రద్దీ. అయినా పది, పదిన్నరకల్లా ఆఫీసులో వుండాలి కాబట్టి, ఎనిమిదిన్నరక ల్లా బస్‌స్టాప్‌కి వచ్చేసేవాడు యాదగిరి.




ఆ బస్సు ప్రయాణంలోనే లోవరాజు పరిచయమయ్యాడు. అతగాడు వుండేది ఎల్.బి. నగర్‌లో.

బస్సు ఎక్కిన మరునిమిషంనుంచి సీటు కోసం వెంపర్లాడేవాడు లోవరాజు. అవసరమయితే ఎదురు వచ్చినవాళ్లని తోసేసి, తన్నేసి, ఎలాగోలా సీట్‌లో సెటిలయ్యేవాడు లోవరాజు.

అక్కడితో అతగాడి నిద్రాపర్వం ప్రారంభమయ్యేది. కొద్దిసేపు కళ్లు సగం మూసుకుని, ఆ తర్వాత కునికిపాట్లు పడి, మరికాసేపు గుర్రుపెట్టి, కొంచెంసేపు చొంగ కార్చుకుని నిద్రలోని ఆనందాన్ని అనుభవిస్తుండేవాడు లోవరాజు.

అతణ్ణి చూస్తుంటే యాదగిరికి వళ్లు మండిపోయేది.

ఎలాగోలా లోవరాజు నిద్ర చెడగొట్టాలని యాదగిరి విశ్వప్రయత్నాలు చేస్తుండేవాడు.

"ఈరోజు పేపరు చూశారా?" అని పేపర్ యివ్వబోయాడు ఒకనాడు.

"పొద్దున్నే రేడియోలో ప్రాంతీయవార్తలు వినేశా'' అనేవాడు లోవరాజు.

సినిమాల గురించి, రాజకీయాల గురించి, వాతావరణం గురించి... ఇలా రకరకాల టాపిక్స్ గురించి మాట్లాడి, లోవరాజుని బస్సులో నిద్రపోనివ్వకుండా చేయాలని నానా తంటాలు పడ్డాడు- యాదగిరి తను నమ్మిన సిద్ధాంతం కోసం.

అయినా అతడి ప్రయత్నం ఇసుమంత కూడా ఫలించలేదు.

యాదగిరిలో సహనం నశించిపోయింది. ముఖాముఖీగా తాడో, పేడో తేల్చేసుకుందామని ఓ నిర్ణయానికి వచ్చేశాడు యాదగిరి.

"ఏం అన్నా, బస్సులో నిద్రపోవడానికి సిగ్గులేదా?" అనడిగాడు యాదగిరి.

లోవరాజు అతికష్టంమీద నిద్రలోనుంచి కళ్ళు తెరిచి యాదగిరిమీద ఓ 'అరచూపు' విసిరి, "ఏంచేయను, నాది ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం. నీలా గవర్నమెంట్ నౌఖరీ కాదు, నేను బస్సులోనే నిద్రపోవాలి! నీకయితే ఆఫీసులో నిద్రపోయే ఛాన్స్ దొరుకుతుంది'' అన్నాడు ఆవులిస్తూ.

ఆవులించకుండానే యాదగిరి నోరు తెరిచాడు.

-పుష్యమి

# నవ్వుకో! నవ్వించు!






'పొట్టివాడికి పుట్టెడు సమస్యలు' అని సామెతను మార్చుకోవచ్చు ఇతన్ని చూస్తే. ఇతడి పేరు గుల్ మహమ్మద్. ప్రపంచం మొత్తంమీద అతి పొట్టివాడుగా గుర్తించబడిన గుల్‌మహమద్ అతిగా పొగ తాగడంవలన ఊపిరి తిత్తులు, గుండె చెడిపోయి హాస్పిటల్‌పాలయ్యాడు. దుర్భర దారిద్ర్యంలో మగ్గుతున్న ఇతడు తనకు వైద్యనిమిత్తం ఆర్థిక సహాయం చేయమని మన కేంద్రప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖామంత్రికి పెట్టుకున్న అర్జీ బుట్టదాఖలు అయింది. అయినా ఇంత క్లిష్ట పరిస్థితుల్లో కూడా తాను నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ వుండటం మహమ్మద్ ప్రత్యేకత అంటున్నారు అతడిని ఆదుకుంటున్న మిత్రులూ, శ్రేయోభిలాషులు.

# చతుర ప్రపంచం

## ఎడారిలో చల్లని ప్రకృతి

'ఎడారిలో భూమి అడుగున మనిషి నివశించడం' అన్నది వింటే బహుశా ఏ సినిమాల్లోనో చూడ్డం సాధ్యమనిపిస్తుంది. కానీ... ఉత్తర ఆఫ్రికాలో వున్న సహారా ఎడారికి వెళ్లగలిగితే ఇలాంటి వింతలు మరిన్ని మన కళ్లముందు వుంటాయి.

'సహారా' అనేది అరబిక్ పదం. ఆ భాషలో దాని అర్థం ఎడారి అని 3500 మైళ్లపొడవు, 1200 మైళ్ల వెడల్పు గలిగిన ఈ విశాలమైన ఎడారిలో అమెరికా మొత్తాన్ని తీసుకొచ్చి పెట్టవచ్చు. ఇండియాలోని థార్ ఎడారుల్లాంటి వంద ఎడారులకి ఇది సరిపోతుంది. అట్లాంటిక్ మహాసముద్రానికి ఓ పక్కనుంచి మొదలై ఎర్ర సముద్రంవరకు ఈ ఎడారి విస్తరించింది. ఎవరూ ఇంతవరకూ ఈ సహార ఎడారిని పూర్తిగా దాటిన దాఖలాలు లేవు. ఈ ఎడారి ఎన్నో ప్రాంతాల గుండా సాగుతూ ఈజిప్టు, మొరాకో, అల్జీరియా, లిబియా, తునీషియా, మాలి, మారికోనియా మొదలగు ఎన్నో దేశాలకు విస్తరించింది. పొరపాటున ఈ ఎడారిలో కెళ్ళిపడితే బయటకు రావడం చాలా కష్టం. ఒక్క ఇసుక మైదానాలేకాక ఎన్నో కొండలు, బీడుభూములు కూడా ఈ ఎడారిలో కనిపిస్తాయి. 10 వేల అడుగుల ఎత్తున్న పర్వతాలు కూడా ఈ ఎడారుల్లో ఉన్నట్టు తెలుస్తోంది. అలాగే 600 అగుడుల ఎత్తున్న చిన్న చిన్న పర్వతాలు కూడా దర్శన మిస్తాయి.

ఇక్కడ భూమి ఉష్ణోగ్రత కూడా విచిత్రంగా, విభిన్నంగా ఉంటుంది ఒక పక్క చర్మం కాలే వేడివస్తుంది ఇసుకలోంచి. మరో పక్క ఎముకలు కొరికే చలిపుట్టిస్తుంది. ఇలాంటి వైరుధ్య వాతావరణాన్ని కేవలం సహారాలోనే చూడగలమంటున్నారు పరిశోధకులు.

పగటివేళ అత్యుష్ణం. రాత్రులందు అతిశీతలం. ఇలాంటి వైరుధ్యపూరిత వాతావరణంలో ఎవరు మాత్రం నివశించగలరు అనిపిస్తుందిగానీ మనిషి సాధించినలేనిదేదీ లేదన్నది కూడా నిజమేననిపిస్తుంది అక్కడ నివశించేవారిని చూస్తే.

విశాలమైన ఈ ఎడారిలో అక్కడక్కడ పచ్చనిచెట్లతో నిండిన చల్లని ప్రదేశాలు, చల్లని నీటితో నిండిన మడుగులు కూడా చాలానే వున్నాయి. అలాంటి ప్రదేశాలను వెతుక్కుని ప్రజలక్కడ నివశిస్తారు.

సహారాలో ఇలాంటి పచ్చని ప్రాంతాలు 90 చోట్ల వున్నట్లు కనుక్కున్నారు పరిశీలకులు. ఈ 90 ప్రాంతాలు 90 గ్రామాలుగా వెలసి అక్కడి ప్రజలు గోధుమ, జొన్న మొదలైన పంటలు పండిస్తారు. ఈ గ్రామాల్లో అతిచిన్నవి కూడా వున్నాయి. అక్కడ కేవలం ఒకటి రెండు కటుంబాలు మాత్రం నివశిస్తున్నాయి. ఈ 90 గ్రామాల్లో నివశించే మొత్తం జనాభా రెండు లక్షలు. ఇందులో చాలామంది అరబ్బులు, మూర్లు. ఆఫ్రికనులు కూడా అక్కడక్కడ వున్నారు.

చాలామంది సహారా ప్రజలు జిప్సీల్లా ఒకచోటనుండి మరొకచోటకు వలస వెడుతూ వుంటారు. వీళ్లు గొర్రెల్ని, మేకల్ని, ఒంటెల్ని మేపుతారు. వీటికి పచ్చగడ్డిని, నీటిని వెతుక్కుంటూ ఓ ప్రాంతంనుంచి మరో ప్రాంతాని





కి వెడుతూ వుంటారు జనం. ఖర్జూరపు చెట్లను ఎక్కువగా పెంచుతారు ఈ ఎడారి జనం. ఒక్కొక్కచెట్టు ఇచ్చే ఫలసాయంమీద వాళ్లకెంతో లాభం దొరుకుతుంది. అందుకే ఒక చెట్టుకి ఇద్దరు ముగ్గురు యజమానులుండి వచ్చే ఆదాయాన్ని సమంగా పంచుకుంటారు.

ఈ గ్రామాల్లో మరీ వేడిగా వుండే ప్రాంతాల్లో ప్రజలు గోతులు తవ్వుకుని అందులో నివశిస్తారు. దానివల్ల వేడినుంచి కొంత తప్పించుకోవచ్చునంటారు వాళ్లు. ఇసుక బాగా వుండే ప్రదేశాల్లో బల్లులు, పాములు, నక్కలు తిరుగుతూవుంటాయి. ఎడారుల్లో వుండే అన్ని జంతువులు నీరు తాగకుండా ఎక్కువ కాలమే వుండగలవు. అవి తినే ఆకులు అలముల్లో వుండే నీరే వాటికి దప్పిక లేకుండా వుంచుతుంది.

4000 సంవత్సరాలకి పూర్వం ఆఫ్రికాలో కొంతభాగం నీరులేక ఎండిపోవడం ప్రారంభించింది. అదే ఎడారిగా మారిందంటారు. అంతకుముందు ఇక్కడ ప్రకృతి పచ్చని వృక్షసంపదతో, చల్లని జలాశయాలతో, ఏనుగు, జిరాఫీ మొదలైన జీవజంతుజాలంతో ఆహ్లాదంగా వుండేదట.

ఈ ఎడారి భూగర్భంలో చమురు, సహజ వాయు నిక్షేపాలు, రాగి, ఇనుము, భాస్వరం మొదలైన ఖనిజ నిక్షేపాలు కూడా వున్నాయని... అయితే వాటి తవ్వకాలపని ఇంతవరకు ప్రారంభమవలేదనీ అంటున్నారు పరిశీ



లకులు.

అసలు ఇది ఎడారి కావడానికి ముఖ్యకారణం చెట్లను నరకడమే అంటారు వృక్షశాస్త్రజ్ఞులు. జిప్సీలు ఈ ప్రాంతాల్లోని చెట్లను నరకడం, గొర్రెలను, ఒంటెలను మేపడానికి పచ్చని గడ్డిని పీకడం, తిరిగి అవి మళ్ళీ పెరగడానికి తగిన కృషి చెయ్యకపోవడంతో భూమి అంతా బీడు పట్టి ఎడారి అయిందంటారు శాస్త్రజ్ఞులు.

అంతేకాదు పర్యావరణాన్ని రక్షించుకోకపోతే ఒక్క సహారాయే కాదు, ప్రపంచమంతా ఎడారిగా మారగలదని భయపెడుతున్నారు కూడా.

# సర్వభాషా సంగమం

న్యూయార్క్‌కి చెందిన జేమ్స్‌మార్కమ్ అనే లెబనాన్ సమాచార ప్రతినిధి 1976 జనవరిలో లెబనాన్‌లో జరుగుతున్న సివిల్ వార్ గురించి సమాచారం పంపుతున్నాడు. అంతలో కొంతమంది గెరిల్లా సైనికులు అతని కారునడ్డగించి అతను కేవలం అరబ్బీ భాషలోనే సమాచారాన్ని పంపాలని పట్టుబట్టారు. అదృష్టవశాత్తూ మొరాకో కూడా 'బెర్లిట్జ్ లాంగ్వేజ్ స్కూల్'లో అరబిక్ నేర్చుకుని వుండటంతో, వచ్చీరాని అరబిక్ భాషలో మాట్లాడి ఆ గెరిల్లాలనుండి ప్రాణాలను రక్షించుకున్నాడు.

'ఈ' బర్లిట్జ్ లాంగ్వేజ్ స్కూలు నూటఅ






యిదు సంవత్సరాల క్రితం స్థాపించబడింది. అటుపైన అనేకచోట్ల దీని అనుబంధ సంస్థలు స్థాపించబడి ఇప్పటివరకు దాదాపు మూడుకోట్లమందికి విదేశీభాషలు నేర్పింది.

దాదాపు పాతికదేశాల్లో 2,000కు పైగా వున్న ఈ బర్లిట్జ్ స్కూళ్ళు ప్రతి సంవత్సరం సుమారు రెండు లక్షలమందికి విదేశీ భాషలను నేర్పుతున్నాయి. మామూలుగా అందరికీ తెలుసున్న విదేశీ భాషలేకాక ఎవరికీ తెలియని పరిచయంలేని అమ్‌హారిక్, స్వాహిలీ లాంటి అపరిచిత మారుమూల విదేశీభాషలను కూడా నేర్పుతున్నాయి ఈ స్కూళ్ళు.

ఈ బెర్లిట్జ్ స్కూళ్లకి నియమింపబడ్డ అధికారి ఇటలీకి చెందిన ఇలియో బోసిటో. 1878 నుంచీ ఈ స్కూళ్లల్లో విదేశీభాషలు నేర్పబడుతున్నాయి. అప్పట్లో 26 సంవత్సరాల వయసుగల జర్మన్ భాషాధికారి మాక్సిమిలియన్ బెర్లిజ్ ఫ్రాన్స్‌కు చెందిన ఖాలాస్‌జోలీ అనే ఓలిఫ్ట్ ఆపరేటర్‌ని ఫ్రెంచి నేర్పేందుకు నియమించాడు. కానీ నియమించాకగానీ జోలీకి ఇంగ్లీషు రాదన్న సంగతి తెలియలేదు. జోలీని తొలగించి ఆ స్థానంలో మరో అధ్యాపకుణ్ణి నియమించే తీరికలేని బెర్లిట్జ్ కొద్దికాలం గడవనిచ్చి ఓరోజు జోలీ చెపుతున్న ఫ్రెంచి క్లాసుకి చాటుగా హాజరయ్యి పాఠాలు వినసాగాడు. కానీ... జోలీ ఫ్రెంచి నేర్పే పద్ధతి, పిల్లలు ఆ పాఠంలో నిమగ్నమయి వింటున్న దశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ తరువాత మరొక అధ్యాపకుడు వస్తే అతడు వ్యాకరణబద్ధంగా చెప్పే పాఠాన్ని అనుసరించలేక విద్యార్థులు మొత్తుకోగానే తిరిగి జోలీ ప్రవేశపెట్టిన వ్యావహారిక పద్ధతే ఉత్తమమని అతన్నే ఆ వృత్తి కొనసాగించమన్నాడు.

ఒక స్కూలు విజయవంతం కావడంతో బెర్లిడ్జ్ వివిధదేశాల్లో విదేశీ భాషా పాఠశాలలను మరిన్నిటిని స్థాపించాడు. అతడు చేపట్టిన ఈ విద్యావిధానానికి మొరాకో రాజు అత్యంత ఆనందంతో బెర్లిట్జ్‌ని సత్కరించాడు. ఈ స్కూళ్లనుంచి ఆఫ్రికాలోని ఎంతో వెనుకబడిన ఆటవికులు కూడా ఇంగ్లీషు మొదలైన భాషలను నేర్చుకున్నారు. వాళ్లు అత్యంత సునాయాసంగా ఆంగ్లంలో మాట్లాడటం అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది.

స్కూల్లోకి అడుగుపెట్టేటప్పుడు ఎలాంటి డిక్షనరీలుగానీ, వ్యాకరణ గ్రంథాలుగానీ వెంట తీసుకెళ్లడానికి వీలులేదు. భాషంతా ముందుగా బొమ్మల్లో నేర్పబడుతుంది.

ఈ స్కూళ్లల్లో పదివారాల చదువు పూర్తవగానే విద్యార్థి నేర్చుకుంటున్న సదరుభాషలోని 500 వ్యాహారిక పదాలదాకా నేర్చుకోగలుగుతాడు. ఆ భాషా జ్ఞానంతో సదరు దేశానికి కూడా వెళ్ళి అక్కడ సులువుగా అందరితోనూ కలిసిపోవచ్చంటున్నారు బెర్లిట్జ్ స్కూలువారు.

1929లో బెర్లిట్జ్ మరణానంతరం ఆ స్కూళ్ల ఆధిపత్యాన్ని చేపట్టిన అధికారులు బోధనా పద్ధతుల్లో ఎన్నో మార్పులను ప్రవేశపెట్టారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

